


ఆంధ్రపత్రిక జననం కిలకనామ సంవత్సర (1907) భాద్రపద శుద్ధ చతుర్దశి బుధవారం

# మన ప్రసిద్ధ దేవాలయాలు, పుణ్యక్షేత్రాలు


తాడిపత్రిలోని పల్లవులనాటి వెంకటరమణస్వామి దేవాలయం


ప్రతాపరుద్ర మహారాజు చేతను, కాకతివంశీయుల చేతను సేవింపబడుతూ వచ్చిన వరంగలులోని శ్రీ భద్రకాళీదేవి


ముఖలింగంలోని సోమేశ్వర దేవాలయం


సింహాచలం నరసింహస్వామి దేవాలయం


వినుకొండ రామలింగేశ్వరస్వామి దేవాలయం


మహానంది దేవాలయం


ఎల్లూరిపాలెం - సీతారామస్వామి దేవాలయం


కోటప్పకొండమీది కోటీశ్వరస్వామి దేవాలయం

← భట్టిప్రోలులోని శివాలయం - దాని చెంతనే మసీదూ. పూజలూ ప్రార్థనలూ ప్రశాంతంగా జరుగుతూ వుంటాయి.




మంగళగిరి లక్ష్మీనరసింహస్వామి ఆలయ గోపురం


అగిరిపల్లి కొండమీది మల్లేశ్వరస్వామి ఆలయపు అగ్రద్వార గోపురం


చిలకలపూడి పాండురంగవిఠల్ దేవాలయం


కరీంనగరుజిల్లా కొత్తకొండ వీరభద్రాలయం


మాచెర్ల చెన్నకేశవస్వామి దేవళగోపురం


అంతర్వేది లక్ష్మీనరసింహస్వామి దేవాలయం


కొలుల్ల చెన్నకేశవస్వామి దేవాలయం


కార్మాపురం దేవాలయం గాలిగోపురం


అన్నవరం సత్యనారాయణస్వామి దేవాలయం

# అహోబల

—రచన—

శ్రీ పరవస్తు వెంకట రామానుజస్వామి, యం. ఏ

శ్రీశైలము, అహోబలము, తిరుపతి అను మూడును రాయలసీమలో ముఖ్యములగు దేవాలయములు. ఈ మూడును పర్వతాగ్రములనున్నవి. శ్రీశైలమునుండి తిరుపతివరకును యున్నదంతయు నొకటే పర్వతమనియు యిది యాదిశేషుని దేహమనియు అందు శ్రీశైలము ఫాలము మీద నున్నదనియు, అహోబలము శరీరమునుండ దనియు తిరుపతి యాదిశేషుని తలయని చెప్పబడుచున్నదనియు నైతి హ్యము—శ్రీశైలము కర్నూలు జిల్లాలో నంద్యాలకు 30 మైళ్ళ దూరమున నున్నది.

## నవ నరసింహుల నివాసం

ఇది నరసింహక్షేత్రము. నవవిధ నరసింహులను నిచ్చట ప్రతిష్ఠించబడియుండుటచే నరసింహక్షేత్రములలో నిది ముఖ్యమైనది. హిరణ్యకశిపుని సంహరించుటకు విష్ణుమూర్తి యిచ్చటనే ప్రత్యక్షమయ్యెనని పురాణము. ఈ దేవాలయములోని యుక్కు స్తంభమును విలచి అహోబలమున స్వామి స్వయంవ్యక్తుడు పదిభుజములు కలిగి హిరణ్యకశిపుని సంహరించుచున్నట్లు యిచ్చట స్వామి తాం చేసియున్నారు. అందుచే నితనికి ఉగ్రనరసింహులు అని వ్యవహారము కొండదిగువను దేవాలయమున లక్ష్మీ నరసింహస్వామి ప్రతిష్ఠించబడియున్నారు. ఆయనకు ప్రహ్లాదవరదుడని వ్యవహారము కలదు. కొండమీదను భవనాశని తీర్థముకలదు. నరసింహస్వామి హిరణ్యకశిపుని సంహరించిన పిదప తనచేతుల నిందు కడిగినందున నిందలి తీర్థము రౌద్రగానున్నదని ప్రతీతి. కాకతీయ ప్రతాపరుద్రుడు ఉత్సవ విగ్రహమును ప్రతిష్ఠించెననియు, కృష్ణదేవరాయలు స్వామికి అనేక ఆభరణములను సమర్పించెననియు చరిత్రకారులు చెప్పుదురు.

అహోబలమునందలి పర్వతమునకు గరుడాద్రియనియు, వేదాద్రియనియు నామములనియు, యిది పూర్వము హిరణ్యకశిపుని భవనమునందలి యొక స్తంభమనియు, అందుచేతనే దీని ధారా క్రిందబడుటలేదనియు, యీ పర్వతమునకు వేదాద్రియని నామాంతరము కలదనియు, స్థల పురాణమున కలదు. ఈ క్షేత్ర మహోబలమైనటు క్షేత్ర మాహాత్మ్యములోని యీ క్రింది శ్లోకములు సూచించుచున్నవి.

> మహాసురం జలం తార్క్ష్య
> తేజసైక వరాహకం
> అహో వీర్య మహో
> శౌర్య మహో బాహుపరాక్రమః
> నరసింహః, పరం దైవ మహో
> బలమహో బలం
> తదాప్రభృతి హోబలం క్షేత్ర మిదం
> తాపద్యవిఖ్యతిః

ఈ క్షేత్రమున వైఖానసాగమానుసారముగా పాంచరాత్ర పద్ధతిని జరుపబడుచున్నవి.

## అహోబల మఠస్థాపన గాథ

అహోబలక్షేత్రమున క్రీ శ 15వ శతాబ్ద ప్రారంభమున యహోబల మఠము స్థాపించబడినది. ఈ మఠ ప్రాదుర్భావ మీ క్రిందివిధముగా జరిగినదని దానిగురుపరంపరలో వర్ణించబడి యున్నది. మేల్కోట యదుగిరియని ప్రసిద్ధమైన తిరునారాయణపురమున కేశవాచార్యుడను శ్రీవైష్ణవ బ్రాహ్మణుడు 14వ శతాబ్దమున నివసించుచుండెను. ఆయనకు 1379 సం॥రమున శ్రీనివాసాచార్యుడను పుత్రుడు జన్మించెను. ఇతను తనతండ్రిగారి వద్దనే దివ్యప్రబంధమును నేర్చెను. తిరువాతి తండ్రిగారి యాదేశమున కాంచీపుర నివాసులగు ఘటికాశతకం వరదాచార్యులు గారివద్ద దేశాస్త్రా శాస్త్రము నభ్యసించెను. కాంచీపురమున విద్యాభ్యాసము చేయుచుండగా నొకదినమున అహోబలములో గరుడాచలముననున్న నరసింహస్వామి స్వప్నమున ప్రత్యక్షమై శ్రీనివాసాచార్యునితో నిట్లు పలికెను "నీవు మా అహోబలమునకు రావలయును నీకు సన్యాసాశ్రమము నిచ్చి నీ మూలముగా లోకమునకు గొప్ప కార్యమును నెరవేర్ప సంకల్పించియున్నాము" అని చెప్పి స్వామి తిరోహితుడయ్యెను. శ్రీనివాసాచార్యుడు మరునాడీయుదంతమును తన గురువు వారికి నివేదించెను. ఆయన యీ యద్భుత విషయమును విని, "స్వామి ఆదేశముటయినచో నీవు అహోబలమునకు వెళ్ళిరమ్ము" అని యాదేశించెను. శ్రీనివాసాచార్యుడు అహోబలమునకు పోయి, తీర్థమాడి, స్వామి దర్శనము చేసి, వారి యాదేశమును నిరీక్షించుచు అంజలి బంధముతో నిలుచుండెను. అప్పుడు ఆ యాలయ ధర్మకర్తయగు ముకుందదేవరాయలు వారిని సమీపించి యిట్లు పలికెను "స్వామీ, అయిదారు దినములకు పూర్వము శ్రీ నరసింహస్వామి నాకు స్వప్నములో కనబడి యిటానతిచ్చెను 'కాంచీపురమునుండి నా భక్తుడొక డిక్కడికి రాగలడు సన్యసించి నన్నారాధించుచుండమని యతనిని ప్రార్థించి నన్నతనికి సమర్పింపుము నన్ను నతానిలో నుంచి ప్రతి గ్రామమునకు ప్రతి గృహమునకు సంచరించుచు శిష్యులకు సమాశ్రయణ గ్రంథాప దేశాదులను చేసి తరింపజేయ మఠాధిపతిగా నతనిని జేసి యతనికి భద్రచామరాద్యుపకరణములను సమర్పింపుము నీవు అతని శిష్యుడవై కృతార్థుడవగుము' అని స్వామి మీ రైనచో నన్నను గ్రహింపుడు" అప్పుడు శ్రీనివాచార్యుడు తన స్వప్న వృత్తాంతమును రాజునకు విన్నవించెను ఇట్లు వారిద్దరును తమ తమ స్వప్న వృత్తాంతములను చెప్పి యాశ్చర్య పడుచుండగా నచ్చటి వారి నొక్క సన్యాసి సమీపించెను. నీ వివరని వారిద్దరు నడుగగా "నే నిచ్చటనుండు నొక యతిని నా పేరు లక్ష్మీనృసింహాంకుడు" అని సమాధాన మిచ్చెను శ్రీనివాసాచార్యుడు అతనికి తన స్వప్న వృత్తాంతము నెరింగించి, అతను సాక్షాత్తుగా లక్ష్మీ నృసింహుడని యెరింగి "నీవే నాకు మంత్రోపదేశము చేసి, త్రిదండమును ధరింపజేసి సన్యాసాశ్రమమును ప్రసాదింపుము. నేను నీ శిష్యుడనగుచున్నాను" అని అతనిని ప్రార్థించి సాష్టాంగ ప్రణామము నాచరించెను అతను శ్రీనివాసాచార్యుని ప్రార్థన నంగీకరించి, అతనికి సన్యాసాశ్రమమును ప్రసాదించి శఠకోప యతియని పేరు పెట్టి యంతర్హితు డయ్యెను ఈ విషయము యీ క్రింది మంగళ శ్లోకమున సూచింపబడి యున్నది.

> "అహోబలే శ్రీ నృసింహః
> మైత్రిః మంత్రం ప్రయమం దదౌ
> యోగిరూపేణ యస్మాత్ సైఃష
> శఠకోపాయ మజ్జలమ్"

అహోబలములో సేంచేసి యుండు నవవిధ నృసింహ మూర్తులలో మాలోల మూర్తిని యారాధించుచు శఠకోపయతి కొంతకాల మచ్చటనే యుండెను తిరువాతను మాలోల మూర్తిని పవారియందు సేంచేపుచేసి ముకుంద దేవరాయలు సమర్పించిన పరిజన పరిచ్ఛదములతోను వాద్య ఘోషములతోను బయలుదేరి పురుషోత్తమ క్షేత్రమునను వెళ్ళిరి అచ్చట ఆళ్వార ఆచార్యులను ప్రతిష్ఠించి ప్రయాగకు వెళ్ళి అచ్చట యొక మఠమును స్థాపించి సంచారక్రమమున కర్ణాటదేశమును చేరెను అచ్చట ముకుందదేవరాయల సామంతుడగు కర్ణాట దేశరాజు వారి శిష్యుడయ్యెను ఈ విషయమంతయును యీ క్రింది వాసన్తికాపరిణయములోని శ్లోకమున సూచింపబడి యున్నది

> "పూర్వం యస్తు ముకుంద దేవ విభునా
> సక్తైః స్తైః ధృతి ందోలికః
> ప్రాప్తః శ్రీ పురుషోత్తమం
> రచితవాన్ భక్తప్రతిష్ఠాపనమ్
> లబ్ధ్వా దత్తిరుదరపర
> తీర్థాచ్ఛత్రద్వయాచామర
> ద్వంద్వాదీన యయౌ పునః
> విజయీ కర్ణాట సింహాసనమ్"

నిబిడకానన కుంజాలమధ్య వెలసిన, ఎగువ అహోబలంలోని ఆలయాల దృశ్యం

## ఆదివణ్ శఠకోప ఆవిర్భావం

తిరువాత సంచారక్రమమున ఆళ్వార్ తిరునగరి యను ప్రసిద్ధక్షేత్రమును చేరిరి. అచ్చట తత్పూర్వము ఆదినాథదేవాలయములోని నమ్మాళ్వార్ల యర్చావిగ్రహము నెవరో యొక జలాశయమున పారవైచి తత్స్థానమున ఏకాదశ రుద్రులను ప్రతిష్ఠించిరని విని తనను సేవించుటకు వచ్చిన యీ దేశాధీశ్వరునకా వృత్తాంతము నెరింగించెను. అతను శ్రద్ధతో వెతికించగా నా విగ్రహము జలాశయమున దొరికినది. దానిని తిరిగియు నాదినాథాలయమునను నందలి యేకాదశ రుద్రులను తామ్రపర్ణ్యా తీరతీరమునను ప్రతిష్ఠింపజేసెను. మంటపాదులను కట్టించి యథాపూర్వ ముత్సవాదులను జరిగించుమని రాజాజ్ఞాదేశింపగా నతడట్లు చేసెను. అనతికాలములో దు కలిగిన ప్రతిపత్తిచే నా రాజాయన విగ్రహమును మంటప పశ్చిమభాగమున స్థాపించెను. అచ్చట నొక యుత్సవ సమయమున నమ్మాళ్వార్లు ఆయనను 'నీవు విశిష్టాద్వైత దర్శనమును స్థాపించుచుండుమని' అనుగ్రహించి, తన చేతిలోని కాంచన ముద్రను ఆయనకిచ్చి, భగవన్నామకదేశముగు ఆదిపదమును తన యాచార్యనామకమగు వణ్ పదమును కలిపి 'ఆదివణ్ శఠకోపజీయర్' అని యాయనకు బిరుదము నిచ్చెను. తిరువాత నచ్చట వేదాన్తదేశికుల విగ్రహమును ప్రతిష్ఠించి వారికి యుత్సవాదికముల నేర్పాటు చేసెను.

యతులు శ్రీ ఆదివణ్ శఠకోప యతుల వలె మిక్కిలి ప్రతిభాశాలియై యుండెను. పంచమత భంజన తాతాచార్యులు యీయన భాగినేయుడును, శిష్యుడను. ఈయన పదునాలుగువర్షములు పీఠాధిపత్యమును వహించి, అహోబలమున జ్వాలానృసింహ దేశము ననుసరించి వారి నారాధించుటకై వారి గుహను ప్రవేశించి తిరిగి పైకి రాలేదు. సిద్ధాంత మణిదీపము, పంచకాలదీపిక, ప్రపత్తి ప్రయోగము, నృసింహస్తవము మొదలయిన గ్రంథముల నీయన రచించెను.

ఈయన తిరువాతి నేడవ పీఠాధిపతి శ్రీవణ్ శఠకోప శఠకోపయతి. ఈయన గొప్పకవి. శతావధాని. వాసన్తికా పరిణయమను నాటకమును రచించెను.

పదియారవ పీఠాధిపతియగు శ్రీవణ్ శఠకోప శఠకోపయతి (1694-98) వద్ద సన్యాసాశ్రమము స్వీకారము చేసిన శేషశఠకోపయతి, ఆచార్యునియాదేశమున తిరువాయ్ మొయ్‌కి పదునెనిమిది వేల పరిమితికల వ్యాఖ్యానము రచించెను. విశ్రగుణాదర్శము లక్ష్మీసహస్రము, ప్రద్యుమ్నానము విధ్రతయ ఎర్రితాణము మీమాంసా మకరన్దము, మొదలగు బహుగ్రంథకర్తయగు వెంకటాధ్వరి యీయనవదనే శ్రీభాష్యాది సంప్రదాయ గ్రంథములను నేర్చెను.

## సోమభూపాలుని కైంకర్యము

గద్వాల్ సంస్థానాధీశుడగు సోమ...

ధనమును కానుకలతో కలిపి స్వామికి నివేదించి గోష్ఠిలో వినియోగము చేసి గర్వభంగము చేసెను.

## దొంగలకు శృంగభంగం—శరణాగతి

ముప్పదియారవ మఠాధిపతియగు శ్రీవణ్ శఠకోప శఠకోపయతి తిరిగియు గొప్ప ప్రభావశాలి; లక్ష్మీనృసింహుని సాక్షాత్కరించికొనువారు యోపమునందున బుద్ధియందును విద్యయందును ప్రవచనమునందును, భగవదారాధనమునందును, లౌకికకార్యములందును, అసామాన్యుడు. మఠమునకు గొప్ప యభివృద్ధిని కలిగించెను. ఈయన మైసూరు రాజ్యమున సంచారము చేయుచుండగా నొక యాశ్చర్యమైన సంఘటన జరిగినది. మల్నాడు ప్రాంతమున అరణ్య ప్రదేశములగుండా పోవుచు నొక కొండప్రక్కను విడిసిరి. అప్పుడు బహుసంఖ్యాకులగు దొంగలువచ్చి వారిని దోచుకొనుటకు ముట్టడించిరి. ఈ విషయము నెరింగి శఠకోపయతి దొంగలనాయకుని రప్పించి వానితో నిట్లు చెప్పెను "మా దగ్గరనున్న ఆభరణములు యన్నింటిని యిచ్చుట కాక్షేపము లేదు. కాని యొక్కమారు అన్నిటిని స్వామికి సమర్పించి దోలోత్సవము చేసి ఆఖరుసారి అలంకరించి యిచ్చి వేయుదును" అట్లు చెప్పగా దొంగల యధిపతి సంతసించి యంగీకరించెను. అట్లుత్సవము జరుగుచుండగా దొంగల మధ్యను గొప్ప కోలాహలమును హాహాకారమును పుట్టెను. అప్పుడు దొంగల యధిపతివచ్చి స్వామికి సాష్టాంగముగా నమస్కరించి తమాపణమును కోరుకొని స్వామి యాభరణముల నపహరించుటకు మాకుగా విశేషముగా కానుకలను సమర్పించి తీర్థప్రసాదములను గ్రహించి వెళ్ళిపోయిరి. వారి ప్రవృత్తిలో నిట్టిమార్పు కలుగుటకు కారణమేమని యడుగగా "మా ఎదుట అనేక సింహములు కనబడి బెదరించుటచే అట్లు మరలిడితిమి" అని ప్రత్యుత్తర మిచ్చిరి.

ముప్పది నాల్గవ మఠాధిపతి శ్రీవణ్ శఠకోప శఠకోప రామానుజయతి గొప్పపండితులు. అధికరణ సారావళి వ్యాఖ్యానమగు కల్పతరువు, వ్యాకరణవింశతి వ్యాఖ్యానము కవి హృదయరంజని పకర్మ శాస్త్ర సమర్థనము అనన్యత్వ నిర్ణయము, బ్రహ్మసూత్రార్థ పరి సారదీపికా హృదయము, మొదలగు అనేక గ్రంథములను రచించెను.

తిరిగి ముప్పది యేడవ మఠాధిపతి గొప్పపండితులు. ఆయన పేరు శ్రీవణ్ శఠకోప వీరరాఘవ శఠకోపయతి. ఈయన అదేశమణి, దాని వ్యాఖ్యానము, శ్రీమద్దర్పణము, తత్త్వయుక్తి విచారము శారీరక ప్రకాశము, శ్రుతిగీతావ్యాఖ్యానము, తారసారము దాని వ్యాఖ్యానము దానదీపి సమర్థని, మకారంధు మొదలగు బహుగ్రంథములను రచించెను.

నలుబది యవ పీఠాధిపతియగు శ్రీవణ్ శఠకోప రఘునాథ శఠకోపయతి మంత్రసిద్ధిగలవారు, విశేషముగా సంచారము చేయుచుండెడివారు. మఠమునకు విశేషముగా ధనమును సంపాదించెను. శ్రీ భాష్యార్థమణిప్రవాళ దీపిక శ్రీ సత్సంప్రదాయ ప్రకాశికా మొదలగు గ్రంథములను రచించెను.

నలుబది యొకటవ స్వామియగు శ్రీవణ్ శఠకోప లక్ష్మీనృసింహశఠకోపయతి మఠముయొక్క స్థిరాస్తిని అధికము చేసెను.

నలుబది రెండవ స్వామి, శ్రీవణ్ శఠకోప శ్రీ రఘ శఠకోపయతి, కొద్దికాలము క్రిందనే పరమపదించెను. వీరు మొట్టమొదట కుంభకోణము, మైసూరు, కాశీ నగరములలో తర్కశాస్త్రము నభ్యసించి తిరువాత శ్రీమత్కృష్ణమాచార్యులగారివద్దపూర్వ తరమీమాంసల నభ్యసించెను. నలుబది యొకటవ పీఠాధిపతి యాజ్ఞపై వివాదియా స్థానమున పండితులుగా నుండుట కంగీకరించెను. కొంతకాలముండగా శ్రీ లక్ష్మీనృసింహ శఠకోపయతులకు గొప్ప శరీరాస్వస్థము కలుగగా వారు తమ తరువాత పీఠాధిపత్యమును వహించుటకు వీరే తగిన వారని విశ్వయించి వారిని పిలిచి వారికి సన్యాసాశ్రమమును యిచ్చెను. కాని దైవానుగ్రహమువల్ల వారికి స్వాస్థ్యము కలుగగా వారితో పాటు వీరును పీఠాధిపత్యమును వహించి పండ్రెండు సంవత్సరములు గడిపిరి. అప్పుడువారు పరమపదించగా శ్రీ రఘ శఠకోపయతులు స్వతంత్ర పీఠాధిపతులయ్యెను. వీరు న్యాయసిద్ధ మీమాంస, ఉక్తిసాధిరణం, ఉక్తి సాధిరణోద్యోతము అను గ్రంథములను రచించిరి ఒక ప్రబంధవేద పాఠశాలను ఒక సంస్కృత పాఠశాలను స్థాపించిరి. నృసింహ ప్రియయను మాసపత్రికను నడుపుట కారంభించిరి. వీరు కొద్దికాలము క్రిందనే పరమపదించగా యిప్పుడు మఠము నలుబది మూడవస్వామిచే యధిష్ఠింపబడి యున్నది.

## 'తెంగల'నుంచి 'వడగల'కు

ఇట్లు పీఠము అహోబలక్షేత్రమున స్థాపింపబడి ప్రారంభమైనను ఆ గ్రామము చిన్నదై నివాసమునకును ప్రచారమునకు ననువు కాకపోవుటచే మఠాధిపతులు తరుచుగా తమ కైంకర్యమున కనుకూలమగు గ్రామాంతరములలోనే కాలమును గడిపినట్లు తెలియుచున్నది. ప్రారంభ మఠాధిపతులు కొందరు తెన్నాచార్య సంప్రదాయము ననుసరించిన వారుగా నుండినట్లు తెలియుటచే నీమఠము తెంగల మఠముగా ప్రారంభమై తరువాత క్రమముగా వడగల మఠముగా మారినట్లు తోచుచున్నది.

# నరసింహస్వామి

తరుపరి యాయన తిరిగియు నుత్తర దేశ యాత్రను సాగించి, ప్రతివాదులను యోడించి రామానుజ సిద్ధాంతమును స్థాపించుచు అనేక దివ్యసలములలో నాళ్వారాచార్యుల విగ్రహముల ప్రతిష్ఠించుచు, అనేకమంది శ్రీభాష్యాది సంప్రదాయగ్రంథములను బోధించుచు అహోబలమఠమును స్థాపించెను. ఈయనే తిరుపతి కొండకు మెట్లను, కాంచీపురమున శ్రీవరదరాజస్వామికి నూరుకాళ్ళమంటపమును, శ్రీరంగనాథస్వామి దేవాలయమునకు ఉత్తరగోపురమును, తిరునారాయణపురమునకోవిల గోపురమును కట్టించెనని చెప్పుదురు. ఇట్లు అనేక కైంకర్యములను సలుపుచు అరువది వర్షములు పీఠాధిపతిగా నుండి తిరునారాయణపురమున డెబ్బదిలోమ్మిదవ వయస్సున పరమపదమును పొందెను.

## అన్నమాచార్యుల సమాశ్రయణం

శృతిరత్నాకర గృహ్యరత్నాకరం భూషణాది బహుగ్రంథకర్తయగు సుప్రసిద్ధ వైదిక సార్వభౌముడును, సంధ్యావందన భాష్య రహస్యత్రయ తివాది ప్రభృతి గ్రంథకర్తయు యనంతర పీఠాధిపతియునగు సంపాకం శ్రీమన్నారాయణ మునియును, యీయన శిష్యులే తిరుపతి శ్రీ వెంకటేశ్వరునిపై యనేక వేల సంకీర్తనములను రచించి పాడి భక్తిరసమును తనివి తీర యనుభవించిన తాళ్ళపాక అన్నమాచార్యుడు వీరివద్దనే సమాశ్రయణమై వైష్ణవమతమును స్వీకరించెను. అందుచేతనే తాళ్ళపాక అన్నమాచార్యుల సంకీర్తనలు చెక్కబడియున్న కొన్ని రాగిరేకులు అహోబల శ్రీ నరసింహస్వామి దేవాలయమున యుంచబడియుండెను.

శ్రీ ఆదివణ్ శఠకోపయతీంద్రుని తరువాతను ఆయన స్థాపించిన మఠమునకు ఆయన శిష్యుడగు శ్రీ నారాయణముని యధిపతి యైరెను. ఈ స్థానమునకు వచ్చినవారి నందరిని 'శ్రీవణ్ శఠకోప' యను పదములను ముందు చేర్చి చెప్పుటయే యీ మఠాచారము. అందుచే యీ రెండవవారిని శ్రీవణ్ శఠకోప శ్రీ నారాయణయతి యని వ్యవహరించిరి. ఈయన గొప్ప పండితుడు. బహుగ్రంథకర్తయగు గిరీశుడు స్వప్నమున నాదేశించుటచే యీయన శ్రీ ఆదివణ్ శఠకోపయతీశ్వరుని విగ్రహము నచ్చట ప్రతిష్ఠించెను.

తిరువాతి మఠాధిపతులలో నారవ వారగు శ్రీవణ్ శఠకోప షష్ఠాంకుడు...

భూపాలుడు యిరువది నాల్గవ పీఠాధిపతియగు శ్రీవణ్ శఠకోప పరాంకుశ రామానుజ మునికి శిష్యుడైన శ్రీ లక్ష్మీనృసింహస్వామికి అనేక ఆభరణములను నిత్య తదియారాధన మగుటకు కొన్ని గ్రామములను సమర్పించెను. ఇరువది యైదవ పీఠాధిపతియగు శ్రీవణ్ శఠకోప శ్రీనివాసయతి ఆరవ పరాంకుశస్వామివలె గొప్ప ప్రభావశాలియు మంత్రసిద్ధికలవారునై యుండెను. మంత్రశక్తిచే శాత్రవులను ఆపదలనుండి రక్షించుచుండెను. దురాత్ముల్యు ప్రయోగించిన విషమును జీర్ణించుకొనెను. తనకు హాని చేయబూనిన మాంత్రికుని జయించి లొంగదీసుకొనెను. విద్వద్వంశమునకు చెందిన సురపురం వెంకటాచార్యులు గారి ని శ్రీభాష్యగ్రంథమున వాదములో జయించి వారివల్ల గొప్ప మన్ననను పొందెను. వెనుకను పేర్కొనిన గద్వాల్ సంస్థానాధీశుడు వీరినిగూడ విశేషముగా గౌరవించెను. స్వప్నమున ప్రత్యక్షమైన శ్రీ నృసింహస్వామి యాదేశమున తంజావూరు రాజగు శరభోజి మహారాజా యీయనను విశేషభక్తితో సన్మానించి గ్రామమును సమర్పించెను. కుంభకోణ నగర సమీపమునున్న నృసింహపురమను అగ్రహారము యీయన తన పేరుతో కల్పించినదే. ఈయన ముప్పదియైదు సంవత్సరములు పీఠాధిపతిగానుండెను. సచ్చరిత్ర రత్నావళి, శ్రీ నృసింహస్తవము, శ్రీ నృసింహ మంగళాశాసనము, అను గ్రంథములను రచించెను.

ఇరువది యారవ పీఠాధిపతియగు శ్రీవణ్ శఠకోప రంగనాథయతి పై శ్రీనివాస యతికుమారులు — మైసూరు మహారాజగు కృష్ణరాజ వుడయార్ చేత గౌరవింపబడినవారు— రఘునాథపురమను అగ్రహారమును దానము చేసెను. ఆహ్నిక గ్రంథమును రచించెను. ఈయన కుమారులు శ్రీవణ్ శఠకోప వీరరాఘవ యతి యిరువది యేడవ పీఠాధిపతియైరయ్యెను. వైకుంఠ విజయము, చండమారుత వ్యాఖ్యానము మహాభాష్య వ్యాఖ్యానము, వ్యాసోల్లాసము కృపాసాగర స్తవము మొదలగు సుమారు ముప్పది గ్రంథములను రచించెను.

ఇరువది యెనిమిదవ పీఠాధిపతి శ్రీవణ్ శఠకోప శ్రీరంగనాథ శఠకోపయతి— మంత్రసిద్ధికలవారు, నృసింహుని సాక్షాత్కరించుకొనినవారు. తన మంత్రశక్తిచే ఆశ్రితజనుల బాధలను నివారించుచుండెను. విజయముగా భగవద్భక్తిలేక ధనమదముచే విశేష ధనమును సమర్పించిన ప్రభువునకు అ...

యధిపతివచ్చి...

---

ఆంధ్ర హృదయమునకు శ్రీరాముడు కులదేవత

—దేశోద్ధారకుడు

## భద్రాచలంలోని శ్రీరామ ఆలయ ప్రాముఖ్యం

### ఆంధ్రుల అభిమాన దైవం

శ్రీరామచంద్రమూర్తి ఆంధ్రుల హృదయాల శ్రీరామ మందిరాలు రామమందిరాలు లేని ఊరు ఆంధ్రదేశంలో అరుదు

గోదావరి తీరంలో వెలసిన భద్రాద్రి ఆ శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణ సమేతుడై వేంచేసియున్న పుణ్యక్షేత్రం ఆంధ్రదేశంలోని అనేక దివ్యక్షేత్రాలలో ఇది ఒకటి దేశదేశాలనుంచి వచ్చే వేలాది మంది యాత్రికులతోనూ తీర్థికులతోనూ భద్రాచలం నిత్యమూ కలకలలాడుతూ వుంటుంది

శ్రీరామచంద్రుని వనవాసంతో సంబంధించిన పరమపవిత్రసీమతోనే ఈ భద్రాచలం వెలిసింది శ్రీరాముడు సీతాలక్ష్మణ సమేతుడై సంచరించిన దండకారణ్యం ఈ ప్రాంతమే నంటారు రావణునిచే సీతాపహరణం జరిగింది ఇక్కడనేనని కూడ చెప్పుతారు వనవాసమందు శ్రీరామచంద్రుడు సీతామహాదేవితో నివసించుటకుగాను పర్ణశాల కట్టుకొన్నది ఈ భద్రాచలానికి నాతిదూరంలోనే ఆ పర్ణశాలచే పవిత్రమైన ఆ స్థలం ఇప్పటికీ పర్ణశాల పేరుతోనే పిలామణి అవుతుందని దానిని పంచవటి అని కూడా అంటారు. ఇది సీతామహాదేవి శ్రీరామలక్ష్మణులు స్నానంచేసిన స్థలం; ఇదిగో ఇది రావణాసురుడు సీత నెత్తుకొని పోయిన చోటు; ఇల్లిదిగో ఇది సీతమ్మవారు తన నారచీరను ఆరవైచుకొంటూ వచ్చిన జాడ ఇత్యాదిగా స్థానికులు ఇక్కడ అనేక స్థలాలను చూపుతూవుంటారు ఈ భద్రాచలంవద్దనే శ్రీరాముడు గోదావరిని దాటి సీతాన్వేషణానికి ప్రారంభించినట్లు ప్రతీతి

ప్రతిసంవత్సరం శ్రీరామనవమికి— అంటే చైత్రశుద్ధనవమికి ఇక్కడ శ్రీ సీతారాముల కల్యాణమహోత్సవం మహావైభవంగా జరుగుతుంది వేనకు వేలమంది యాత్రికులువచ్చి ఆ ఉత్సవంమహదానందంతో దర్శించుకుంటారు

ఈ భద్రాచల రామాలయ విర్మాణాన్ని గురించి ఒకగాథ ప్రచారంలోఉంది అబ్దుల్ హసన్ అనే ఒకతానీషా గోల్కొండను పరిపాలిస్తున్నరోజుల్లో యీ భద్రాచలానికి సమీపాన ఒకకుగ్రామంలో దమ్మక్క అనే ఒకభక్తురాలు ఉండేదట ఆమెకు చదువు సంధ్యలు సున్న ఒకనాడు శ్రీరాచంద్రుడు ఈమెకు స్వప్నంలోకనబడి యీ భద్రాద్రి పైన ఒకనిర్జనప్రదేశంలో వలానా తావున భూమిలోపల శ్రీ సీతారామలక్ష్మణ విగ్రహాలు ఉన్నట్లుచెప్పాడట మరునటి రోజు తెల్లవారీ తెల్లవారగానే దమ్మక్క లేచి కూతురును వెంటబెట్టుకొని యీ కొండయెక్కి స్వప్నంలో భగవంతుడు నిర్దేశించినస్థలానికి చేరుకొని వెతకగా అదే ప్రకారం మూడు విగ్రహాలూ దొరికాయట వర్షాకాలంనుంచి ఆ విగ్రహాలను కాపాడరానికై ఆమె యేలాగో కంటాలపడి మరికొన్నాళ్ళకల్లా అక్కడనే ఒక చిన్న మండపం కట్టించిందట అలనాటి ఆ చిన్నమండపమే తరువాయి కాలంలో రామదాసుగా పేరొందిన పేరుగాంచిన వేలకొండ ఎల్లి గోపన్న అనే ఒక బ్రాహ్మణుని ధర్మమా అని కాలక్రమేణ అభివృద్ధి పొంది నేటియావంతో దివ్యమైన దేవాలయంగా మారిపోయింది ఈ ఆలయాభివృద్ధికి ఇక్కడి ప్రాకారపురపాకారోత్సవాలవైభోగానికి ఆ గోపన్న ఎంత కృషి చేసింది, ఎన్ని కష్టాలు అనుభవించిందీ, చివరకు ఎలా కృతార్థుడయిందీ— ఆ రామదాసు కథయావత్తూ ఆంధ్రులందరూ బాగా ఎరిగిందే భక్తాంతయుడైన అలనాటి తానీషానుకూడా తనవరంగా అక్కుంచుకొన్న యీ భద్రాద్రిరాముని మహిమయే మహిమ ఆ తానీషా ఆదరాభిమానాలు ఆయనతోనే ఆగిపోక అనవాయితీగా నిలిచిపోవడం ఈ భద్రాద్రిరాముని మహిమ, విశేషానికి మహోత్సవం విజాంప్రభుత్వంవారు ఇప్పటికీన్నీ ఈ ఆలయానికై వేలాదిరూపాయలు చెల్లిస్తున్నారు ఏటేటా విశేషోత్సవా లప్పుడు ప్రత్యేక మర్యాదలు పంపుతూ వుంటారు

ఈ క్షేత్రస్వామి మహిమను చాటడానికి ఇంతకన్నా ఘనమైన తార్కాణం ఏమి కావాలి?

## శ్రీరాముడు

"ఆంధ్ర హృదయమునకు శ్రీరాముడు కులదేవత ఆంధ్ర వాఙ్మయమునందు రామాయణ గాథకు సంబంధించిన గ్రంథములనేకములు గలవు. ఆ వాఙ్మయమునందు శ్రీరామ వాఙ్మయము విశేషము గలదు రామకీర్తనలు, రామశతకములు వాఙ్మయమునందు వ్యాప్తిని గాంచియున్నవి రామభజనలు, రామాలయములు భక్తహృదయము శ్రీరామపరమని నిరూపణ చేయుచున్నవి ఆంధ్ర వాఙ్మయ నిర్మాణములందు కృతికర్తల భావములు మారుచున్నను ప్రజాహృదయమునందు భక్తిజ్ఞాన వైరాగ్యములు సుప్రతిష్ఠితములైయున్న విధముకు శ్రీరామోత్సవములు, రామకీర్తనలు, రామభజనలు, రామాలయములు చాటుచున్నవి"

[కళాప్రపూర్ణ స్వర్గీయ శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారి ఆంధ్ర వాఙ్మయ చరిత్రనుంచి]

# తిరుమల క్షేత్రం విద్యాధార్మిక సంస్థలు

శ్రీ తిరుమల క్షేత్రము తిరుమలపైన యొక చిన్న గ్రామము. అది సముద్రమునకు సుమారు మూడువేల అడుగుల ఎత్తుననున్నది. అందు స్థిరనివాస జనుల సంఖ్య సుమారు 2000 యుండును. తిరుమలపైన ఒక పల్లపు ప్రదేశమున శ్రీ వెంకటేశ్వరస్వామి దేవాలయమునకు నాలుగువైపుల గ్రామము విస్తరించియున్నది. ఇటీవల ఏర్పాటు చేయబడిన ఆరోగ్యాభివృద్ధి సాధనముల వలనను, మంచినీటి సరఫరాల వలనను తిరుమల యిప్పుడు ఆరోగ్యవంతమైన గ్రామమైనది. ఇది తిరుపతికి సుమారు 7 మైళ్ళదూరమున నున్నది. దేవస్థానమువారు ఇటీవల అధికవ్యయ ప్రయాసలతో ఘాటురోడ్డు నొకదానిని నిర్మించియున్నారు. దీనిమీద దినమున కనేకపర్యాయములు బస్సులు పోవుచువచ్చుచు నుండును. అందుచే నిప్పుడు యాత్రికులు మెట్లెక్కనవసరము లేక సులభముగా తిరుమల చేరవచ్చును.

*** పురాణపు వచనము ***

పురాణములు, తిరుమల శ్రీ మహావిష్ణువునకు చాలప్రియమైన స్థలమనియు, తిరుమలయాత్ర చాల పుణ్యప్రదమైనదనియు, తిరుమలమీది తీర్థములు పాపనాశనములనియు, చెప్పుచున్నవి. వేంకటాచల ఇతిహాసములన్నియు వేంకటాచల మహాత్మ్యమున సేకరింపబడియున్నవి. తిరుమల మేరుపర్వతశిఖరములలో నొకటనియు, ఆదిశేషునకును, వాయుదేవునకును సంభవించిన కలహ మూలమున విరిగి భూమిమీద పడినదనియు నందు చెప్పబడియున్నది. ఇదియునుంగాక ప్రళయానంతరము భగవంతుడగు విష్ణుమూర్తి జలమునందు నిమగ్నమైయున్న భూమి నుద్ధరించుటకు శ్వేత వరాహరూపము నెత్తి దాని నుద్ధరించి శిష్టరక్షణము కొరకును, దుష్టశిక్షణముకొరకును ఈభూమియందు కొంతకాలముండుటకు సంకల్పించి తనవినోదార్థము వైకుంఠము నుండి క్రీడాచలమును దెచ్చి భూమిమీద నుంచమని గరుడుని నాజ్ఞాపించెను. గరుడుడు స్వామి పుష్కరిణీ తటమున దానిని స్థాపించెను. విష్ణుమూర్తి పుష్కరిణీ దక్షిణతటమున నొక పర్ణకుటిని నిర్మించెను. అతని దేవియగు పద్మావతి, దగ్గరనుండు శ్రీ శుకపురము (తిరుచానూరు)నందు పద్మసరోవరమున నవతరించెను. ఆదివరాహస్వామి పుష్కరిణీ పశ్చిమతటమున తిర్యార్వమై యుద్భవించియుండెను. మరియు వెంకటేశ్వరుడధిష్ఠించియున్న పర్వతము విష్ణుమూర్తికి శయనమగు నాదిశేషుడే యనియు, అదిశేషుని యేడుశిరస్సులే యేడు శిఖరముల రూపమున నున్నవనియు ప్రతీతి కలదు. వెంకటేశ్వరుడు ఆదిశేషుని శిరమునను అహోబల నరసింహస్వామి శేషుని శరీరమునను, శ్రీ శైలేశ్వరుడు వాలమును నధిష్ఠించి యున్నారనియు చెప్పుదురు.

*** ఆళ్వారాచార్యుల ఆరాధన ***

సంగకాలమునాటి ప్రాచీన తమిళ సాహిత్యమున శ్రీ వెంకటేశ్వరస్వామి స్తోత్రము చేయబడియున్నాడు. ఋగ్వేదమునగూడ వేంకటాద్రి నిర్దేశింపబడియున్నదని యాగమములు చెప్పుచున్నవి. ఆళ్వార్లందరును వెంకటేశ్వరుని స్తుతించియున్నారు. వారందరును వెంకటేశ్వరుని దర్శించియుండవచ్చును. ప్రపత్తిచేయుటకు శ్రీనివాసునివంటి దయానిధియగు దైవములేడని వారు నుడికియున్నారు. వైష్ణవాచార్యులందరును వెంకటేశ్వరుని కైంకర్యమున నేదోయొక విధమున నివ్వయించియున్నారు. తిరుమలైనంబి యను నాయన తిరుమలలో నుండి స్వామి కైంకర్యము చేయుచుండినట్లు చెప్పుచున్నారు. సుప్రసిద్ధ శ్రీ వైష్ణవాచార్యులగు శ్రీ రామానుజాచార్యులు (భాష్యకారులు) తిరుమలలోని పూజాపునస్కారాది వ్యవహారములను పరిశుద్ధి స్థిరమైన యేర్పాట్లను చేసినట్లు "తిరుమలై ఒళుగు" అను గ్రంథమున చెప్పబడియున్నది. ఆయన చేసిన యేర్పాటే యిప్పటికిని సాగుచున్నట్లు తెలియుచున్నది. తిరుపతిలోని శ్రీ గోవిందరాజస్వామిని వారే ప్రతిష్ఠ చేసిరి. ఆదేవాలయముచుట్టును, తిరుపతి పట్టణమును వారే యేర్పరచినట్లు చెప్పుదురు. వారు తిరుమల-తిరుపతులకు మూడు పర్యాయములు విజయముచేసి వేంకటాద్రి విష్ణుక్షేత్రమని నిర్ణయించి ద్రావిడపరిపాలనాది వ్యవహారములను స్థిరపరచుటచేతనే తిరుమలలో ఆళ్వారాచార్య కీర్తనలు ప్రతిష్ఠింపబడక పోయినవి. రామానుజులవారి సన్నిధి యేర్పాటు చేయబడినది.

*** రాజపోషకులు, మహారాజ పోషకులు ***

తిరుమల దేవాలయమున కనేక శాసనములు కలవు. ఇవన్నియు స్వామి కైంకర్యములకు సంబంధించినవి. వీనిన్నిటిని దేవస్థానమువారు ఎనిమిది సంపుటములుగా ముద్రించి ప్రచురించియున్నారు. వానిలో కొన్ని ప్రాంతీయరాజుల ధర్మకార్యములను నిర్దేశించుచున్నవి. పల్లవరాజులు, చోళులు, పాండ్యులు, పల్లాలులు వెంకటేశ్వరుని దర్శించి కానుకల సమర్పించియున్నారు. విజయనగర రాజులకాలమున, వారిఖ్యాతిలస, తిరుమల వైభవము అధికమైనది. సాళువ నరసింహదేవుడు ప్రాకారముల కట్టించి దేవళము నభివృద్ధి చేసెను. తరువాత కృష్ణదేవరాయలును, అతని తమ్ముడు అచ్యుతదేవరాయలును విశేషముగ స్వామికి కైంకర్యములను జరిపిరి. తన భార్యలతో కృష్ణదేవరాయలు ఇద్దరు దేవులతో గూడ తన విగ్రహమును నిత్యసేవ చేయుచున్నట్లు దేవాలయమున ప్రతిష్ఠించియున్నాడు. అట్లే వెంకటపతి రాయల విగ్రహము కూడ కలదు. విజయనగర రాజ్యము క్షీణించి యా రాజులు పెనుకొండలోను, చంద్రగిరిలో నేలుచున్నప్పుడు కూడ వెంకటేశ్వరుని కైంకర్యములను వారు మానలేదు. మహారాష్ట్ర నాయకుడగు రఘోజీ భోంస్లే దేవుని దర్శించి యనేక మహోత్తమమైన యాభరణములను సమర్పించెను. ఇటీవలి కాలమున మైసూరు మహారాజులును, గద్వాల సంస్థానాధీశ్వరులును అనేక కైంకర్యములను చేసియున్నారు. భారతదేశములోని యన్ని భాగములనుండియు యాత్రికులు సర్వకాల సర్వావస్థలయందును వచ్చి స్వామికి కానుకలు సమర్పించుచునే యున్నారు.

ఇటు రాజులు, జమీందారులు, ప్రజలు స్వామికి ధనమును సమర్పించుటచేత నా స్వామి కైంకర్యములును, యాత్రికులకు కావలసిన సౌకర్యములును, అనేక విద్యా సాంఘిక సంస్థలును విచ్ఛిన్నముగా జరుగుచున్నవి. స్వామికి భోగములును, ఉత్సవములును అతి వైభవముగా జరుపబడుచున్నవి. మహార్హమైన వజ్రకిరీటమును, వెండిరథమును ఇటీవల నిర్మింపబడినవి. ఇప్పుడు వసంతోత్సవములతో వైకుంఠ వాస్తము చేయబడుచున్నది. శ్రీవారి విమానమునకు బంగారు మలామా సుమారు 600 సంవత్సరములకు పూర్వము చేయబడినది. అది శిథిలమగుటచే యిప్పుడు మరల క్రొత్తరేకుల నమర్చుటకు ఏర్పాట్లు జరుగుచున్నవి. గోపురములన్ని నవీకృతములగుచున్నవి.

***యాత్రికులకు వలువనతులు***

యాత్రికుల కనేక సౌకర్యములు కలుగజేయబడుచున్నవి. మెట్లకు దీపము లేర్పాటు చేయబడినవి. వారధియము లేపుండుటకు చౌకిదార్లు నియమింపబడి యున్నారు. శ్రమ తీర్చుకొనుటకు మంటపములును, చలి వెందరులును నిర్మింపబడినవి. సత్రములును వసతిగృహములును అభివృద్ధి చేయబడినవి. వైద్యశాలలు స్థాపింపబడినవి. తిరుపతికిని తిరుమలకును టెలిఫోను సంబంధము ఏర్పరుపబడినది. ప్రాపటకు శుద్ధమగు నీరు కొళాయిల ద్వారా సరఫరా చేయబడుచున్నది. తిరుమల గ్రామమును దేవాలయమును అతి పరిశుద్ధముగా నుంచబడుచున్నవి. తిరుమలతిరుపతుల నడుమ బస్సు సర్వీసు ఏర్పాటు చేయబడినది. మదరాసు, హైదరాబాదు పట్టణములలో, రాబోవు యాత్రికులకు భోగట్టాలనిచ్చుటకు "ఇన్ఫర్మేషన్ ఆఫీసులు" స్థాపింపబడినవి. యాత్రికులకు తమ విధులు తెలియుటకు యాత్రాగ్రంథములను అన్ని భాషలలోను ప్రచురింపబడినవి. తిరుపతి చరిత్ర వ్రాయించి అచ్చొత్తింపబడినది. ఇదిగాక ప్రజల సౌకర్యార్థము కొన్ని ధార్మిక సంస్థలును, విద్యాలయములును ఏర్పాటు చేయబడియున్నవి. వానిని గురించి క్రింద ప్రసంగింపబడును.

వజ్రకిరీటాలంకృతమైన శ్రీనివాసుని ఉత్సవమూర్తి

వజ్రకిరీటాలంకృతమైన శ్రీ అలమేలు మంగాదేవి ఉత్సవమూర్తి

రచన

శ్రీ సి. అన్నారావు
తిరుమల-తిరుపతి దేవస్థానాల
ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు

తిరుపతిలో దేవస్థానపు సత్రములు రెండు కలవు. వానిలో శైలసేవకు సమీపమునున్న క్రొత్త సత్రము మిక్కిలి వసతిగాయున్నది. ఇందు యాత్రికులకు వసతులును, పాత్రసామానులును ఉచితముగా నివ్వబడును. ఇంకొక రైల్వే బుకింగ్ ఆఫీసును, పోస్టాఫీసును, భోజనశాలయు, వైద్యశాలయు గలవు. తిరుమలకు పోవు బస్సులు ఇచ్చటనే బయలుదేరును. ఈ సత్రమునందు అంగళ్లు కూడ గలవు. తిరుమలలో ననేక సత్రములు కలవు. ప్రాచీనపు వెయ్యికాళ్ళ మంటపము సత్రముగా మార్చబడినది.

ఇదిగాక రిసు కొన్ని చిన్నచిన్న కట్టడములు కలవు. పెద్దయుద్యోగస్తులకు ఒక బంగళాయును, దివాణమును కూడయున్న కలవు. తిరుమలలో ఇండ్లు స్వల్పముగుటచే దేవస్థానమువారు తమ యుద్యోగస్థులకు ఇండ్లను కట్టియిచ్చియున్నారు. ఇంకా కట్టుచున్నారు.

యాత్రికులు మొక్కుబడులను తీర్చుకొనుటకు కల్యాణకట్ట నిర్మింపబడినది. ఇందు ఆధునిక ఆరోగ్య పద్ధతిని క్షౌరాదికములు జరుపబడును. తీర్థస్నానాదికములను శాస్త్రరీతిని జరుపుకొనుటకు తీర్థపురోహిత సంఘమొకటి యేర్పాటు చేయబడినది.

*** స్వామి పుష్కరిణీ ***

స్నానమునకు స్వామిపుష్కరిణీ అత్యుత్తమమైనది. స్వామి దర్శనమునకు పూర్వము ఇందు స్నానము చేయుట విశేష పుణ్యప్రదము. పురాణములలో దీని మహాత్మ్యము విశేషముగా వర్ణింపబడియున్నది. ఈ పుష్కరిణీ మధ్యను సుందరమైన మంటపము కలదు. ధనుర్మాస శుద్ధద్వాదశినాడు స్వామి పుష్కరిణియందు స్నానము చేయుదురు. అదినమున వేలసంఖ్యను యాత్రికులు ఇందు స్నానము చేయుదురు. దేవతలుకూడ చేయుదురని ఐతిహ్యము.

*** 'కలౌ వేంకటనాయకః' ***

పుష్కరిణిలో స్నానము చేసి దేవాలయములోని దేవుని దర్శనము నిమిత్తము పోవలయును. ఈ దేవాలయము చాల ప్రాచీనమైనది. అందలి దైవము వ్యక్తయుక్తము అనగా మానవనిర్మితము కాదనుట. ఈ కలియుగమున మనుష్యులందరును పాపిష్ఠులగుట చూచి, విచారించి, కరుణించి వారిని తరింపచేయుటకు శ్రీ మహావిష్ణువు వైకుంఠమునుండి ఈ భూమిమీదకి వచ్చెనని చెప్పబడుచున్నది. "కలౌ వేంకటనాయకః" కలియుగమున వేంకటేశ్వరుడే తరింపచేయు దైవము.

దేవాలయ శిల్పము సుందరముగానున్నది. గర్భాగారము పైనుండు విమానము పూర్తిగా బంగారురేకులతో కప్పబడియున్నది. ఈ విమానమునకు ఆనందనిలయమని పేరు. దేవాలయమునకు మూడు ప్రాకారములు కలవు. మొదటి ప్రాకారమునుండుపడికావలి గోపురము దాటినవెంటనే సంపంగి ప్రదక్షిణముకలదు. ఈ ప్రదక్షిణమున విరజయను దానియును, పూలబావియును కలవు - గోపురము దాటిన వెంటనే కుడివైపున రంగమంటపమును, తిరుమలరాయని మంటపమును కలవు. ఇందు స్వామికి అర్థానములు జరుగుచుండును - పడికావలిగోపురమునంతోట్రి కుడివైపున కృష్ణదేవరాయ విరయు, అతని ఇద్దరు దేవులయు లోహ విగ్రహములును, ఎడమవైపున వెంకటపతి రాయల లోహవిగ్రహమును అచ్యుతరాయలు, అతనిభార్యల శిలా విగ్రహములును కలవు. తిరుమలరాయని మంటపము ప్రక్కను అప్పయమంత్రియు తోడరుమల్లు యొక్కయు అతని భార్యలయొక్కయు లోహ విగ్రహములు కలవు-ధ్వజారోహణము, రామానుజకూటము, పూలబావి కూడను నీ ప్రదక్షిణమున నున్నవి.

*** విమాన ప్రదక్షిణము-వైకుంఠ ప్రదక్షిణము ***

రెండవ గోపురముముందర ధ్వజస్తంభమును, బలిపీఠమును గలవు. ఇవికూడ బంగారురేకులతో కప్పబడియున్నవి. రెండవగోపురమున దాటగనే విమాన ప్రదక్షిణము వచ్చును. ఈ ప్రదక్షిణమున స్వామి విమానము కనబడుచుండును. వరదరాజస్వామి, రామానుజులవారు, సేనమొదలియార్లు, యోగనరసింహస్వామి-వీరి యాలయములు ఈ ప్రదక్షిణమున కలవు. వంటశాల, యాగశాల, కల్యాణమంటపము, వాహనపుటరలు, గూడ దీనిలో గలవు- వంటశాలదగ్గర వకుళాదేవి యాలయమును గర్భాలయపు వాకిలి (బంగారు వాకిలి)కి ఎదురుగా గరుడాళ్వార్ల యాలయములు గలవు వకుళాదేవి శ్రీనివాసుని పెంపుడుతల్లి యని చెప్పుదురు. ఆమెయే శ్రీనివాసునికి పద్మావతిదేవితో వివాహము చేర్పాటు చేసినదనియు క్షేత్రమాహాత్మ్యమున గలదు. ఈ ప్రాకారములోని బంగారు బావినీరు స్వామి కైంకర్యములకు ఉపయోగింపబడుచున్నది. విశ్వర్పనకు మాత్రము ఆకాశగంగనీరే వాడుట సంప్రదాయము.- ప్రతిదినము ఆ నీరు తెచ్చుట, ఒక కుటుంబమువారి కైంకర్యముగ చేర్పడియున్నది.

మూడవ ప్రదక్షిణము వైకుంఠ ప్రదక్షిణము. ఇది గర్భాలయము చుట్టి వచ్చును. ఇది వైకుంఠ ఏకాదశినాడు తెరువబడి మరునాడు ముక్కోటి ద్వాదశినాడు మూయబడును. మిగిలిన దినములలో నెల్ల మూయబడియుండును- గర్భాలయము ముందరనుండు మంటపమును (తిరుమగమణి మంటపమునకు) రంగమంటపమని పేరు, దీనిలో స్వామికి యాస్థానమును, వాహనసేవలను, పవిత్ర కలశాభిషేకములును జరుగును. ఇంక దేవాలయ పారుపత్యదారు ఆఫీసుకలదు-ఇచ్చటనే అర్జితపు టికెట్లన్నియు అమ్మబడును.

*** స్వామి సందర్శనము ***

బంగారు వాకిలిదాటి గర్భాలయములోనికి పోయిన స్వామిదర్శనమగును - శిరమున్న గొప్పబంగారు కిరీటమును, మెరుపున పచ్చకర్పూరముతో నేర్పడిన యూర్ధ్వపుండ్రమును, ఊర్ధ్వబాహువులలో శంఖచక్రములును, నడుమున కరవాలమును ధరించి స్వామి గంభీరముగా దర్శనమిచ్చును. వక్షస్థలమున లక్ష్మీదేవిని ధరించి శ్రీనివాసుడను నామమును సార్థకము చేసుకొనుచున్నాడు. వక్షస్థలమున లక్ష్మీదేవిని ధరించియుండుటచేతనే ప్రత్యేకముగా నీ యాలయమున తాయార్ల సన్నిధిలేదు. లక్ష్మీహారము, సాలగ్రామమాల, మకరకంఠి మొదలగు నివార్హములగు హారములను స్వామి నిత్యము ధరించియుండును. కుడివైపున యుత్సవులగు మలయప్పస్వాములవారును, ఎడమవైపున సీతారాములును, ముందర భోగ శ్రీనివాసులును దర్శనమిచ్చుచుందురు. ఒక్కక్షణము స్వామి యుందరనిలచి వారి దర్శనలాభముపొందిన మనమునన్ను నిర్మలమై భక్తిపూరితమై యుండుటయేగాక మనమీ లోకమునువిడిచి వైకుంఠమున నున్నట్లగును. అందుచేతనే నీ క్షేత్రమునకు కలియుగవైకుంఠమను ప్రతీతికలిగినది. నాస్తికులకుకూడ నిట్టి యనుభవము కలుగునని నా నమ్మకము.

ఈ దేవాలయమున వైఖానసాగమము ననుసరించియు, తిరుచానూరులోని పద్మావతియమ్మవార్ల యాలయమున పాంచరాత్రాగమము ననుసరించియు, నర్చనలు రామానుజాచార్యుల వారిచే నేర్పాటు చేయబడినవి. వారు ఏర్పరచిన పూజాక్రమము ఇప్పటికిని అనుసరింపబడుచున్నది. ఎన్ని యుత్సవములు జరిగినను, ఎంతకాల విలంబమైనను నీ దేవాలయమున నిత్యపూజాదికైంకర్యములు యథాశాస్త్రము జరిగితీరవలసినదే, జరుగుచునే యున్నవి.

*** విశ్వరూప సేవ ***

యాత్రికుల సౌకర్యార్థము ధర్మదర్శనములు ఏర్పాటు చేయబడుచున్నవి. సామాన్యముగా రోజునకు రెండు పర్యాయము లుండును. ధర్మదర్శనమునకు యాత్రికు లొకరివెనుక నొకరు వరుసగా నిలబడుదురు. సమర్దము, త్రోపుడు యుండదు. ప్రతివారును సుఖముగా వెళ్ళి, స్వామిదర్శనము చేసి, తీర్థప్రసాదములు పుచ్చుకొని వెళ్ళవచ్చును. ధర్మదర్శనములుగాక ప్రత్యేకార్జిత సేవలుకూడ గలవు. ధర్మదర్శనములలో ప్రాతఃకాలపు విశ్వరూపసేవ ముఖ్యమైనది. అందు రాత్రి, దేవతలు చేసిన యర్చనయొక్క తీర్థము ఇవ్వబడును. దేవస్థానమువారు నివేదన చేయు ప్రసాదముకాక యాత్రికులు కూడ సొమ్ముచెల్లించి స్వామికి వారికి యిష్టమువచ్చిన ప్రసాదము నివేదన చేయించవచ్చును.

*** ఆకాశగంగ : అంజనీదేవి తపస్సు ***

తిరుమలపైని అనేక పుణ్యతీర్థములు కలవు. వీనిదగ్గర పూర్వము ఋషులు తపములనాచరించి వీనిని పవిత్రములుగా జేసిరి. వీనిలో పాపవినాశనతీర్థము చాల ముఖ్యమైనది. ఇది దేవాలయమునకు ఉత్తరముగా మూడుమైళ్ళదూరమున నున్నది. ఇటీవల వర్షాభావముచే తిరుమలలో నీటికరవు కలుగగా నీ పాపవినాశనతీర్థమునుండి నీళ్లను పైపు యంత్రములద్వారా తెచ్చి, తిరుమలకు కొళాయిలమూలమున సరఫరా చేయబడుచున్నది. ఆకాశగంగకూడ దేవాలయమున కుత్తరముగ రెండుమైళ్ళ దూరమునన్నది. ఈ తీర్థపునీరే స్వామి నిత్యార్చన కుపయోగింపబడుచున్నది. అంజనేయుని తల్లియగు నంజనాదేవి ఈ తీర్థమునద్ద 12 సంవత్సరములు తపస్సుచేసి యాతనిని గనినదని ఐతిహ్యము. జాపాలితీర్థముకూడ దేవాలయమున కుత్తరముగ 12 మైళ్ళ దూరముననున్నది. జాబాలి ఋషి యిచ్చట తపస్సు చేసెననియు, అగస్త్యమహర్షి యిచ్చట వసించియుండి యనేక సంవత్సరములు వెంకటేశ్వరస్వామిని యర్చించెననియు వేంకటాచలమాహాత్మ్యమున జెప్పబడియున్నది. ఇందు స్నానముచేసిన గ్రహపీడ నివృత్తియగునని చెప్పుదురు. వైకుంఠతీర్థము దేవాలయమున కీశాన్యముగ రెండుమైళ్ళ దూరమునయున్నది. ఇదియొక గుహలోనున్నది. శ్రీరాముడు వానరసైన్యముతో రావణసంహారార్థము దక్షిణముగాబోవుచు వేంకటాద్రికి వచ్చి శ్రీనివాసుని యర్చించిపోయెను. అప్పుడు వానరులందరును నీ గుహలో వైకుంఠమును దర్శించిరి. అందుచే దీనికి పేరు కలిగెను. నిత్యసూరులు, ముక్తులు వేంకటాద్రియందీ గుహలో నుందురు. కుమారధారతీర్థము ఆలయమునకు వాయవ్యముగా మూడుమైళ్ళ దూరముననున్నది. పూర్వమొక వృద్ధ బ్రాహ్మణుడు దీనిలో స్నానముచేసి వేంకటేశ్వరుని ప్రసాదమువలన యౌవనము పొందెననియు, కుమారస్వామి ఈ తీర్థమునద్ద తపమాచరించి తారకాసురునిజంపిన పాపమును పోగొట్టుకొనెననియు పురాణములో నున్నది. ఫల్గుణితీర్థమునద్ద వశిష్ఠునిభార్యయగు అరుంధతికి లక్ష్మీదేవి ప్రత్యక్షమై వరముల నొసంగెను. దానివిమూచి సప్తఋషులు సాష్టాంగ వినాసము చేర్పరచుకొనియున్నారు. ఘోణతీర్థము నకు నిష్ఠుడు తపస్సుచేసి వేంకటేశ్వరుని ప్రత్యక్షీకరించుకొనెను. ఇందు స్నానమాడిన సర్వపాపములు నశించును. శ్రీకృష్ణుడుపదేశింపగ పాండవులు వెంకటాద్రికివచ్చి యొక సంవత్సరము చటయుండి ప్రతిదినము పాండవతీర్థమున స్నానము చేసి ఆపుణ్యముచే వారు యుద్ధమునందు జయమునొంది రాజ్యమును సంపాదించుకొనిరి. అందుచే నీ తీర్థమునకా నామము కలిగెను. ఇట్టి తీర్థములింకెన్నో వేంకటాద్రియందు యున్నంటిలోను స్వా... ప్రసిద్ధమైనది. సమ... కును ఇది యుత్పత్తి... దురు. స్వామికి ఈ పుష్... ప్రవోత్సవము అతివైభవ...

*** ప్రజల ధనమునకు సాఫల్యము ***

భారతదేశముయొక్క అన్ని మూలలనుండియు, అన్ని జాతులవారును వచ్చి వెంకటేశ్వరుని దర్శించి కానుకలనిచ్చి పోయెదరు. వెంకటేశ్వరుడు ప్రత్యక్షదైవము. ఇప్పటికిని ఎంతోమంది యతనికృపవలన తమబాధలనుండి నివృత్తిని పొందుచున్నారు. వెంకటేశ్వరునకు వచ్చుకానుకలు అతనికైంకర్యముల నతివైభవముగా జరుపుటకేగాక యాత్రికులకనేక సౌకర్యములను చేకూర్చుటకును, అనేక విద్యాధార్మిక సంస్థలను నడుపుటకును వినియోగపడుచున్నది. ప్రజలవల్ల వచ్చు ధనమునకు, ప్రజల సౌకర్యార్థము వినియోగపడుట కంటె సాఫల్యముకలదా!

తిరుమలలో నొక ప్రాథమిక పాఠశాల నడుపబడుచున్నది. గ్రామము చిన్నదగుటవల్లను నింతకన్న మున్న తవిద్యా పాఠశాల యచ్చట నవసరము లేదు.

ఈసంస్థలు స్థాపింపబడుటకు కొంతము పూర్వము వేదమును నేర్పుటకొక వేదపాఠశాలయు, సంస్కృతశాస్త్రముల నేర్పుటకొక సంస్కృత పాఠశాలయు స్థాపింపబడినవి. తర్వాత దీనిలో ద్రావిడప్రబంధము, వైఖానసాగమమును నేర్పుట కేర్పాట్లు జరిగినవి. వేదప్రబంధాగమములు స్వామి నిత్యపూజాదికముల కత్యవసరములు. వేదములలో యజుర్వేదము మాత్రము అధ్యాపనము చేయబడుచున్నది. శాస్త్రములలో మీమాంస న్యాయ వ్యాకరణములు బోధింపబడుచున్నవి. ఇటీవల ఈపాఠశాలలో దేశభాషలు బోధించుటకుగూడ నేర్పాట్లు జరిగినవి. ఇప్పుడు తెలుగు, తమిళము, హిందీ కూడ నేర్పబడుచున్నవి. సంస్కృతవిద్యలను బోధించుటయేగాక వీనిలో విమర్శనమును జరుపుటకు ఒక విమర్శనాలయముకూడ స్థాపింపబడినది. ఇందు అనేక ముద్రితాముద్రిత గ్రంథములు సేకరించియుంచబడినవి. అపూర్వ గ్రంథములు ప్రచురింపబడుచున్నవి. తిరుమల దివ్యక్షేత్రమగుటచే విశిష్టాద్వైత గ్రంథములధికముగా ప్రచురింపబడుచున్నవి. తిరుమల దేవాలయమున వెంకటేశ్వరునంకితముగా తాళ్ళపాక అన్నమాచార్యును, అతని కుమారుడు పెదతిరుమలాచార్యులు-వీరిద్దరిచే కూర్పబడిన సంకీర్తనములు (పాటలు) రాగిరేకులమీద చెక్కియుంచబడినవి. ఈ రేకులను తెచ్చి వానిలోని సంకీర్తనములు ఈ పరిశోధనాలయమున ప్రచురింపబడుచున్నవి. ఇట్టి సంకీర్తనములు చెక్కబడిన రేకులు కొన్ని అహోబలమున శ్రీ నరసింహస్వామి దేవాలయమున గూడ గలవు. వానిని తెచ్చి యవియును పరిశోధింపబడుచున్నవి. ఈ పరిశోధనాలయమునకు సంబంధించి పురాతన వస్తు ప్రదర్శనశాలయొకటి నూతనముగ స్థాపింపబడినది. అందు తిరుపతి తిరుమలలోను, వాని పరిసరప్రాంతాలలో దొరికిన ప్రాచీన వస్తువులు సేకరించియుంచబడినవి. ప్రాచ్య పాఠశాలతో సంబంధించి హరికథా పాఠశాలయొకటి స్థాపింపబడుచున్నది.

ఉన్నత పాఠశాలయున్నను, ఈ ప్రాంతపు జనులకు ఉన్నత విద్యల నభ్యసించుట కవకాశము లేకుండుటచే మొదటి తరగతి కళాశాలయొకటి నెలకొల్పబడియున్నది. గత సంవత్సరము స్త్రీలకొక రెండవ తరగతి కళాశాల ప్రారంభింపబడియున్నది. హిందూమతము నుబోధించుటకు మరియొక కళాశాలను స్థాపించుటకూడ నేర్పాట్లు జరుగుచున్నది.

*** సంఘసేవలో కూడ ముందంజ ***

ఈ విధముగ నన్ని విద్యాసంస్థలు స్థాపింపబడి, విద్యావ్యాప్తికి తోడ్పడుటయేగాక, సాంఘిక సంస్థలుకూడ నేర్పరుపబడి సంఘసేవకూడ చేయబడుచున్నది. అనాథ బాలబాలికలను సంరక్షించుటకు అనాథ శరణాలయమొకటి తిరుపతిలో నెలకొల్పబడియున్నది.

తిరుపతికి సమీపమున అక్కారాంపల్లెయను గ్రామమున దరిద్రులకొక శరణాలయము ఏర్పాటు చేయబడినది. ఇందు అంగహీనులకును, కుష్ఠరోగులకును వసతి ఏర్పాటుచేసి సంరక్షించుచున్నారు. రోగులకు చికిత్సకూడ జరుపబడుచున్నది.

[illegible] జలపాతం

# ఆధునికయుగము-కవిత్వము

## శ్రీ వేలూరి శివరామశాస్త్రిగారు

ఏ కాలంలో కవిత్వాన్నైనా సరే తెలుసుకోవాలంటే ఆ కాలంలో ఉన్న అన్ని సంగతిసందర్భాలనూ స్థూలంగా నయినా తెలిసికొని ఉండాలి అలాగే ఈకాలంలో కవిత్వాన్ని తెలిసికోవాలంటే హిందూదేశం అన్ని దేశాలతోపాటు మేలుకొన్న ఆంధ్రదేశపు మార్పును గమనించాలి ఇరువైయో శతాబ్ది ప్రథమ దశకంలో ఈ మేలుకొలుపు పాట వినబడడం మొదలయింది ఈ నవజాగరణాన్ని నఖముఖాలా అవగతం చేసుకోవాలంటే జరిగిన జరుగుతున్న సంఘటనల నన్నిటినీ బాగా ఎరిగి ఉండాలి, అందర జీవనంలోటీ పోరాని చుట్టరికం ఉండాలి ఆ జీవన ప్రాణప్రవాహంతోటీ ఆ జీవనపు మన స్తత్వంతోటీ త దతీతమైన కాంతసమ్మితంతోటీ నేస్తం ఉండాలి

ఇది అభ్యుదయ-లేక స్వాతంత్ర్య-లేక ప్రగతి-యుగం సహృదయుడూ కవీ పండితుడూ పామరుడూ ఆడదీ మగవాడూ శిశువూ వృద్ధూ అందరూ ఇప్పుడేదో బంధంలో ఉన్నట్లూ, ముక్తి తమ ముందు కనబడుతున్నట్లూ భావిస్తూ దానికోసం ఎవరికి తగ్గ ప్రయత్నం వారు చేస్తూ చేయిస్తూ ఊపిరి సలపకుండా ఉన్నారు.

అయితే యీ అభ్యుదయం ఏ విషయంలో? ఏ విషయ మేమిటి విషయ సామాన్యంలో - ఆచారాలలో వివాహాలలో నైయత్తికజీవనంలో సాంఘిక జీవనంలో విలుబడిలో చదువులో శిల్పంలో కవితలో ఈరీతిగా ఏ విషయంలోబడితే ఆ విషయంలో.

ఇపుడు ఇట్టి అభ్యుదయంకోసం చేసే ప్రయత్నాలు మూడు రకాలుగా కనబడుతున్నాయ్. ఒకటి — పాతకోటకే గారపెట్టడం అనగా సిమెంటు పూయడం రెండు - అక్కడక్కడ ఊరిసిపోయిన కొన్ని ఇటికలను గోకేసి కొత్త ఇటికలను అతకడం మూడు - పునాది కంటా పెకలించి కొత్తకోట కట్టెయ్యడం

ఇందులో మొదటిరకంవారు 'మల్లా వేదాలదగ్గరకే పోదాం' అని అంటారు రెండోరకంవారు 'పురాణమిత్యేవ న సాధు సర్వమ్' అని అంటారు ఇక మూడోరకంవారు 'పాతో రోతో' అని అంటారు.

ఐరోపాలో మధ్యయుగావసాన సమయాన (*Back to Aristotle*) అనేమాట ఇలాగే వినబడ్డది పాత ప్రతీకలూ, ఆదర్శాలూ, ప్రతిష్ఠానాలూ, చదువులూ ఇవన్నీ గతానుగతికమైన ఆచారంగా పర్యవసించిపోయినప్పుడు జీవనం వెనుకటివలె సాగదు. వేదాలలోగూడా 'ముందుకు పో! ముందుకు పో!' అనేమాట ఎన్నోసార్లు వినబడుతుంది సాంఘిక ప్రతిష్ఠానంలో చవుడు దేరిన ఇటుకలను ఊడదీసి కొత్త ఇటుకలను అతికిన సిమెంటు ఎంతో స్మృతులలో కనబడుతుంది

విదేశీయుల పరిపాలనవల్ల, విదేశీయుల సంపర్కంవల్ల, ఎంతకాలం నుంచో హిందూదేశం స్తంభించిపోయింది. సాంఘికంగా, రాజకీయంగా, వైజ్ఞానికంగా ఇంకా ఎన్నో విధాలుగా అంధమైన ఆచారం తమోజాన్ని ఎంతోకాలం తన నిద్రలో జోకొట్టలేదు మార్పు శక్తినే కాని సమాజానికి నిద్ర పట్టదు అట్టి కాలం ఇది ఏబదిఏండ్లక్రిందట తెలుగునాట ఒక గొప్పవానికి నిద్రపట్టలేదు ప్రజలందరూకూడా ఇప్పుడు ఈ పైజెప్పిన మూడు రకాలలో ఏదో ఒక రకం మార్పు వచ్చితీరాలని కోరేవారే ఇట్టి పరిణామం ఇంటింటా ఒంటొంటా ప్రతిబంధకశక్తులనడుమ తనదారి తాను చూచుకుంటున్నది మొదటివి రెండూ చేర్పుమార్పులనిన్నీ మూడవది విప్లవమనిన్నీ విస్పష్టం ప్రకృతం ఈముత్తెగల ఉద్దేశాలూ హిందూదేశం మొత్తం మీద ముసురుకొన్నవి అన్ని దేశాలతో పాటు ఆంధ్రదేశంలోకూడా అంటుకొని ముందుకు సాగిపోతున్నవి. ఈగమనం ఎక్కడ బయలుదేరిందో ఎక్కడికి సాగిపోతూందో కొంచెం గమనిద్దాం

ఈ మూడు రకాల మార్పులూ సంఘజీవితంలో సంక్రమించినట్లే కవిత్వంలోనూ దానికి తోబుట్టువులయిన లలితకళలలోనూ సంక్రమించీనిన్నీ సంక్రమిస్తానున్నూ ఉన్నవి ఈమార్పును మొట్టమొదట తీసికొనివచ్చిన వీరుడు వీరేశలింగం శ్రీ వీరేశలింగంగారి సారస్వతక్షేత్రం ఎంత విశాలమయినదో అంత వివిధమైనది ఆయన వాఙ్మయక్షేత్రంలో పండించని పంటంటూ లేదు చిన్నకథ ప్రహసనం జీవితచరిత్ర భుగోళం వ్యాకరణం అలంకారం నవల ప్రబంధం నాటకం ఈరీతిగా మాషాల దగ్గరనుంచీ మామిడిపండ్లదాకా ఆయన పండించాడు. ఆయన ముట్టింది మాగాణం, పట్టింది బంగారం వీరు చేసిన చేర్పులలో మార్పు కొంచెం లేకపోలేదు స్ఫుటంగా కనబడే మార్పు సాంఘికాచారాలకు సంబంధించినది ఆయన సాధించినది సాంఘిక విప్లవం కాని సాహిత్యవిప్లవం కాదు భాషావిప్లవం అంతకంటే కాదు ఈరీతిగా శ్రీవీరేశలింగంగారి ప్రయత్నంవల్ల సారస్వతసౌధంమీద ఒక అంతస్తు లేచింది

వీరేశలింగంగారు వేసిన విత్తనం వెంటనే వ్యాపించవలసినదే కాని బహుకొద్దిగా అంటుకొని ఆగినట్లు కనబడి కొలదికాలంలోనే నవలఅంటుతొక్కింది భావకవిత్వానికీ ఖండకావ్యానికీ బీజావాపం జరిగింది వీని అన్నింటినీ ఆకాలం సరికొత్తగానే చూచింది

## గిడుగు రామమూర్తిపంతులు

ఇది ఇలావుండగా వ్యావహారిక వాదం విర్ర పెట్టుగా వచ్చిపడ్డది సారస్వతసౌధం పునాదులమీద పిడుగు పడ్డది ఇది అహింసాత్మకమైన విప్లవం దీనివల్ల ఎంతలాభం చేకూరిందో చెప్పలేము. ఈ వ్యావహారిక భాష ప్రచారంలోకి రాకపోతే ఇన్ని పత్రికలు, ఇంతమంది రచయితలు ఇందరు పాఠకులు ఉండేవారు కారు ఇది లేకపోతే ఇంత ప్రపంచమూ చీకటికోణం అయేది ఇది లేకపోతే ఇంతమందికి నాలుకలున్నా లేనిచే. ఇది పలువురకు గిడుగే కాని అంటే ఒకరకపు గొడుగే కాని పిడుగు కాదు

దేనికైనా విప్లవం ఉంటుంది కాని భావకుమాత్రం విప్లవమనేది ఉండదని కొందరంటారు అనగా ప్రతిదానికీ మార్పు సహజంకాబట్టి భాషకుకూడా అది సహజం కాబట్టి భాషకు మార్పే కాని విప్లవం వుండదని వారి నిగమనం.

అన్నింటికీ ఉన్నట్లే భాషకూ విప్లవం ఉంటుంది వ్యావహారికభాష ప్రాబంధిక భాషాస్థానాన్ని ఆక్రమించడం విప్లవంకాక మరేమిటని విప్లవవాదుల నిగమనం పదాలలో భేదం అర్థం ఒకటే.

## కథా సాహిత్యం

ఈ ఉద్యమంతోపాటు కథాసాహిత్యం మొలకెత్తడమూ చెట్టు కట్టడమూ గబగబా జరిగిపోయింది మన తెలుగుగడ్డకూ సంఘానికీ జీవనానికీ వాస్తవానికీ కల్పనకీ రసానికీ ప్రాముఖ్యంయిచ్చి అభ్యుదయం కలిగించే కథలు కొరపరంపరగా వెలువడ్డాయి ఇదిమొదలు కథ లేని పత్రికే లేదని చెప్పవచ్చు ఒకటి రెండు కథల పత్రికలే వున్నవనిన్నీ చెప్పవచ్చు

ఈ అభ్యుదయకాలంలో మనకు రష్యా జర్మనీ నార్వే స్వీడన్ ఫ్రాన్సు ఇటలీ ఇంగ్లండ్ కథా సారస్వతాలు ఒక్కపెట్టకనపడ్డవి వీన్నవారి కుతూహలం పెరిగింది వారికి ఒక ఇంద్రజాలం కనబడ్డది ఇబ్‌సెన్ ఏమన్నాడు? చాలాకాలంగా మగవాడు మగువను కొల్లగొట్టేస్తున్నాడనా? స్ట్రిండ్‌బర్గ్ ఏమని ప్రత్యుత్తరించాడు? తల్లిగా కూతురుగా ఆలుగా ఆడుది మగవాణ్ణి కొల్లగొట్టేస్తున్నదనా? కర్మక్షేత్రంలో స్త్రీపుంసద్వంద సంబంధాన్ని గురించి బ్రియో ఏమంటాడు? బర్నార్డ్‌షా 'నేనుదుర్నీతిపరుడనైన వ్రాయాననుకాడను' అని ఏల వ్రాసికొన్నాడు? ఈ మొదలైన మాటలు మనవారికి వినబడ్డయి వస్తుతంత్రపోషకులైన యిట్టి కొందఱు రసప్రష్టల కల్పనాశక్తి జీవనలీలాసముద్రంలో సగం మునిగిన లంకలలాగా కనబడే సంఘాలీతులున్నూ స్వతంత్రులున్నూ వినవ్యక్తులచుట్టూ వారి చరిత్రలచుట్టూ సుడుగులతో లేచింది. ఇదొక భంగిమ. ఇదేకాక వడ్లలో భేదాలు రెడ్లలో భేదాలు అనంతంగా పెరిగినట్లు ఈ కళావాఙ్మయం అనంత భేదాలతో పెరుగుతూంది. ఒక కథ ఖండాంతరాలకుకూడా పోకి కీర్తి సంపాదించుకొవి వచ్చింది

## నవలలు

దీనిమాట యిల్లావుండగా దీనిఅక్కగారు నవలగూడా నవనవలాడుతూ నడుస్తూంది ప్రాచీన సంప్రదాయాలూ నవీన సంప్రదాయాలూ ఈ రెండూ ఎరుగని సహజ సంప్రదాయాలూ, చరిత్రలూ గొప్ప పాత్రలూ నీచపాత్రలూ వైవిధ్యంగల పాత్రలూ ఔచిత్యంతో ఈనవలలో తొణికిసలాడుతూ ఉన్నై వీనిలో ప్రబంధ భాషతోనూ చక్కని వ్యావహారిక భాషతోను సరస్వతి రెండుముఖాలు చేసుకుని మాటాడుతుంది శ్రీ వీరేశలింగంగారు వేసిన విత్తనం ఈరీతిగా అభ్యుదయానికి పయనం చేస్తున్నది.

## కవిత్వము

కథాసాహిత్యంతో చెట్టాపట్టాలు పట్టుకొని యీకాలంలోనే ఖండకావ్యమూ భావకవిత్వమూ నూతన కవిత్వమూ ఆంధ్రదేశం నలుమూలలా వాహ్యాళి వెడలినవి

వీనిలో కొన్ని పురాదర్శాలు, కొన్ని నవ్యాదర్శాలు కొన్ని సంఘధాతువునం దర్శనాలు, కొన్ని సంఘధాతువుకు అతీతాలు. కొన్ని ప్రాచీన ఛందస్సులోడనే పరిస్ఫుటమయేవి, కొన్ని కొత్త ఛందస్సునే సృష్టించుకొనేవి. కొన్ని గేయాలు కొన్ని ఏవీకావు, మణీ పదాలు. కొన్ని ఆంగ్లమర్యాద కనుసరణాలు, కొన్ని స్వయంభువులు కొన్ని గణతంత్రాలు మచ్చుకు —

కంగుకోటీపై ఫుసాంగుచూ అడుగిడిడి
కాంగ్రెసూ సైనికుడ కనవోయీ
ప్రజల
కడసారి తీవనల గమతిలాయి. 1

జాకలి వరసమ్మ చంటిపిల్లలతోడ
హైజాము మిలిటరీ నాజీ తుపాకులకు
గురియయ్యె స్త్రీహక్కు గుర్తింపగా
గోరి
మండిపోతూమీకుదండమనిపలికింది 2
'కంగుకోటీ'
ముదుసలి మదారమ్మ ముదివగ్గు
పలుకుతో
మాలోరిహక్కులను మన్నింపగాగోరి
తనపల్లెయే స్వర్గధామంబు గానెంచి
తనగుడిసె సైనికులు దహియింపగా
నుండి
కాంగ్రెస్‌కు తనబూది కానుకగా
పంపింది 3
'కంగు కోటీ'
అతిథిపూజను జేసి అతిప్రేమగా మెలగ
బదులుగా సైనికులు ఎదనుగుండ్లను నాట
యడవల్లి వెంకయ్య పడుచుర క్తపు
బొట్లు
తిలకంబుగామీకు తెలిపిపంపించాడు 4
'కంగు కోటీ'
క్రూరముగ సైనికులు కొట్టిచంపుచు
నుండ
చచ్చినా బ్రతికినా జన్మభూమి నే
యంచు
తమ దేశమునకింక తాముబుణపడమంచు
మిట్టకోల్ సోదరులు మట్టిలోకలిశారుర్
'కంగు కోటీ'
బచ్చెనపురమంతా చిచ్చుపా
లయ్యింది
వాసనబాదా అంత ఆహుతైపోయింది
ఓరుగల్ మండలం వారతీ పల్లెరము
స్వాతంత్ర్యలక్ష్మి కెత్తిందోయ్‌మీకు
జయమంచు దీవనిచ్చిందోయ్ 6
చందాల రామకవి

కొన్ని సామ్యవాదాలు —

ఎటు చూచిన
చటులానల
పటుదాహం
ప్రబలుతోంది
మనభారత
జనయిత్రి
ఘనపాలం
జనసామా
న్యనమోజ్వల
చైతన్య
జ్యోతులతో
వెలుగుతోంది రాలి, గాలిలోకలసెను
వెలుగుతోంద
నవభారత
యువకులార
కవులార
కథకులార
భవితవ్యపు
మానవానికి
హోతలు
నూతన
భూతలని
ర్మాతలు మీరేమీరే
స్వకుక్షింభర
రక్షస్తతి
పక్షాలను
విరగ్గొట్టి
సమిధలుగా
శే రెండోయ్

భూతకాల
బేతాళుడు
పాతాళపు
పరలలో
ఇరుక్కొని
మగ్గణం చేసు
వర్తమాన
మార్తాండుని
కృధానిదాఘంలో
సామ్రాజ్యపు
సాంద్రహోమం
సమతా
జమదగ్ని
కుమారులార
శ్రమజీవుల
సమభావుల
అమృతసిద్ధి
కుసుమహారా
గమనానికి
అమితదుఃఖ
సముద్రాలు
మధించండి
విక్రామభోగి
సమూహోల్ని
వధించండి
శే రెండోయ్
ఎటు చూచిన
చటులానల
పటుదాహం
ప్రబలుతోంది
శ్రీ దాశరథి

## నాటకావతరణ

కథ యిల్లానడుస్తుండగా కాంగ్రెస్ నూ సామ్యవాదాన్నీ చంకనేసుకుని నాటకం అవతరించింది. ఈ కాలంలో మనమెన్నడూ కనీవినీ ఎరుగని ఘటనలు జరిగినై వీనిని కడుపులో పెట్టుకుని రసాత్మకాలవుతూ కొన్ని నాటకాలు తాముగూడా కళకు ప్రాతినిధ్యం సపాదించినవి రాజకీయంగా అవి నిషేధింపబడినవంటే ఆ మాటవేరు అనిషేధమే కళకు ఒరపిడిరాయి అని అనవచ్చును

సందులో సందుచేసుకొని గేయ వాఙ్మయం కూడా బయలుదేరింది కొన్ని భావకవిత్వానికి రూపాంతరాలు భాష కొంచెం అనక్కపోకినా, భావంలోమాత్రం కొన్ని వ్యంగ్యాత్మకాలు

ఇవి యిల్లా ప్రగతిపొందుతుండగా ఒక పెద్ద కవితాప్రవాహం ప్రాచీన మార్గంలో! అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తూనే వుంది చరిత్రాత్మకాలైన రెండు మహాకావ్యాలూ - ఇందులో ఒకటి ఎక్కడముట్టుకున్నా వ్యంగ్యసౌరభంతో గుబాళించేది కొన్ని మహాపురాణాలూ ఇంటిల్లిపాదిమననం చేయదగిన వేదాంతకావ్యమూ ఇవన్నీ ఒకరాయలసీమనుంచే ప్రవహించినై ఇవేకాక అన్ని సీమలనుంచి ఇంకొన్ని ఖండకావ్యాలూ మహాకావ్యాలూ అంగపుష్టీ భావపుష్టీ వీనితో వచ్చి, నలుముఖాల ప్రవహించినై

ఈ మహాప్రవాహంలో తెలంగానా నుంచి కూడా పురాణరూపంగా కావ్య రూపంగా ఖండకావ్య రూపంగా కథారూపంగా చాలా ఉపనదులు వచ్చి కలిసేయ్ మన ప్రపితామహుల దగ్గరనుంచి వస్తూన్న ఈ తంతువుగూడా తెగూ తెంపూ లేకుండా అభ్యుదయం దిశకు పోతూ వున్నది

## లలితకళలలో అభ్యుదయం

దేశంలో రాజకీయంగా విప్లవం విహారం చేస్తున్నప్పుడు కవిత్వానికిగాని మిగతా లలితకళలకుగాని అవరోధం ఏర్పడుతుందని లోకంలో ఒక ప్రవాదం వున్నది. కాని ఇపుడట్టిది యేమీ తటస్థించలేదు దీనిని బట్టి యీవిప్లవంలో ఏదో విశేషం వుందని కాని యిది అంతటి మహావిప్లవంకాదనికాని మనం అనుకోవలసి వుంటుంది ఇంతేకాక ఈ విప్లవం లలితకళలలో అక్కడా అక్కడా ప్రతిఫలిస్తూ ఒకవిధంగాఅభ్యుదయమే కలిగించింది

ఇంత కొద్దికాలంలో — అనగా సుమారు యాభై అరవై యేండ్ల కాలంలో—అందులోనూ విశేషించి ఇటీవలి ముప్పదియేండ్లకాలంలో ఇట్టి కవితాప్రపంచం ఆవిష్కారం పొందిందంటే ఆంధ్రరాష్ట్రం వచ్చిందంటే ఎంత సంతోషం కలిగిందో అంత సంతోషం కలగడంలేదా?

ఒక్కసారి వెనుకకు తిరిగి ఈ అభ్యుదయం ఈ స్వాతంత్ర్యం ఈ ప్రగతి దెసచూచి

'జీర్ణే భోజన మాత్రేయః కపిలః ప్రాణినోదయా
బృహస్పతి రవిశ్వాసః పంచాలః స్త్రీషుమార్దవమ్'

'జీర్ణమైనపిమ్మటతినమని ఆత్రేయుడు చెప్పతాడు, కపిలుడు ప్రాణులపై దయజూపమంటాడు, బృహస్పతి 'దేను డెక్కడున్నా'డని అంటాడు, పంచాలుడు ఆడాళ్లవిషయంలోబహు మార్దవంగా వ్యవహరించమని అంటాడు? అని అన్నట్లు ఇదే మనకు లక్ష్యమా ఇంతకంటే గొప్పలక్ష్యం ఏమయినా వున్నదా అని ఆలోచించాలి వెనుకటికాలంలో వున్న శైష్యోపాధ్యాయిక మనకు ఇక దొరకదు అది ఎన్ని శతాబ్దాలకింద లోపించిందో మనకు గుర్తులేదు గురువుచేతిలో దీపంలేదు శిష్యులకు లక్ష్యం తెలియదు, పరాపరవిద్యలంటే ఎవరికీ పట్టుదల లేదు అంతా కంగారు కాములోకం కొంతపాలు గౌణంగావుంటే వుండవచ్చేమోగాని అదే కామ్యమయి కూచుంటే గురువెంగుకూ?

## నవజాగరణ కలిగింది ప్రజలలో

స్వదేశీ—ఆందోళనవల్ల మనదేశంలోని చిన్నలలో పెద్దలలో నవజాగరణం కలిగింది కలుగుతూంది ఈ తెలుగుజాతి కుంభకర్ణుడి నిద్రలోంచి మేలుకొంటూంది మనం పశ్చిమాభిముఖులమే కావాలో అంతర్ముఖులమే కావాలో తెలుసుకొంటూంది అనేక యుగాలనుంచీ వస్తూన్న 'ఆత్మానం విద్ధి' నిన్ను నీవు తెలుసుకో అనే మంత్రం భరతఖండపు అంతరాళంలోంచి ఇప్పుడు ప్రతిధ్వనిస్తూంది ఆ నీవు సత్యమూ సుందరమూ ఆనందమూ అయితే నీకవిత్వంకూడా ఆ సత్యాన్ని ఆ సుందరాన్ని ఆ ఆనందాన్ని వ్యక్తంచేయాలి

యాభై ఏండ్లనుంచీ అభ్యుదయం దెస నడచిన ఈకథలలోనూ నవలలలోనూ భావకవిత్వంలోనూ ప్రబంధాలలోనూ పురాణాలలోనూ ఈసత్యవస్తువు ఈ సుందరవస్తువు ఈ ఆనందవస్తువు ఎంతవున్నదో పరికించుకొని చేతనైనంతవరకూ దానిని వ్యక్తీకరించుటకు కవిత్వం ఇక ముందడుగు వేయబోతుందని అభిలషిద్దాం

అమ్మా! అందరిచేతా విడివిడిగా స్వతంత్రంగా పాడించు! దానికి సంయమం జోడించు భావంలో పడుకో. రూపంలో మేలుకో! రసంలో ముంచు! వశంలో ఉంచు! ఎందుకంటే నీవు 'రసోవైసః' నానా భావాలతో నానా రూపాలతో నీ రసం అందరికీ పంచు.

# కవులు, కవిపోషకులు అయిన ఆంధ్ర రాజులు

— శ్రీ బులుసు వెంకటరమణయ్య —



ఆంధ్రదేశ పరిపాలకులైన ప్రభువులు కేవలము వీరాగ్రేసరులును, రాజనీతిజ్ఞులును మాత్రము కాక కవిపండిత పక్షపాతము కలిగి పెక్కుమంది మహావిద్వాంసులను కవివతంసులను పోషించుచుండిరి. అంతేకాక స్వయముగ పాండిత్యము గడించి గ్రంథములను రచించి తమ కీర్తి యాచంద్రార్కము వెలయునట్లు చేసిరి. ఒక్క యాంధ్రమున నే కాక సంస్కృత ప్రాకృతములందును వారి రచనలు కానవచ్చుచున్నవి.

ఇంత వరకును లభించిన చారిత్రక విషయములనుబట్టి ఆంధ్రదేశమున పరిపాలకులుగా నుండి పద్యాత్మకముగను, గద్యాత్మకముగను గ్రంథములను రచించినవారు పెక్కురున్నట్లు తెలియుచున్నది. వారిలో ముఖ్యులను వారిం గూర్చియే యిట కొంచెము ముచ్చటింపబడును.

అందు దొలుత ప్రాకృత-సంస్కృత రచయితలం గూర్చియు- ఆ పిదప ఆంధ్రరచయితలంగూర్చియు తెలుపబడును.

### * శాలివాహనుడు

శకకర్త యగు నీ ప్రభువునకు హాలుడు, శాతవాహనుడు, అధ్యరాజు అను నామాంతరములు కానవచ్చుచున్నవి. 'కవివత్సలు' డనునది ఈతని బిరుదమేమో! ఇతడు క్రీ శ 78 నాటి ప్రభువు. గుణాఢ్యుడీతని యాస్థానకవి. ఈ ప్రభువు ప్రాకృతభాషలో 'గాథాసప్తశతి'యను గ్రంథమును రచించెను. ఇది ఒక సంకలన గ్రంథము.

### * ప్రతాపరుద్రుడు

ఆంధ్ర సామ్రాజ్యమును పాలించిన ఈ కాకతీయ చక్రవర్తి క్రీ శ 1140 1196 ప్రాంతపువాడు. విద్యాభూషణ బిరుదాంచితుడు, తండ్రి పోలరాజు, తల్లి ముప్పమదేవి. ఇతడు సంస్కృతమున 'నీతిసార'మను గ్రంథము వ్రాసెను.

### * అనవోత నాయకుడు

రాచకొండ రాజధానిగా కొండవీటి దక్షిణ ప్రాంతమును పాలించిన పద్మనాయక వంశ ప్రభువు. కాలము క్రీ శ 1360 1381 ప్రాంతము. ఇతడు 'అభిరామరాఘవ' మను నాటకముగా రామాయణ కథను రచించినట్లు 'రసార్ణవసుధాకర' మను గ్రంథమునుబట్టి తెలియుచున్నది. ఈ 'అభిరామరాఘవ' మింతవఱకు లభింపలేదు.

### * సింగభూపాలుడు

సర్వజ్ఞ బిరుదాంకితు డగు నీ ప్రభువు అనవోతనాయకుని పుత్రుడు. క్రీ శ 1368 1420 ప్రాంతమున రాజ్యమునుపాలించిన వాడు. ఇతడు 'రసార్ణవసుధాకర' మను అలంకారశాస్త్ర గ్రంథమును, 'కువలయావళి' అను నాటికను, శార్ఙ్గదేవుని సంగీత రత్నాకరమునకు టీక వ్యాఖ్యను రచించెను. శ్రీనాథ మహాకవి ఇతనిచే గొప్పగా గౌరవింపబడెననియు, బమ్మెర పోతరాజు నీతడు భాగవతమును కృతి యీయవలెనని కోరగా, అతడు తిరస్కరించెననియు చెప్పుదురు.

### * కుమారగిరి

ఇతడు అనవోతరెడ్డి కుమారుడు. క్రీ శ 1388 1400 వరకు నుండిన వాడు. ఇతడు 'వసంతరాజీయ' మను నాట్యగ్రంథమును రచించెను. మల్లినాథుడును, కుమారస్వామియు ప్రబోధ చంద్రోదయ చంద్రికా వ్యాఖ్యాత యగు నాదిండ్ల గోపమంత్రియు దీనిని పేర్కొన్నారు.

### * కాటయ వేమారెడ్డి

ఇతడు రాజమహేంద్రవర పరిపాలకుడు. క్రీ శ 1385 మొదలు 1428 వఱకు నుండినవాడు. ఇతడు కాళిదాస నాటకత్రయమైన శాకుంతల, విక్రమోర్వశీయ, మాళవికాగ్నిమిత్ర నాటకములకు వ్యాఖ్యానములు రచించెను.

ఇతడు అనవోతారెడ్డి పుత్రికయగు మల్లాంబను వివాహమాడెను. ఇతడు తొలుత కుమారగిరివద్ద మంత్రిగా నుండెను. ఆ సమయముననే పయి వ్యాఖ్యలు రచించినందున, తన ప్రభుభక్తిని, ప్రేమకును గుఱుగా ఆ వ్యాఖ్యలకు 'వసంతరాజీయము' లని పేరిడెను. 'వసంతరాజ' అనునది కుమారగిరి బిరుదనామము. ఈ వ్యాఖ్యలు ముద్రితములు. మల్లినాథసూరి వ్యాఖ్యలకంటె కొంచెము ప్రాచీనములు.

### * పెదకోమటి వేమారెడ్డి

ఇతడు రాచవేమన పుత్రుడు. క్రీ శ 1400 1420 ప్రాంతమువాడు. ఇతనికి 'జగనొబ్బ గండుడు, వీరనారాయణుడు, సర్వజ్ఞ చక్రవర్తి' మున్నగు బిరుదములు కలవు. ఈతడు సాహిత్య చింతామణి, సంగీత చింతామణి, శృంగారదీపిక, భావదీపిక, వీరనారాయణ చరిత్ర అను గ్రంథములను రచించెను. శ్రీనాథమహాకవి ఇతని యాస్థానమున విద్యాధికారి. మామిడి సింగనాదులు మంత్రులు.

శృంగారదీపిక అమరుకకావ్యమునకు చక్కని వ్యాఖ్యానము. భావదీపిక అనునది శాలివాహనుని గాథాసప్తశతిలోని 104 గాథలకు వ్యాఖ్య. సాహిత్య చింతామణి అలంకారశాస్త్రగ్రంథము. సంగీత చింతామణి సంగీతగ్రంథము.

### * సాళువ నరసింహరాయలు

ఇతడు క్రీ శ 1478 ప్రాంతీయుడు. సంగమ వంశీయుల తరువాత విజయనగర రాజ్యమును పాలించిన సాళువ వంశీయులలో మొదటివాడు. ఇతడు 'రామాభ్యుదయము' అనే 24 సర్గల కావ్యమున రామాయణకథను వివరముగా రచించెను.

### * కృష్ణదేవరాయలు

క్రీ శ 1509 నాటి విజయనగర సామ్రాజ్య చక్రవర్తి. ఆంధ్రభోజుడైన ఈ సార్వభౌముడు తన ఆస్థానమున అష్టదిగ్గజములను పోషించి పెక్కు గ్రంథములను కృతిపొందెను. ఈతడు 'ఉషాపరిణయము, మదాలస, జాంబవతీ కల్యాణము, సత్యభామా ప్రీణనము, సకలకథాసారసంగ్రహము, జ్ఞానచింతామణి, రసమంజరి' అను గ్రంథములను రచించెను. వీనిలో రసమంజరి సత్యావధూ ప్రీణనములు పెద్ద కృతములని కొందఱి తలంపు. జాంబవతీ కల్యాణము 5 అంకముల నాటకము. ఇది విరూపాక్ష స్వామి యుత్సవదినములలో ప్రదర్శింపబడుచుండెడిది.

ఇతడు 'విష్ణుచిత్తీయ' మను నామాంతరము కల 'ఆముక్తమాల్యద' అను ఆరాశ్వాసముల ప్రౌఢప్రబంధమును రచించెను. ఇందు గోదాదేవి (ఆండాళ్లమ్మ) చరిత్రము కలదు. వైష్ణవ మతప్రతిపాదకములగు పెక్కు విషయము లిందు గలవు.

### * రఘునాథ రాయలు

క్రీ శ 1614 1633 ల వరకు నుండిన ప్రభువు. తంజావూరు రాజధానిగా దక్షిణదేశమును పాలించిన వీరాగ్రేసరుడు. సంగీత సాహిత్య నిష్ణాత. జయంతసేనాది రాగములను, రామానందాది తాళములను కనిపెట్టెను. వివిధములగు రాగములను వీణపై ఆలాపించుట కనువుగా రఘునాథ మేళము నేర్పఱచినదట! ఇతడు 'సంగీతసుధ' అను గ్రంథమున సంగీత శాస్త్రాంశములను వివరించెను.

ఇతడు ఆంధ్రమున 'అచ్యుతరామాభ్యుదయము, వాల్మీకి చరిత్ర, రామాయణము' అను మూడు ప్రబంధములను రచించెను.

ఇందు అచ్యుతరామాభ్యుదయము లభ్యము. తక్కిన వానిలో రామాయణ మసమగ్రము. బాలకాండములోని నాలవ యాశ్వాసములో కొంత భాగము వఱకు మాత్రమే లభించినది. ఇంద్రాది దేవతలు రావణుని బాధలను మొఱపెట్టుకొనుటకు పాలసముద్రమును చేరి, శ్వేతద్వీపమును సమీపించు నంతవఱకు మాత్రము అందలి కథ కలదు. ఈ యుపలబ్ధ భాగము ముద్రితము.

వాల్మీకి చరిత్రము మూడాశ్వాసముల ప్రబంధము, ముద్రితము. ఇందు తపోధనుల తపశ్శక్తి, వివిధక్షేత్రముల మహిమ, ఆదికవి యైహికాముష్మిక జ్ఞానవిచారణ, రంభోర్వశుల గర్వభంగము, కోయవాండ్ర చర్యలు మున్నగు విషయములు చమత్కారముగ వర్ణింపబడినవి.

ఇక తెలుగులో గ్రంథములను రచించిన రాజకవులం గూర్చి చెప్పెదను.

### * నన్నెచోడ దేవుడు

క్రీ శ 1151 1170 వరకునుండిన మహాకవి. చోడబల్లి కుమారుడు. కావేరీ తీరమందలి ఒరయూరు రాజధానిగా దక్షిణదేశమును పాలించిన ప్రభువు. రాజ్య ప్రాభవమునుబట్టి 'టెంకణాదిత్యు' డనియు, కవితా ప్రాభవమునుబట్టి 'కవిరాజ శిఖామణి' అనియు నితనికి బిరుదములు కలవు. ఇతడు దేశిపద్ధతిలో 12 ఆశ్వాసముల మహాకావ్యమును — కుమార సంభవమును రచించెను. ఇందు శివుని లీలలు వర్ణితములు.

### * గోకర్ణుడు

ఇతడు పంద్రెండవ శతాబ్దితొలిభాగమున నుండినవాడు. 'గోకర్ణచ్ఛందస్సు' అను ఛందోగ్రంథ మీతని రచన. ఇతడు నిజాము రాష్ట్రములోని వర్ధమానపురమును పాలించిన ప్రభువు. సూర్యవంశ క్షత్రియుడట! ఇతని గ్రంథము లభింపలేదు. రంగరాట్ఛందస్సున నుదాహృతములగు కొన్ని పద్యములు మాత్రము కానవచ్చుచున్నవి.

### * భద్రభూపతి

ఇతనికి బద్దెన అను పేరు ప్రసిద్ధమైయున్నది. 1261 1300 ప్రాంతము వాడు. ఇతడు చోళరాజశాఖకు చెందిన సూర్యవంశ క్షత్రియుడని ప్రసిద్ధి. 'నీతిశాస్త్ర ముక్తావళి' ఇతని గ్రంథము. 'సుమతి శతకము' కూడ ఇతని రచనయని అందురు. రెండును అభిన్నములేమో! 'బద్దెన నీతు' లనియే ఇతని గ్రంథము ప్రసిద్ధి కెక్కినది. ఇతని రచన ప్రతాపరుద్రుని 'నీతిసారము' నకాంధ్రీకరణమని కొందఱు అందురు. ఈ గ్రంథనామము నానావిధములుగ నున్నది.

### * కామనేని మల్లారెడ్డి

పదునాఱవ శతాబ్దివాడు. ఇతడు 'షట్చక్రవర్తిచరిత్ర, లింగపురాణము, శివధర్మోత్తరఖండము, బ్రహ్మోత్తరఖండము, వాసిష్ఠమను' అను గ్రంథములను రచించెను. ఇతడు చిక్కపోలు ప్రభువు.

### * సురభి మాధవరాయలు

రేచర్ల గోత్రమున దు జనించిన మల్లభూపాలుని పుత్రుడు. పదునాఱవ శతాబ్ది చివరివాడు. అళియరామరాజువలన జటప్రోలు సంస్థానమును గ్రహించినవాడు. ఇతడు జటప్రోలు నగరమందలి మదనగోపాల మూర్తికి కృతిగా 'చంద్రికాపరిణయ'మను ఆరాశ్వాసముల ప్రౌఢప్రబంధమును రచించెను. అయ్యది శ్లేష, యమకభూయిష్ఠము. వసుచరిత్ర కాలము నాటిది!

### * మట్ల-అనంతభూపాలుడు

ఇతడు 17-వ శతాబ్ది ప్రారంభమున నుండినవాడు. ఇతని తండ్రి ఎల్లభూపాలుడు. తల్లి రంగాంబ. రాయలకు పిదప కృతులను రచించిన వారిలో నితడు ముఖ్యుడు. సంస్కృత భాషాపాండిత్యము మిక్కుటము. ఇతడు కకుత్స్థ విజయమును 5 ఆశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇందు సూర్యవంశజుడగు కకుత్స్థుని వృత్తాంతము కలదు.

### * దామెర-వెంకటభూపాలుడు

ఇతడు 17 వ శతాబ్ది ప్రారంభమున నుండినవాడు. కాళహస్తి ప్రభువు. ఇతని తండ్రి వెంకటాద్రి భూపాలుడు, తల్లి గురువమాంబ. ఈ కవి 'బహుళాశ్వచరిత్ర'మను 5 ఆశ్వాసముల ప్రబంధమును రచించెను. ఇందు బహుళాశ్వుడను హరిభక్తుని వృత్తాంతము వర్ణితము.

### * విజయరాఘవరాయలు

ఇతడు రఘునాథరాయల కుమారుడు. క్రీ శ 1633—1673 వరకు నున్నవాడు. తండ్రి యగు రఘునాథరాయలవలెనే విద్వత్కవి విద్వత్కవిపోషకుడు. ఇతడు బహుళ గ్రంథకర్త. సాహిత్య సింహాసనము ధరించి సభకు శారదాధ్వజము నెత్తెను. ఇతని యాస్థానమున కోళకవి వంటి విద్వత్కవులే కాక కృష్ణమాంబ రంగాజమ్మ మున్నగు విదుషీమణులు నుండి పెక్కు గ్రంథములను రచించిరి.

ఇతని గ్రంథములలో 'రఘునాథ నాయకాభ్యుదయ' మను యక్షగానమును, రఘునాథాభ్యుదయమను ద్విపద కావ్యమును' ముద్రితములు. వీనిలో నితని తండ్రి యగు రఘునాథ నాయకుని నిత్యకృత్యములు, కార్యక్రమము వర్ణితములు.

కాళీయమర్దనము, ప్రహ్లాదచరిత్ర, పూతనాహరణము, విప్రనారాయణ చరిత్రము (ఇది ముద్రితము) రుక్మిణీ కల్యాణము, రాజగోపాల విలాసము, గోవర్ధనోద్ధరణము, చెంగమలవల్లీ పరిణయము, రతిమన్మథవిలాసము, పారిజాతాపహరణము, రాధామాధవ వివాదము, ధనాభిరామము, సత్యభామా వివాహము, ఉషాపరిణయ నాటకము, కాళీయమర్దనము, మోహినీవిలాసము, సముద్రమథనము, పాదుకాసహస్రము, కృష్ణవిలాసము, ప్రణయకలహము, జానకీ కల్యాణము, పుణ్యకవ్రతము, గోపికాగీత, భ్రమరగీత మున్నగునవి ఇతని ఇతర రచనలు.

### * పూసపాటి-తిమ్మభూపాలుడు

ఇతడు క్రీ శ 1640 ప్రాంతము వాడు. విశాఖమండలమునందలి విజయనగర సంస్థానమున కధిపతి. శ్రీమన్మహామండలేశ్వర - మహీ మండలరాయ మన్నెసుల్తాన్ మున్నగు బిరుదములు కలవాడు. ఇతడు శ్రీ కృష్ణవిజయమను ప్రబంధమునురచించెను. అయ్యది 1893 లో ముద్రింపబడినను నేటిదనుక ప్రకటితము కాలేదు. ఇందు నరకాసురవధ, పారిజాతాపహరణము, పదునాఱువేల కన్యల వివాహము ఇందలి విషయములు.

### * కటా వరదరాజు

ఇతడు క్రీ శ 1650 ప్రాంతము వాడు. వీరిపూర్వులు అనకటను కట్టించుటచే నీకుటుంబమువారికి కటావారను గృహనామము కలిగినది. వరదరాజు తాతర గరాజు, తండ్రి హరిదాసరాజు, తల్లి కృష్ణాంబ. ఇతడు ద్విపద రామాయణమును, పరమభాగవత చరిత్రమును శ్రీరంగమాహాత్మ్యమును రచియించెను. ద్విపదరామాయణ మున్నివిధముల రంగనాథ రామాయణములో దులతూగగలది. ఇది ముద్రితము. శ్రీరంగ మాహాత్మ్యము శతాధ్యాయి యగు సంస్కృత శ్రీరంగమాహాత్మ్యమున కాంధ్రానువాదము.

### * విజయరంగచొక్కనాథుడు

పదునేడవ శతాబ్ది రెండవ భాగమున మధురను పాలించిన ప్రభువు. వచనకావ్య నిర్మాణమునకు దోహద మొసగిన రాజు. ఇతని యాస్థానమునందే సముఖము - వెంకట కృష్ణప్ప నాయకుడుండి 'జైమిని భారత, సారంగధరచరిత్రములను వచనకావ్యములుగా రచించెను. విజయరంగ చొక్కనాథుడు 'మాఘ మహాత్మ్యము, శ్రీరంగమాహాత్మ్యము' అను రెండు వచనగ్రంథములను రచించెను. అవి అముద్రితములు.

### * మన్నారుదేవుడు

ఇతడు తంజావూరి ప్రభువగు విజయరాఘవ నాయకుని కుమారుడు. 17 వ శతాబ్దిచివర నుండినవాడు. ఇతడు 'హేమాబ్జ నాయికా స్వయంవరము, విజయరాఘవాభ్యుదయము' అను రెండు గ్రంథములను రచించెను. హేమాబ్జనాయికాస్వయంవరమున రాజగోపాలస్వామికి హేమాబ్జతోడి వివాహము వర్ణింపబడినది. విజయ రాఘవాభ్యుదయము లభింపలేదు.

### * సోమభూపాలుడు

18 వ శతాబ్ది చివరిభాగమున గద్వాలన స్థానము నేలిన ప్రభువు. ముష్టిపల్లి తిరుమలరాయని పుత్రుడు. గద్వాల ప్రభువగు రామరాయ లీతని దత్తపుత్రునిగా గ్రహించెను. ఈ సోమభూపాలునికి 'నవభోజరాజు' అను బిరుదము కలదు. కృష్ణదేవరాయల సభలో నుండినట్లే ఇతని యాస్థానమునందును అష్టదిగ్గజము లుండిరి.

సోమభూపాలుడు రతిరహస్యము, అష్టపది అను గ్రంథములనురచించెను. 'రతిరహస్యము' హరిభట్టు సంస్కృతమున రచించిన సంస్కృత 'రతిరహస్యము నకు ఆంధ్రానువాదము. ఇందు కామశాస్త్ర విషయములు కలవు. ఇది ముద్రితముకూడ.

'అష్టపది' అనునది జయదేవ మహాకవి సంస్కృతమున రచించిన గీతగోవిందకావ్యమునకు సంస్కృతాంధ్రములయందు విపులీకరణము.

### * తుపాకుల అనంతభూపాలుడు

ఇతడు 1740 ప్రాంతమున గంజి దుర్గమును పాలించినవాడు. ఇతడు 'భగవద్గీత, రామాయణము, భారతము, విష్ణుపురాణము' అను వచన కావ్యములను రచించెను. వీనిలో భగవద్గీత ముద్రితము. భారత, రామాయణములు అసమగ్రములు.

### * కోట - రాయ రఘునాథ తొండమాన్ భూపాలుడు

18 వ శతాబ్ది చివర పుదుకోటను పాలించిన రాజు. 'తొండమాన్' అనునది బిరుదనామము. నుదురుపాటి వెంకనార్యకవి ఈతని యాస్థానమున నుండెను. ఆ వెంకనకవి సమస్యల నిచ్చుచుండగా ఈతడు పూరించుచుండుటవలన తత్ఫలితముగా నితని 'కవిజనోజీవని' గ్రంథము తయారైనది. ఈ ప్రభువు పై గ్రంథముకే గాక 'పార్వతీ పరిణయ' మను చక్కని ప్రబంధమును కూడ రచించెను.

### * కుమారయాచేంద్ర బహద్దరు

ఇతడు నవీనుడు. వెంకటగిరి సంస్థానప్రభువు బంగారు యాచేంద్ర భూపతి పుత్రుడు. 'సభారంజని' అను నాట్యగ్రంథము నీతడు రచించెను. ఇందు ఎనిమిది ప్రకరణములలో నాయికా నాయక, రస, సంగీత, తాళ హిందుస్తానీరాగతాళ, నాట్యాభినయ, శబవాద్య పాండిత్య రహస్య విషయములు ప్రతిపాదింపబడినవి. ఇది ముద్రితము.

రాజ్యాధికారము లేక రాజబంధువులయి గ్రంథములను రచించిన రాజకవులు కొందఱు కలరు. అట్టివారు ముప్పదిమందికి పైగా గానవచ్చుచున్నారు.

అధునాతన కాలములో జమీందారులై సాహిత్యపోషకులై స్వయముగ గ్రంథములను రచించినవారును కలరు. పయి రెండు తెగలవారిం గూర్చియు నిట ప్రస్తావించలేదు.

ప్రభువులై కవిపండిత పోషకులై గ్రంథములనురచించిన పై రాజకవులు భాషా వాఙ్మయముల కొనర్చిన సేవ యనిర్వచనీయము. వారి కీర్తి యాచంద్రతారార్కము వెలయునది!

"ఆంధ్రభాష యమృత మాంధ్రాక్షరంబులు
మురువులొలుకు గుండ్రముత్తియములు
ఆంధ్రదేశ మాయురారోగ్యవర్ధక
మాంధ్రజాతి నీతి నసుచరించు"

— సెటూరి

శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రి

శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం

# నేటి ★ ★ ★ ప్రసిద్ధాంధ్ర కవులు

శ్రీ
ఖండవల్లి లక్ష్మీరంజనం, ఎం.ఏ.
ఉస్మానియా విశ్వకళాపరిషత్తు
ఆంధ్రభాషాశాఖాధిపతి

ఆంధ్ర కవిత్వంలో పూర్వ సంప్రదాయ మనగేమి? ధర్మప్రధానమై నీతిబోధకమై శాస్త్రవిధిని విసర్జింపక చేయబడు ఆనంద ప్రయోజనమైన రచనా విశేషము ఇది. ప్రాయికముగా అనువాదాత్మకమైనది. గీర్వాణభాషయను అగాధకూపము నుండి ఈ కవులు ఎత్తిపోతురు. ఈ సంప్రదాయము ననుసరించు మహాకవులు తిరుచు ఉభయకవి మిత్రులు. సంస్కృతాంధ్రములందు దేశభాషా సమాటీకనంబున 'దివిజకవివరు గుండె యులు దిగ్గు' రనిపించగల సమర్థులు. వీరిలో కొందరు పాశ్చాత్య వాసనాభిజ్ఞులు. కొందరు తనంతతా వలచి వచ్చిన పాశ్చాత్య సభ్యతోర్వశిని త్రోసిపుచ్చగలిగిన పాండవమధ్యములు. మిసిమిజవ్వనపు పొంగు ఉడుకారిన నడివయస్కులును వృద్ధులును పూర్వ సంప్రదాయమునకు పారిషదులు. శాస్త్రులును, మన గ్రామసీమను ఈ కవిత్వమునకు చింతతోపులు.

శ్రీ లక్ష్మీరంజనం

## కృష్ణమూర్తి శాస్త్రిగారు

పూర్వ సంప్రదాయ ప్రవర్తకులలో ఆస్థాన కవిశేఖర, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రులవారు ప్రథమ గణ్యులు. సహస్రావధానులైన వీరు నేటికిని ఘటికాశత గ్రంథకల్పన దక్షులు. పూర్వ మహాకవులైన నన్నయ తిక్కన పోతనాదులు తమ జీవిత సర్వస్వములుగా తెంచుకొనిన మహాభారత భాగవతముల నేకాక రామాయణమును గూడ స్వీయనామాంకితములుగ ఏకలేఖినితో రచించి కవితా మహోద్ధతమును సృష్టించగలిగిన దీక్షానిధులు. ఇదికాక మరెన్నియో పద్య ప్రబంధములను శ్రీ శాస్త్రిగారు వెలయించిరి, వెలయించుచున్నారు. ఆంధ్రజాతి చరిత్రనే వస్తువుగా చేకొని యొక ఉదాత్త పురాణమును నిర్మించుచున్నారని వినికిడి. కవి సార్వభౌముని కవితా వ్యవసాయము విరివిగలందలోను కలది కాదని కొందరు ఛప్పరింతురు. 'కవిత చెప్పి యుభయకవిమిత్రు మెప్పింప నరిది బ్రహ్మకైన,' యని పేరు వడసిన తిక్కనామాత్యునివంటివాడు ఈ విమర్శన చేసినచో మనము పాటింపదగును. కాని నాలుగు పుంజీలు పద్యములనైన ధాటిగ చెప్పలేనివారి మాటల వంతగా లోకము పాటింప నక్కరలేదు. వ్యంగ్యమునకన్న హృద్యము శాస్త్రిగారు ఎక్కువగా ముపాసించిరి. వీరి కవిత్వము సులభపదఘటితమై, అన్వయక్లేశము లేక యొప్పారుచున్నది.

"స్నేహమునర్థ మూలమగు, స్నేహమునన్ భయశోక హర్షముల్
దేహికిబుట్టె రాగమను ద్వేషమునుం దొలగింపజేసి వ్యా
ద్రోహము హూర్చ్ఛగాన పతితుండు జనుండెడద న్విరాగియై
స్నేహము సేయకుండ దగు నెయ్యురపట్ల ధనంబు పట్లనున్"
శ్రీ కృష్ణ భారతము

## సూర్యనారాయణ శాస్త్రిగారు

కృష్ణమూర్తి శాస్త్రిగారి తరువాత పరిగణింపదగినవారు విద్వత్కవులు బ్రహ్మశ్రీ మల్లాది సూర్యనారాయణ శాస్త్రిగారు. వీరు తమ గద్య రచనల చేతనే లోకమునకు విశేష పరిచితులు. కవిత్వమునందు గూడా వీరు సిద్ధహస్తులు. కవిత్రయమువారు మహాభారతాంతర్గతమగు భవిష్యత్పర్వమును ఎలతో యాంధ్రీకరింపక విడువగా నీ పవిత్ర కార్యము తమ పాలబడెనని యుత్సాహముతో పూనుకొని శాస్త్రిగారు 'ఆంధ్రభవిష్య పర్వము'ను మృదుశైలిలో రచించి ధన్యత గడించిరి. వీరి రచనయే యగు 'ప్రేమతత్త్వము' అను మేరియొక పద్యకావ్యము తెలియవచ్చుచున్నది.

శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు

## శివరామ శాస్త్రిగారు

ప్రాచీనము నవీనము సమపాళముగా కలబోసికొన్న భావుకులు విద్వత్కవులు శ్రీ వేలూరు శివరామశాస్త్రిగారు ప్రసన్నకథా కలితార్థయుక్తితో గంటము నడుపగలవారు. ఆంధ్రమునందలి యనువాద సాహిత్యమునకు తిరుగులేని మూలము కాగల మరియొక క్రొత్తగనిని వీరు కనిపెట్టిరి. అది వంగ సాహిత్యము. విశ్వకవి రవీంద్రుని యమర రచనలనుండి యేర్చికూర్చి శివరామశాస్త్రిగారు 'కథలు గాథలు' అను చక్కని పద్యకావ్యము నవతరింపజేసిరి. వీరిశైలి ద్రాక్షాపాకమై కవితాభ్యాసకులకు దొరవడి కాదగియున్నది.

"ప్రావిస్తీ పురదాత సౌధములపై సాయంతనాలోకముల్
చేవల్ వించెను, దారులన్నియు దమోలీనంబులైపోయె శ్రా
వన్ సందడియుం బ్రచారమును దోడ్తోడ గ్రాచీనదిగ్
దేవాగారమునందు దివ్వె వెలుగొందెన్ బ్రాగ ఘంటాధ్వనుల్"
అవధాన శతకము

## నోరి నరసింహ శాస్త్రిగారు

శ్రీ కల్యాణానంద భారతీస్వామి ప్రాపిత కవిసమ్రాడ్బిరుదాంచితులైన శ్రీ నోరి నరసింహ శాస్త్రిగారు తిమోనుదంబులగు శ్రీ మాతృపదంబులను చెప్పగాగొని, కవితార్ణవముపై సాగినవారు. వీరు శ్రీదేవీ భాగవతమును సులభలాక్షణికమైన శైలిలో రచించిరి. పుణ్యప్రబంధంబుల నొనువుటయు ఆరాధన విశేషమును మన ప్రాచీన కవుల కోవలోనివారు వీరు.

"కోరను దీనికై ధనము, కోరను సద్యశమైనగాని, నే
గోరను గౌరవాంకములు, కోరను సత్పదజన్మ భాగ్యముల్,
కోరను జన్మమోక్షణము, కోరుదు దొక్కటె సుస్థిరంబుగా
శ్రీ రమణీయ పాదసరసీరుహముల్ విలసిల్లుటన్ మదిన్"
శ్రీదేవీ భాగవతము

## నాగవీరయ్య శాస్త్రిగారు

ఈ మార్గముతోనే ప్రయాణించు కవిశేఖరు లింకను ధన్యులు పలువురు గలరు. శివపురాణము, శారదత్రివిజయము వంటి కావ్యముల ప్రాచీన బ్రహ్మశ్రీ ముదిగొండ నాగవీరయ్య శాస్త్రిగారును, జాతక కథాగుచ్ఛము, కృష్ణ తిక్కన, వివేకానంద చరిత్రము న్నగు పెక్కు కావ్యములు లాక్షణికమైన జాను తెనుగులో సంతరించిన శ్రీ సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారును, యువహృదయము నందే ప్రాచీన వాసనలు బుసలుకొన, ఉడుకు చూపులతో నవాతనా లోకము రావిడిసేయ, ఆదర్శ జీవితములను కవితాబద్ధము చేసి, అష్టావక్ర చరిత్రము, అరుంధతీవసిష్ఠమువంటి రచనలు చేయుచున్న శ్రీ బులుసు వెంకటేశ్వరులుగారును ఈ తరహాలో పిడికెడు.

శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు

శ్రీ రాయప్రోలు సుబ్బారావు

స్వామి శివశంకరులు

## నవసంప్రదాయము

పూర్వ సంప్రదాయమునకు నమస్కరించి సెలవు గైకొందము. మాతృదేశతను త్రొక్కి ప్రియ కాంతను పెంకరించినట్లు ఆంధ్ర కవిత్వములోని నవసంప్రదాయమును సమీపింతము. దీనిని భావకవిత్వమనియు, నవ్యకవిత్వమనియు వ్యవహరించుచున్నారు. ఇది పెక్కు దూషణ భూషణములకును, పరిహాసములకును సన్మానములకును గురియై కాలుద్రొక్కుకొని నిలువగలుగుటచే దీనియందు జీవసారము కలదని ప్రతిపక్షులు కూడ నంగీకరించిరి.

పౌరాణిక్యముపై కొంత సాహసికపు తిరుగుబాటు నవకవిత్వపు మొదటి శంఖారావము. మధ్యతరగతి ప్రజల జీవితపు వేషభూషలు దీని ఇతివృత్తము. శృంగారవీరములే దీనిలో కూడ ముఖ్యరసములు. కాగా, విప్రలంభము వైపు త్రాసు మొగ్గినది. దేశభక్తి గీతముల రూపొందిన భావవీరము దీని వీరము. నన్నయాదుల కవిత్వము నందువలె దీనియందును అలంకారము అప్రయత్నపతితము. శిష్ట ఛందములు నీటిలోని కొదిగినవి. ప్రజాఛందములైన గేయ ఫణితులు నవకవిత్వపు మధుచషకములు. ఇతివృత్తము నడపుటలో, నవకవిత్వమునకొక్క తీరు తెన్నులు పాతపుంతలను విడచినవి. కథ సుఖాంతమే కావలెనను తాపత్రయము లేదు. కావున 'కుర్యాన్నిర్వహణేఽద్భుతం' అనునూక్తి ప్రసక్తి తగ్గినది. నాయికానాయకులను సుఖడోలికలలో నూపుట కన్న కష్టపుటింగలములలో పొరలించుట శిల్ప ప్రాశస్త్య ప్రకటనమునకు నికషమని యుక్తముగా గుర్తింపబడెను. బాహ్య వస్తువులుగాక కవి యొక్క అంతరచిత్తవృత్తియే భావనా విషయమయ్యెను. కవికి కవియే కవితావస్తువు! ఇట్టి విన్యాసము మన పూర్వ కవిత్వమునకు అపరిచితము.

శ్రీ శాంత

శ్రీ కృష్ణశాస్త్రి

నవకవిత్వమునందలి మరియొక చమత్కారము పూర్వపద్ధతివారికి చీదర కలిగించెను. ఒకానొక ఆదర్శరూపిణియైన ప్రియురాలి ప్రణయమునకై పరితపించుచున్నట్లు వర్తమానకవి చిత్రించును. ఇది అచ్చముగా వ్యక్తిగతమైన విలాపమో, ప్రలాపమో యని పూర్వ సంప్రదాయమువారు భ్రమసిరి. వాస్తవమున కిదియొక నూత్న కవిత్వ సంకేతము. ఈ ఆదర్శ ప్రణయిని లౌకిక కాంత కాదు. కల్యాణగుణసుందరుడైన భగవంతుడే. ఈ కావ్యనాయిక ఇది భగవద్భావనావిషయమైన యొక మధురభణితి. ఒక్కొక్కప్పుడు ఈ సంకేతము విపరీతమై కవియే నాయికయగుటయు భగవంతుడు కాంతుడగుటయు తోచును. దీని మధుర భక్తియని వ్యవహరింతురు.

## "గురజాడ-రాయప్రోలు"

ఏతాదృశ గుణవిశిష్టమైన నవ్యకవితకు అమరకవి గురజాడ అప్పారావుగారు పాదులు త్రవ్వి, మృదుగేయ సేచనముచే పదను చేసి బీజంకురు డయ్యెను. ఈ మాగాణి పొలమునందు వివిధ రీతుల నవ్యకవితాసస్యమును పండించిన తొలిపాలము శ్రీ రాయప్రోలు సుబ్బారావుగారు. గురజాడ పాశ్చాత్యసభ్యతకు ముగ్ధశిశువయ్యెను. రాయప్రోలు ఆర్షవిజ్ఞాన ప్రీతి - జాతీయ భావోదయము అను తరంగడోలికలమీద తేలియాడెను. నవ్యకవిత్వము ఖండకావ్యములకేకాక సంపూర్ణ కావ్యములనుగూడ పుష్పింపగలదని తొలిసారి చూపిన గౌరవము వీరికి దక్కినది. ఆంగ్లకావ్యానుసృతియైన 'లలిత'తో నారంభించి, సాంఘిక వృత్తములనుండి స్వీయకల్పనా చమత్కృతిచే విభూషితములైన 'తృణకంకణము' 'స్వప్నకుమారము' మొదలగు కతికమాత్ర పరిమాణము గల్గియు

(22-వ పేజీ చూడుడు)

బుద్ధుడు : బాలలు - నాగార్జున కొండలోని ఒక శిల్పఫలకం. (ఫోటో: పురావస్తు శాఖవారి సౌజన్యంతో)

సర్వార్థసిద్ధుడు బోధివృక్షంక్రింద ధ్యానయోగంలో ఉండగా మారుడు ఆయనతపస్సుకు భంగం కలిగింపబోయి, విఫలుడై వెళ్లుటను తెలిపే, నాగార్జునకొండలోని, శిల్ప శిలాఫలకం.



అసితమహాముని, శుద్ధోదనుల సంభాషణమును, సిద్ధార్థుడు శివాలయానికి విజయం చేయుటను తెలిపే, నాగార్జునకొండలోని ఇంకొక శిల్ప శిలాఫలకం.

# నాగార్జునకొండ శిల్పఫలకాలపై బుద్ధదేవుని పునీతచరిత్ర

ప్రపంచ మహాపురుషులలో బుద్ధుడు ప్రథముడు. ఈ ప్రపంచంలోని దుఃఖాన్ని, భరించలేక దీనినుంచి తనకు విముక్తి కలిగించగల సంబుద్ధిని సముపార్జించడానికి దీక్షవహించిన ఒక మహానుభావుని ఆదర్శ జీవిత మాయనది రాకుమారుడుగా జన్మించిన వ్యక్తి భోగవిలాసాలను పరిత్యజించి విరాగిగా గడప పూనడంచేత, తుదకు తాను పొందిన సంబుద్ధి సాధనయందు ఆయనకుగల అపార ఆసక్తి కారణమనాలి. ఆ కరుణామూర్తి తాను పొందిన వికాసాన్ని ఇతరులకు కలిగించేందుకు తనసందేశాన్ని స్వయంగా దేశం నాలుగుమూలలకూ వ్యాపింప చేశారు

> దక్షిణ భారతములోని బౌద్ధుల స్తూపసంపదకు సంబంధించినంతవరకూ, నాగార్జునకొండ మహత్తరమైనది బుద్ధుని జీవితంలోని అనేక ఘట్టాలూ, జాతకాలూ ఇక్కడ విస్తృతావధిని చిత్రింపబడి వున్నయ్ బుద్ధదేవుని చరిత్ర యింత విపులంగా శిల్పకృతులను ధరించివున్న ప్రదేశం ఇది మినహా మరొకటి యెక్కడా లేదేమో ఇక్ష్వాకువంశ (ఆంధ్ర) రాజులు 3-వ శతాబ్దిలో కృష్ణానదీ పావనతీరాన తమ పలుకుబడిని వెలయించి యీశిల్పఖనిని మనకు వారసత్వంగా అందించి వెళ్లారు అమరావతీ ప్రసిద్ధ స్తూపంవలెనే, శిల్పసంపద వెల్లివిరిసిపోయిన నాగార్జునకొండ స్థూపాలు ఆంధ్రజాతికి గర్వకారణమైనట్టివి.

## అశోకునిసేవ

ఆయన తదనంతరం ఆయన శిష్యులు ఆపని చేశారు బుద్ధుని నిర్వాణానంతరం ఆయన భౌతికావశేషాల కోసం సమకాలిక రాజులు నేనంటె నేనని ఎగబడి, వాటిని అపారగౌరవ ప్రపత్తులతో తమతమరాజ్యాలకు కొనిపోయి స్తూపాలు నిర్మించి వాటిలో నిక్షేపం చేయించినట్లు అమరావతిలోని ఒకశిల్పం తెల్పుతోంది. బౌద్ధమత ప్రచారానికి తన యావజ్జీవితం ధారపోసిన మహాచక్రవర్తి అశోకుడు ఆయన ఈమతాన్ని విస్తారమైన తన సామ్రాజ్యం అంతటా మాత్రమే కాక ఇతరత్రా కూడా వ్యాపింపచేశాడు. అశోకుడు రామగ్రామస్తూపం మినహాయించి మిగతా అన్ని స్తూపాలనూ తెరపించి వాటిలోని బుద్ధుని అవశేషాలను తీయించి వాటిని ఇంకా ఖండఖండాలు చేయించి, దేశమంతటా 84 వేల స్తూపాలు నిర్మించాడని ఒక గాథ వుంది. అంతేకాదు. ఆయన అనేక మంది శ్రమణకులను వివిధ ప్రాంతాలకు ప్రచారార్థం పంపాడు ఆంధ్రదేశానికికూడా పంపాడు శాతవాహనుల తూర్పురాజ్యానికి స్థావరమైన కృష్ణాతీరం బౌద్ధమత చరిత్రలో ఒక గొప్పశకాన్ని అనుభవించింది ఈ ప్రాంతంలో ఎన్నో గుట్టలు వున్నాయి పురాతత్వజ్ఞుని చేతి ప్రభావంతో పాలరాతిపై దక్కని లతలు చెక్కిన స్తూపాలెన్నో ఈప్రాంతంలో బయటపడ్డాయి. అటువంటివాటిలో ప్రపంచ ప్రసిద్ధిపొందిన అమరావతి స్తూపం ఒకటే భట్టిప్రోలు, గుమ్మడిదుర్రు, జగ్గయ్యపేట, గోలి మొదలైన చోట్ల దొరికినవి ఇట్లాంటివి చాలా వున్నాయి పలనాడులోని నాగార్జున కొండ ఈచక్కటి శిల్పరత్నాలకు నిలయం ఆ ప్రాంతంలో ఎన్నో స్తూపాలున్నాయి. అమరావతిలో వలెనే నాగార్జునకొండలో కూడా శిల్పులు స్వకపోలాలలో శిల్ప ఫలకాలపై బుద్ధచరిత్రను, ఆయన పూర్వజన్మగాథలను చిత్రించి పుష్పాంజలి సమర్పించారు

నాగార్జునకొండ శిల్పాలను అమరావతి 4 వ శకపు కళతో పోల్చవలసి వుంది అయితే అవి క్రీస్తుశకం 3 వ శతాబ్దికి చెందినవని చెప్పాలి మిగతా బౌద్ధక్షేత్రాలలోకంటె ఇక్కడ బుద్ధచరిత్రను బాగా చిత్రించారు ఇతర చోట్ల కనపడని దృశ్యాలు అనేకం ఇక్కడ కనిపిస్తాయి కాని తథాగతుని జీవితాలు అందరికీ తెలిసిన ప్రధాన ఘట్టాలు ఇక్కడకూడా అమరావతిలో లభించినటువంటి ఇతరస్తూపాలలో వున్న మాదిరిగానే కనిపిస్తాయి.

## శ్వేతగజపతి అవతరరాగాథ

తుషితస్వర్గంనుంచి శ్వేతగజరూపంలో ప్రభు అవతరణగాథ ధర్మవిష్కారార్థం ధరపై పుట్టవలసిందని బోధిసత్వునికి దేవతల ఉద్బోధతో ప్రారంభమవుతుంది బోధిసత్వుడు ఈరీతిగా దేవతలుమోసే విమానాలు నలువైపులా దివ్యులు, కొందరు మంగళవాద్యాలు వాయిస్తూనూ, కొందరు నాట్యాలుచేస్తూనూ మరికొందరు పూజలుచేస్తూనూ తమ సంతోషాతిశయాన్ని వెల్లడిస్తూండగా దివినుంచి భువికి అవతరిస్తాడు ఈ వర్ణనఅంతా అమరావతిలో లభించిన ఫలకంమీద వున్న రీతిగా వేవుంది

# తెలుగుతల్లి కిరీటకోటీరమణులుగా ప్రాచీనాంధ్ర శిల్పులు వెలిగించిన కళాదీపికలు

★
రచన
శ్రీ కంచి శివరామమూర్తి
(ఇండియన్‌మ్యూజియం పురాతత్వశాఖ, సూపరింటెండెంటు)
★

## లుంబినీ వనగాథ శైశవ చరిత్రలు

సిద్ధార్థ రాకుమారుడు లుంబినీ ఆరామంలో జన్మించడము, ఇంద్రుడూ, దిక్పాలకులూ పట్టుకొన్న పట్టువస్త్రంపై ఏడుఅడుగులు వేయడము కూడా అదేవిధంగా చెక్కబడింది బిడ్డడు సకలనరాధిపుడో సంబుద్ధి పరుడో అవుతాడన్న జ్యోతిషానికి సంబంధించిన చిత్రరువులో, ఒక లేఖకుడు తాటాకులపై గంటంతో ఆయా అంకాలను వ్రాస్తున్నట్లున్నది చాలా బాగుంది ఒక చెక్కడంలో బిడ్డను కులదేవతకు చూపుతూండగా బిడ్డను చూడడంతోటే ఆ దేవత భక్తితో చేతులు రెండూ జోడించినట్లు గంధర్వులు ఆసమయాన మంగళవాద్యాలు వాయించి ఉత్సవం జరిపినట్లూవుంది ఆ తర్వాతిదృశ్యంలో, శుద్ధోధనుని చూడవచ్చిన అసితమహర్షి బిడ్డను అత్యంత ఆప్యాయతతో దగ్గరకుతీసుకొని తనకు పెద్దతనం వచ్చినందున బుద్ధుని ప్రబోధభాగ్యం పొందేవరకూ జీవించలేనే అని విచారపడతాడు సిద్దార్థ రాకుమారుడు ప్రపంచాన్ని పరిత్యజిస్తూండడం, తన ఆభరణాలన్నిటినీ ఒక్కొక్కటే తీసి తన ప్రియసేవకుడు చన్నునికిస్తూండడం, అప్పుడు ఆయన ప్రియమైన అశ్వం కంటకం తన యజమానిని మరిక ఎన్నడూ చూసే భాగ్యం వుండదే అన్న భావంతో దీనంగా ఆయన ప్రక్కను నిలబడివుండడం — ఇదంతా బహు హృదయవిదారకంగా చూపే చిత్రం ఒకటున్నది మరో ఫలకంపైన, సిద్దార్థుడు పరిత్యాగానికిముందు విసిరి పారవేసిన తలపాగాను స్వర్గలోకవాసులు సముత్సాహంతో స్వర్గానికి తీసుకుపోతూండడం వుంది మారధర్షణ దృశ్యంకూడానాగార్జునకొండలోనూ, ఘంటసాలలోనూ, ఇతరచోటనూ వుంది ఈదృశ్యంలో బుద్ధుని దీక్షను సడలించడానికి మారుడు ఆయన దగ్గరకు రావడం తుదకు పరాభూతుడై పలాయనం చిత్రించడం వున్నాయి.

## చిత్రాల సమగ్రత

కృష్ణాతీరంలోని ఇతర స్తూపాలలో వలెనే ఇక్కడకూడా చిత్రాలలో సమగ్రత చాలా గొప్పగావుంటుంది మరోఫలకంలో, తానుపొందిన సంబుద్ధిని మానవాళీక ప్రయోజనార్థం ప్రకటించవలసిందని దేవతలచే కోరబడిన జ్ఞాని అయిన బుద్ధుడు కనిపిస్తాడు కృష్ణాతీరంలో అభిమానదృశ్యం ఒకటుంది అది నాగరాజు ముచిలిందుడు బుద్ధుని ఒక తుపానునుంచి రక్షించేది ఇదికూడా నాగార్జునకొండలోవుంది సిద్ధార్థుడు రాజప్రాసాదంనుంచి కంటకమనే తనగుర్రంపై బయలుదేరే దృశ్యం ఇక్కడ బహు విశదంగా చిత్రించబడింది సిద్ధార్థుడు సంగపరిత్యాగం చేసి, సంబుద్ధిసాధనా యాత్ర సాగిస్తాడుకదా అని దివ్యులు అత్యంతసంతోషం వెల్లడించడం ప్రత్యేక ప్రాధాన్యంతో ఇందులో చూపబడింది సిద్ధార్థునిగుర్రం గిట్టలచప్పుడు రాచనగరులోవారికి నిద్రాభంగం కలిగించకుండా, వారు లేచి సిద్ధార్థుని ప్రస్థానానికి ప్రతిబంధకం కలిగించకుండా దేవతలు అశ్వరపు గిట్టలను వహించిన తీరుకూడా ఇతరచోట్ల వలెనే ఇక్కడకూడా సవివరంగా చిత్రించబడింది రాజగృహవీధులలో బుద్ధుని నలగిరి అనే ఏనుగు, చేత తొక్కించివేయాలనే మాదిరి దేవదత్తుని క్రూర ప్రయత్నాల చిత్రణ బౌద్ధశిలలో, చిత్రరేఖనంలో అభిమాన ఇతివృత్తం ఈ సంఘటనను చాలా చక్కగా చిత్రించిన దృశ్యం అజంతా గుహాలలో వున్నది నాగార్జున కొండలో కూడా ఒక ఏనుగు భయంకరంగా ఎగబడి దారిలో అడ్డమొచ్చినవారి నందరినీ తొక్కివేస్తూ, దంతాలతో కుమ్మివేస్తూ బుద్ధుడు కనిపించటంతోటే గభాల్న మోకరిల్లటం, ఆయన శిష్యులు అది చూసి భక్తితో చేతులు జోడించడం చూపే దృశ్యం ఒకటుంది

## అపురూప ఘట్టాలు

బుద్ధుని జీవితఘట్టాలలో, ఇతర చోట్ల అంత బాగా చిత్రించబడనివి, అసలే చిత్రించబడనివి, ఇంకా ఎన్నో నాగార్జున కొండలో చాలా విశదంగా వున్నాయి ఉదాహరణకు ఇక్కడ 6 గురు శాక్యరాజ కుమారులకు దీక్షనిచ్చే దృశ్యం ఒకటున్నది. ఇందులో ఆ రాకుమారులను సన్యాసులుగా మార్చేందుకు మంగలి వారి అందమైన కేశాలను తీసివేయడం మొదలైన వివరాలు కూడా వుండి దృశ్యం ఇంకా బాగుంది ఆఖరుకు మంగలి ఉపాలికూడా ఆరాకుమారులతోపాటు దీక్ష స్వీకరిస్తాడు దివ్యవదనంలో జయ అనే ఉత్సాహంతో ఒక బిడ్డ తథాగతునికి తాను బియ్యపు రొట్టెలు పెడుతున్నా నంటూ పిడికెడు మట్టి బుద్ధుని భిక్షాపాత్రలో వేయడం, ఈ సుగుణానికిగాను ఈ బిడ్డ వచ్చే జన్మలో చక్రవర్తిగా పుట్టగలడని బుద్ధుడు ఆశీర్వదించడం, ఆయన వాక్కు ఫలించి ఆ బిడ్డే అశోకుడుగా జన్మించడం చూపేదృశ్యం వుంది, ఈ దృశ్యం ఇంకెక్కడా లేదు అమరావతిలో కూడా వున్నా, నాగార్జున కొండలో మరింత బాగావున్న ఇంకో హృదయ విదారక దృశ్యం బుద్ధుడు

## సౌందరనందం

తన దాయాది నందునికి దీక్ష ఇచ్చిన తర్వాత నందుని మనస్సు తన భార్య మీదికి మళ్ళుచుండేది నందుడు సదా సౌందర్యవతి అయిన తన భార్యమీదే మనస్సుంచుకున్నట్లు బుద్ధునికి తెలిసింది ఒకరోజున ఆయన తన అధ్యాత్మికశక్తితో నందుని దివ్యసీమలకు తీసుకు వెళ్ళారు మార్గంలో వికృతంగా వున్న ఒక ముసలికోతిని చూపి సుందరి ఇంతకంటే బాగుంటుందా అని అడిగాడు నందుడు తన భార్య చక్కదనం వికృతానికి సరిగ్గా ప్రతికూలమనీ, ఆమెకూ ఈ కోతికీ పోలికేమిటనీ అన్నాడు. బుద్ధుడు అతనిని ఇంకా కొంతదూరం తీసుకు వెళ్ళారు ఒక రమణీయ ఆరామంలో విహరిస్తున్న అప్సరాంగనలను చూపించి, ఈ అన్నుల మిన్నలలో పోలిస్తే ఆవిడ ఎట్లా వుంటుందని అడిగాడు. నందుడు వారినిచూసి, వారి ముందు తన భార్య ఇందాకటి కోతివలె వుంటుందని ఒప్పుకొన్నాడు. సన్యాస జీవితం గడిపేటట్లయితే ఈ అచ్చరభామలు నీకు లభిస్తారని బుద్ధుడు నందునికి వాగ్దానం చేశాడు 'నందుడు మొదట్లో ఈ కోరికతోనే సన్యాసానికి ఒప్పుకొన్నా అనతికాలంలోనే అతని మనస్సు మారిపోయి, సుందరులమీదా, అప్సరసలమీదా కూడా కాంక్ష లేకుండా పోయింది. బుద్ధుడు నాగరాజు అపలాలుని నిర్జించిన విధం నాగార్జునకొండలో రెండుచోట్ల చిత్రించబడింది తథాగతుడు ఇంద్రశైల గుహలో వుండగా ఇంద్రుడు ఆయన దర్శనార్థమై రావడమూ, ఆయనతో వచ్చిన వీణావాద్యకుడు పంచశిఖుడు వీణ వాయించి మధురమైన వాతావరణంలో తథాగతుడు ఇంద్రునికి దర్శన మిచ్చేటట్లు చేయడమ్ము కూడా నాగార్జున కొండలో చాలా చోట్ల చిత్రించబడింది ఈ దృశ్యం అమరావతిలోనూ, ఇతర బౌద్ధక్షేత్రాలలో ప్రతిచోటా కూడా కనిపిస్తుంది కాని నాగార్జునకొండ ఫలకాలన్నీ చాలా సజీవంగా వుంది.

## కప్పినగాథ

గొప్పరాజులు, బుద్ధుని సమకాలీకులు అయిన ప్రసేనజిత్తు, అజాతశత్రు ఆయనను దర్శించవచ్చిన దృశ్యాలు, బార్హుత్‌లో వున్నాయి అజాతశత్రు బుద్ధుని దర్శించవచ్చిన దృశ్యం అమరావతిలో వుంది. అట్లాగే కప్పినుడు అనే రాజు బుద్ధుని దర్శనార్థం వచ్చినట్లు నాగార్జున కొండలో వుంది అయితే ఇందులోని శిల్పానికి సాటివై రెండింటిలోగానీ, బౌద్ధశిల్పంలో మరెక్కడగానీ కనిపించదు నాగార్జునకొండలో ఈ కప్పినరాజు రాక అభిమాన విషయంగా కనపడుతుంది ఈ దృశ్యాలను ఎంతో చక్కగా, వివరంగా రచించారు కప్పినుడు కుక్కుటపురపు రాజు ఒక బుద్ధుడు ఈ భూమిమీద ఎప్పుడు అవతరిస్తాడా, ఆయన ప్రబోధ భాగ్యం ఎప్పుడు లభిస్తుందా అని ఎదురు తెన్నులు చూస్తున్నాడు సంబుద్ధ పరుడు అవనిపై అవతరించాడని విని వినటంతోటే ఉరకలు పరుగులతో తథాగతుని దర్శనార్థం వెళ్లాడు. ఆయన ధర్మోపదేశం విని వెనువెంట సంగపరిత్యాగం చేసి, బుద్ధుని అంతేవాసులలో అగ్రగణ్యులలో చేరాడు.

## మానవారసత్వం

దక్షిణ భారతంలోని బౌద్ధ స్తూపసంపదకు సంబంధించినంతవరకూ నాగార్జునకొండ మాట చెప్పవలెగ్గది. బుద్ధుని జీవితంలో చాలా ఘట్టాలు, చాలా జాతకాలు ఇక్కడ బహు వివరంగా చిత్రించారు ఇటువంటివి కొన్నైనా ఇతర చోట్ల కనిపించవు. ఇక్ష్వాకువంశ రాజులు 3 వ శతాబ్దిలో కృష్ణాతీరాన పలుకుబడి సాగించి మనకు వదిలిపోయిన శిల్పఖని నాగార్జునకొండ. ప్రసిద్ధ అమరావతీ స్తూపంవలెనే, నాగార్జునకొండలో శిల్పసంపద వెల్లివిరిసే గొప్ప స్తూపాలు కూడా ఆంధ్రులకు గర్వకారణ మైనట్టివి

# పాషాణాలకు ప్రాణం పోసిన ఆంధ్రశిల్పులు

18-పేజీ కారవ

వుంటేవారు వారి ధనంతో అమరావతి, నాగార్జునకొండ, మొదలైన అద్భుత బౌద్ధకేంద్రాలను వెలయింప జేశారు. బౌద్ధధర్మం, ఆంధ్ర ప్రజలలోని ఆర్యజాతివర్గాలలో కంటె, అనార్యజాతి తెగలలో ఎక్కువగా వ్యాపించింది ఇతర దక్షిణాది ప్రాంతాలలో కంటె, ఆంధ్రసీమలో బౌద్ధకేంద్రాలు విస్తృతంగా వ్యాపించినై ఉత్తరాన విశాఖపట్నంలోని శాలిహుండంనుంచి దక్షిణాన గుంటూరు జిల్లాలోని చినగంజాంవరకూ, పశ్చిమాన గూటినుంచి తూర్పున భట్టిప్రోలువరకూ, ఆంధ్రదేశంలో బౌద్ధమతం, బౌద్ధకళలు, క్రీ. శ. మొదటి మూడు శతాబ్దములలోనూ మహోజ్వలస్థితిని అనుభవించినై రామతీర్థం (ఆరామతీర్థం) సంకారం (సంఘారామం), శాలిహుండం, కొడాలి, అరుగొలను, గుంటుపల్లి, జగ్గయ్యపేట, రామిరెడ్డిపల్లి, అలూరు, విజయవాడ, గుడివాడ, ఘంటసాల (కంటకొయిశాల) గరికపాడు, గోలి, నాగార్జునకొండ, అమరావతి, పెదమద్దూరు, చినగంజాం, పెదగంజాం, భట్టిప్రోలు ఈ మొదలైన అనేక ప్రదేశాలలో పురాతత్వ పరిశోధకుల కృషి ఫలితంగా, ఆంధ్ర జాతి మహోజ్వల చరిత్రకు ఆధార భూతాలు కాదగిన అనేక ప్రాచీన శిల్పసంపదలు బయటపడినై స్తూపాలూ, చైత్యాలు, ప్రార్థన మందిరాలు, గుంటూరు మండలంలోని కృష్ణానది పొడవునా అనేకం బయటపడినై ఈ గుంటూరు మండలాన్నే యవనులు 'మజ్జోలాయ్' అని పేర్కొన్నారు

దక్షిణభారతదేశంలోని బౌద్ధకేంద్రాలను ఉనికిని పరిశీలించితే ఒక విచిత్రమైన విషయం బోధపడుతుంది వేంగిక్షేత్రం కూడలిగా దక్షిణ దేశంలో పలుముఖాలా ఒక అయిదు ప్రధానమైన రహదారులు వుండేవని అనుకోవలసి వస్తోంది. ఈ రహదారుల ప్రక్కనే వివిధ బౌద్ధకేంద్రాలు వుంటూ, ఈ రహదారులు (ద్రవిడ, కళింగ, కర్ణాటక, మహారాష్ట్ర), దక్షిణ కోసల దేశాలకు వ్యాపించి వుండేవి శాతవాహన, శాతకర్ణి, ఇక్ష్వాకు రాజులు పాలించిన కాలం నిజంగా ఆంధ్రుల చరిత్రలో మహోజ్వలదశ నాటి ఆంధ్ర బౌద్ధ శిల్పులు ఉలుల మొనలతో పలుకురాళ్లకు జీవాలు పోశారు. కార్లే, భాజా, నాసిక్, కన్హేరి, నానాఘాట్, గుంటుపల్లి, కొపవరం, విజయవాడ ప్రాంతాలలో కొండగుట్టలనన్నిటినీ గండరించి శిల్ప సంపదలకు ఆలవాలములైన అనేక చైత్యములనూ, స్థూపములనూ నిర్మించారు ప్రకృతిశోభను తిలకించి తన్మయులై ఆ మహావేశాన్నంతా గండ శిలలలో రూపొందించారు సాంచి, గోలి, నాగార్జునకొండ మొదలైనస్తూపాలకు చుట్టూ తోరణద్వారాలు నిర్మించారు వాటిమీద బుద్ధదేవుని జీవిత ఘట్టాలను, జాతకకథలను అద్భుత వైఖరిని చిత్రించి, భారతదేశాన్ని సుదిగోపుర శిల్పసంపదల మహోన్నత సీమగా ప్రపంచవిఖ్యాతికి తేగలిగిన గౌరవం ఆంధ్రరాజులకు దక్కింది

ఆంధ్రదేశంలో, నాగార్జునకొండ, శాలిహుండం, రామతీర్థం, కొపవరం, అద్దురు మొదలైన ప్రాంతాలలో ఇటీవల బయల్పడినస్తూపాలూ, మహాచైత్యములు, విహారములు మొదలైనవాటివల్ల బౌద్ధులనాటి కళావైజ్ఞానిక రంగములకు సంబంధించిన అనేక నూతన విషయాలు బయటపడినై

## నాగార్జునకొండ శిల్పాల ప్రాధాన్యత

నాగార్జునకొండ వద్ద 1926-30, 1938 40 సంవత్సరాల మధ్య జరిగిన పరిశోధనలలో కేవలం చైత్యములు, విహారములు, స్థూపములేగాక ఒక రాజాంతఃపురం, పశువలరేవు ఇక్ష్వాకు రాజుల శాసనాలు అనేకం బయటికి వచ్చినై ఇక్కడ బయల్పడిన స్తూపాలమీది శిల్పాలలో బుద్ధుని చరిత్రకు, జాతకకథలకు సంబంధించిన గాథలన్నీ కొల్లలుగాచిత్రించబడివున్నయ్ చిత్రవిచిత్రములైన లతాదిక సంపదలుకూడా బహుళంగా గంపరింపబడివున్నయ్. మతం కళాభివృద్ధికి దోహదకారిగా వుంటుందన్న విషయం సర్వులూ అంగీకరించినదే మతమంటే కేవలం ధర్మబోధలూ పూజా పురస్కారములూ మాత్రమేనని అనుకోనక్కరలేదు ఈ మతాలకు ప్రాణప్రాయమైన ఆధ్యాత్మికావేశం, ఈవిధంగా శిల్ప చిత్రరూపాలలో వ్యక్తీకరింపబడుతుంది నాగార్జునకొండ శిల్పాలు ఈ దృష్ట్యా అత్యంత ప్రధానమైనవి.

శాలిహుండం కొండమీద బయల్పడిన ఆరామం చాలా చిత్రంగా వుంది ఈ కొండ శిఖరాన కిరీటంలా వున్న యిక్కడి చైత్యం యితర ఆంధ్ర ప్రాంతాలలోవున్న మాదిరిగా గుండ్రంగా వుండకుండా అర్ధచంద్రాకృతిగా వుంది దానివెనుక వలయాకారంగా మహాచైత్యంవుంది దాని ఉపరిభాగమంతా ఇటుకలతో కప్పబడివుంది ఈ మహాచైత్యం స్వర్ణ పుష్పాలు చెక్కిన స్ఫటికములతో అలంకరింపబడివుంది ఈ బౌద్ధారామం పేరు 'కటహారామం'. ఈ పేరు సుమత్రాలోని 'కటహా' (కేదహా) అనే ఆరామనామాన్ని పోలివుంది. ఈ నిర్మాణమంతా ఇప్పుడు శిథిలమై వున్నా, పూర్వం బాగున్న దినాల్లో, ఇది కళింగపట్నం రేవులోనే కనుపించేదని తోస్తుంది కళింగపట్నం రేవు దీనికి మూడుమైళ్ళ దూరంలో వుంది సముద్రాంతర దేశాలనుంచి వచ్చే యాత్రికులు ఈ రేవుకు చేరి వంశధారా నది వెంట ప్రయాణంచేసి ఈ క్షేత్రానికి చేరుకునేవారు

రామతీర్థం కూడా (ఆరామతీర్థం) స్థానికంగావున్న కొండమీద ద్యోతమానంగా కనిపిస్తూ వుంటుంది అది నిట్టనిలువుగావున్న కొండ ఆ కొండ చుట్టూ, అనేక చిన్న చిన్న స్తూపాలూ, ఆరామాలూ, చెల్లా చెదరుగా నిర్మింపబడి వున్నయ్ వీటిని చేరుకోవటమే అసాధ్యంగావుంటుంది ఇలా ఎందుకు నిర్మించారో తెలియదు. బౌద్ధులు కొందరికులుగా యిక్కడ తలదాచుకొనేవారా, లేక తమ మతారామములను అందుకోరాని ఆకాశపథాలలో నిర్మించాలనే ఆవేశంతో అలా కట్టారా అని సందేహం కలుగుతుంది. రామతీర్థం, శాలిహుండం ఆరామాల్లో, బౌద్ధయుగం తుది రోజులలో ఆవిర్భవించిన కళాసంప్రదాయ రేఖలూ, బౌద్ధవిగ్రహాలూ కనుపించుచూవున్నా, కారణంగా ఈ ఆరామాలు క్రీ. శ. 8, 9 శతాబ్దాల వరకూ ఉజ్వలదశ ననుభవిస్తూ వుండేవని అనుకోవలసి వస్తోంది

కొపవరం కొపవరం కొండ రాజమహేంద్రవరానికి 14 మైళ్ల దూరంలో వుంది ఈ కొండమీద అనేక గుహలు తొలచబడి వున్నయ్ కొండ ఉపరిభాగంలో లోతైన ఇటుకలు త్రవ్వబడివున్నయ్ ఇక్కడ చాలా పరిశోధన జరుగవలసి వుంది

అద్దురు. అద్దురు తూర్పు గోదావరి జిల్లా రాజోలు తాలూకాలో వుంది. ఇక్కడ ఒక ఆసామి భూమి త్రవ్వుతూ వుండగా రెండు స్థూపాలు బయటపడినై ఇక్కడ లభించిన పాతయిటుకలు, మృణ్మయ పాత్రా శిధిలాలూ, నాణెములూ తిలకించితే ఇవన్నీ క్రీ. శ. 2, 3 శతాబ్దుల నాటి కనిపిస్తోంది

గోపురశిఖరాలతో వెలుగొందుతూన్న చైత్య దేవళ నిర్మాణముకే గాక ఆంధ్రదేశం నలుగడలా, అద్భుత రీతిని కొండలలోనికి తొలచబడిన గుహావాసము లనేకం వున్నాయి గుంటుపల్లి, కార్లి, నాసిక్, కన్హేరి, విజయవాడ, ఉండవల్లి, భైరవకొండ శిల్ప చిత్రకళారంగాల్లో ఆంధ్రసీమ అనుభవించిన మహోజ్వల దశను ద్యోతమానం చేస్తున్నయ్ అమరావతి నాగార్జున కొండ శిల్పాలు మన హృదయాలను ద్రవింపజేసి రసానందానుభూతి కలిగించితే, గండశిలలలోనికి గండరించిన ఈ పాషాణ గుహాసౌధాలు మానవుని అఘటనఘటనా సమర్థతను ద్యోతమానంచేసి, భక్తిని ప్రసాదించేవిగా వున్నయ్

ఒక్కవాక్యంలో చెప్పాలంటే ప్రాచీనాంధ్ర శిల్పులు, ఉలుల మొనలతో నిర్జీవ పాషాణ శిలలకు జీవాలు పోసి జీవచైతన్యం వెల్లివిరిసిపోయిన స్వర్గసీమలను నిర్మించి మయుని మరపించారు.

# ఆంధ్ర ప్రశస్తి:

24 వ పేజీ తరువాయి

సచివులు పుత్రశోక భరసంజ్వరు భూపతిఁ జూచి వారు తీ
రిచిన తీర్పు రాజు పఠరించను వచ్చునటంచుఁ జెప్ప న
య్యుచిత వివేక పుత్రవిరహోగ్ర భరాత్ముడు గాని న్యాయకా
ర్య దరణిఘోర దుఃఖవికలాత్ముడు గాని పల్కె వెండియున్॥
అసువులు పోవునంతవరకొప్పని యేగను గాని పాపమే
కసుతి వియోగదుఃఖితుడు, క్ష్మాపతి దేహము భూప్రజార్థమై
యసువుల నిల్పవాటి దినశాంతి మునక్ యువరాజు కూర్గి
వసుధదిది ప్రవాహవలయంబులలో మలయంజవోల్పెనో.

నటశిర పాయం సంధ్యా
ఝటాఘటానూపురమణి సంభవ కాంతి
స్ఫుట 'చిటచిటచిట' నినదో
ద్భట కనకము విజయవాటి వర్షము కురిసెన్.

# మా తెలుగు తల్లికి...

మా తెలుగుతల్లికీ మల్లెపూదండ
మాకన్నతల్లికీ మంగళారతులు
కడుపులో బంగారు కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులుదొర్లించుమాతల్లి ॥
గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగులిడుతుంటేను
బంగారుపంటలే పండుతాయీ
మురిపాలముత్యాలు దొర్లుతాయీ ॥మా
అమరావతీనగర అపురూపశిల్పాలు
త్యాగయ్యగొంతులో తారాడు నాదాలు
తిక్కయ్యకలములో తియ్యందనాలు
నిత్యమై నిఖిలమై నిలచియుండేదాక

—శ్రీ సుందరాచారి.

# నాగేశ్వరరావుగారే ఒక విశాలాంధ్రోద్యమము

(13 వ పేజీ తరువాయి)

## ముగ్గురు మహనీయులు

నాకు తెలిసినంతవరకు ఆధునిక ఆంగ్లవిద్యాపారీణులలో ఆదర్శప్రాయముగ వైదిక ధార్మిక జీవితమును గడపినవారిలో ఎన్నదగిన ప్రముఖులు ముగ్గురే కనుపడుచున్నారు. మదనమోహన మాలవ్యా, బాల గంగాధరతిలక్, కాశీనాథుని నాగేశ్వరరావు గారలు ప్రథమ గణ్యులు. పంతులుగారు ఆంధ్రులవడం దప్ప ఏ విషయములోను తక్కినవారికి తీసిపోరు.

దానగుణము సృష్టివికాసములో చాల పై మెట్టుకు పోయినవారికి గాని లభ్యముగాదు. అహంభావము అనగా వ్యక్తిభావము - అనగా నేను - నాకు అనే భావము స్వభావగుణము - వ్యక్తి వికాసమునకిదే మొదటి మెట్టు.

సృష్టిసూత్రములో చెప్పినట్లు భగవంతునకు సృష్టింపవలయునని సంకల్పము గలిగి నేను నేనే మాదును గాక యని అనుకొనగా ఒక్కటిగనున్న మహత్తత్వము బయలువెడలి దాని నుండి కోట్లకొలది వ్యక్తులుగ అహంకారము పుట్టినది. ఈ అహముతే 84 లక్షల జీవరాసులుగ ధాతు, వృక్ష, జంతు, పక్షి, మానవవర్గములుగనున్నవి. ఇవి క్రమముగ ఒకవర్గమునుండి మరియొకవర్గముగ వికాసము జెందుచున్నవి. వికాసమునకు వ్యక్తిత్వమే మూలాధారము. ఈ అహంకారము బంధమని గాని, నశింపవలయునని గాని కోయుట సమంజసము గాదు. సృష్టిక్రమమునకు వ్యతిరేకము. ఈ అహంకారముతో గూడిన వ్యక్తి అది కావలయునని ఇది కావలయునని కోరుట స్వభావగుణము. ఈ అహము కోరదగినది విశ్వజనీనత్వము. విశ్వమానవప్రేమ, సర్వజ్ఞత్వము, సర్వశక్తిమత్వము లేగాని స్వవాళము గాదు. జీవుడు మానవత్వపు మెట్టున కెక్కినప్పటికి చాల వికాసమును బొందును. అటుతర్వాత స్వలాభమునుండి స్వపుత్ర లాభమునకును, స్వబంధు లాభమునకును, క్రమముగ స్వగ్రామ, స్వరాష్ట్ర స్వదేశలాభమునకును, అటుపై విశ్వమానవలాభమునకును, ఎక్కిపోయి భగవద్గుణాను భవము సంపూర్ణము కాగలదు. కాబట్టి వ్యక్తిలాభమును విడువగలవానికే దానగుణము కలుగగలదు. ఎన్నో మెట్లు ఎక్కిన మానవునికిగాని దానగుణము సాధ్యము గాదు. ఇది ఒక్క పర్యాయము తెచ్చుకొనుటకు సాధ్యము గాదు. వారికి గల ధనసంపాదనేచ్ఛ మానవసేవకొరకు సాధనామాత్రమేగాని స్వలాభ ప్రేరితము గాదు. వకంత నవపతే ప్రత్యావచ్ఛిత అను సూత్రము సామాన్య జను లాదరించుటకు సులభము గాదు. తాము పెట్టకపోగా తమకు లేనిది ఇతరులకున్నదని ఈర్ష్య చెందే వారుకూడా వుంటారు. తాను తన కుటుంబముకూడ పస్తుండి అతిథుల ఆకలిబాధలను పోగొట్టగలవారు సత్తుప్రస్తునివంటివారు అరుదుగ ఉండగలరు. ధర్మరాజు కోట్లకొలది జనులను మృష్టాన్నముచే తృప్తుల జేసిన ఆ త్యాగము సక్తుప్రస్థుడు తాను పస్తుండి అతిథుల కిడిన సంకటితో తులదూగదని భారతము ఘోషించుచున్నది. దానగుణము పంతులుగారిలో సంపూర్ణముగ వికసించి పండి వారికి స్వభావ గుణమయిపోయినది.

ఒక పర్యాయం పంతులుగారు రెంటాల హౌస్‌లో వుండగా బీదల కన్నదానం చేశారు. వాండ్లకు ఏమేమి చేయిస్తే బాగుంటుందని నన్నడిగారు. రాజబంధువులకు పెట్టినట్లు పెట్టండన్నాను. అలాగే పప్పుకూరలు వగైరాల సంగతి అట్లావుండగా 40 సేర్ల పాలుకొని రెండు గంగాళాల క్షీరాన్నం చేయించారు. అరటి ఆకు ఏలకకాయలు ఇతర సంబారాలేకాకుండా అర్ధమణుగు జీడిపప్పు కూడా క్షీరాన్నంలో పోయించారు. బీదజనం చాలామంది వచ్చారు. సగమన్నం తినడం అయినతరువాత ఝూరీలతో పరమాన్నం వడ్డించారు. కొందరు కంచాలలోవున్న అన్నం పారవేసి కంచాలు కంచాలు క్షీరాన్నం తాగారు. అది చూచి పంతులుగారు పడ్డ ఆనంద మింతింత గాదు.

## ముసలమ్మ-మామిడి పండు

ఒక పర్యాయం ఆంధ్రపత్రిక ఆఫీసుకు నే వెళ్ళాను. సాయంత్రం 5 గంటలదాకా వారి దగ్గర కూర్చున్నాను. వారితో కలిసి ఇంటికి వెళ్లవలయునని వారితో కారులో ఎక్కాను. కారు చిన్నగా పందు చివరకు పోయింది. మూల తిరుగుడున ఒక బీద ముసలమ్మ చీలికల గుడ్డలతో కూర్చుని కారు దగ్గరకు రాగానే అయ్యా అని అరిచింది. ఆమెకు అప్పుడప్పు డేదయినా ఇస్తూవుండడం మామూలేట. ఈ ముసలమ్మకు మామిడిపండ్లు కొని పెడదామా అన్నారు నాతో. ముసలమ్మ మామిడిపండ్లు తింటావా అన్నారు. ఇస్తే తినకేమయ్యా, బంగాగంలాగ తింటానన్నది. అయితే గజాలలో మామిడిపండ్ల షాపున్నది. అక్కడ కారు ఆపి షాపు వానిని మంచిపండ్లున్నవా అని అడిగారు. తాజాసరుకు వచ్చింది. పెద్ద రసాలు బంగినపల్లిలు మంచివి వున్నవన్నాడు. రెండూ ఒక అరడజను ఇయ్యమన్నాడు. చాలా ఎక్కువ ప్రియంగానే వున్నవి. పోతులవంటివి ఆరు పండ్లుతెచ్చి కారులోకి అందిచ్చాడు. వానికి డబ్బు పంపాడు. ఇంతలోకి ముసలమ్మ వచ్చింది. ఒకటో, రెండానికి ఒకటో ఇస్తా రనుకున్నా. ముసలమ్మకూడా ఎక్కువ ఇస్తారని అనుకొనివుండదు. కొంగు బట్టింది. అన్నీ కొంగులో బడవేశారు. బరువుకు రెండు జారికూడా క్రిందపడ్డవి. ముసలమ్మ అవి ఏరి కంట్లకద్దుకున్నది. అప్పుడా ముసలమ్మ సంతోషం వర్ణనాతీతం. కారు కదిలింది. ఆ పండ్లన్నీ ముసలమ్మ తినగలదా అన్నాను. దాని కింట్లో మనమలు కూడా వున్నారు. వాండుకూడా తింటారన్నారు ఏరీ - ఈ దాతృ ప్రతిగ్రహీతలకు కుటుంబస్నేహం కూడా వున్నదని వూరుకున్నాను. కారులో కొంతదూరము వెళ్ళాము... వీరి ధర్మములగూర్చి నాకు అదే అలా పనగా వుంది. కొంగసేపటికన్నాను; మీరు చేసే ఈ చిన్నదానాలన్ని లెక్కవేస్తే ఈపాటికి లక్షలవుతవన్నాను. వారు దానికి అదేమోగాని పెద్దదానాలు చేయవద్దని గాదు, లక్షల పెద్దదానాలకంటె ఈ చిన్నవే బీదల కందుతవి. ఎక్కువ బాధా నివారణలు గూడాను. అని వారన్నారు. పెద్ద దానాలయితే స్థిరంగా వుంటవని నే నన్నాను. నాకిదే మనస్సంతోషం. ఎదట ఎంతమందో బాధపడుతుంటే అవి నివారించక దేనికో వేలు లక్షలు ఇయ్యడం నాకంత నచ్చలేదన్నారు. ఈ సంభాషణవల్ల వారి దాన ప్రణాళికయొక్క కీలకం బయటపడ్డది.

అందువల్ల వారు స్థిరమయిన దానాలు చేయలేదని నా అభిప్రాయం గాదు. దేశం మొత్తంలోవున్న గ్రంథాలయాలు పఠనమందిరాలు వారి సహాయం పొందనివి ఉండవు. చాలా వాటికి ప్రారంభోత్సవం వారే జరిపి వుంటారు. పత్రికలు పూరికే పంపి వుంటారు. గ్రంథాలు కొనేందుకు ధన సహాయం చేసివుంటారు. వారి పేర ఇవి చాలావరకు స్థిరంగానే నిలిచి ఉంటవి. ఇల్లాగే కొన్ని విద్యాలయాలు గూడ స్థిరసహాయం పొంది వుంటవి. నే ఎరిగిన ఒక సంస్థను గురించి చెపుతాను. శారదా నికేతనము 1922 లో స్థాపించాము. ప్రారంభోత్సవం పంతులుగారే జరిపారు. దాని కయ్యే మొదటిసంవత్సరపు ఖర్చంతా వారు భరించారు. మొదట ఇప్పటంత ఖర్చు లేదనుకోండి. కాని వేయి రూపాయలకు తక్కువ వుండదు. తరువాత స్వంతభవననిర్మాణం చేసి కావ గోరునంత స్థిరరూప మేర్పడింది. దానికి శంకుస్థాపన పంతులుగారే చేశారు. రెండుగదులు తమ పేర శ్రీమతి రామాయమ్మగారి పేర నిర్మించేందుకు (రు 2000-0-0) రెండువేల రూపాయి లిచ్చారు. షుమారు 20 సంవత్సరాలు; వార్షికవేదికలు రశీదు బుక్కులు, విన్నపములు మొదలయినవన్నీ ఉచితంగా అచ్చువేయించి యిచ్చారు. అంతే కాదు ఏటేట వార్షికచందా లిచ్చారు. అది ఇప్పటికీ జరుగుతున్నది. అవసరాలకు నే నడిగినప్పుడల్లా కొద్దో గొప్పో యిస్తూ వచ్చారు. ఈ సంవత్సరం ప్రారంభంలో శారదానికేతనం క్లిష్టస్థితిలో నుండగా పంతులుగారి బావమరిది రామచంద్రరావు పంతులుగారు అమృతాంజన అదాయమునుండి రు. 5000/- లు అయిదువేల రూపాయిలు ఒక్క పర్యాయమిప్పించి అత్యంత సహాయం చేశారు. శారదానికేతనం కాశీనాథునివారికి అత్యంతము ఋణపడివున్నది.

మరియును రాజకీయ బాధితులకు కాంగ్రెసుసేవకులకు వీరు చేసిన సహాయం ఇంతని - ఈమోస్తరుదని చెప్పడానికి వీలులేదు. వారి కుటుంబాల పోషణ కిచ్చారు. వారి బిడ్డల చదువులకు సహాయం చేశారు. వారిలో దీర్ఘరోగుల మందులకూ పథ్యాలకు అయిన ఖర్చులన్నీ వారే భరించారు.

పెండ్లిండ్లకూ, ఉపనయనాలకు వారుచేసిన సహాయాలకు అంతు వుండదు. పెండిండ్లకేంగాని ఉపనయనాలకు సహాయంచేయడం అవసరమండీ అని ఒక పర్యాయము నాతో అన్నారు. వారికంత నిదానించి మాచాను. వారి అభిప్రాయానికి కారణం అడుగుతున్నానని వారు గ్రహించారు. వడకేడు వచ్చిన పిల్లలు జంధ్యంలేకుండా తిరుగుతుంటే అసహ్యంగా వుంటుంది. సొగసుగా వుండదని నా అభిప్రాయంగాదు. భారతీయునియొక్క ధార్మిక జీవితానికి ఉపనయనం ప్రథమ సోపానమన్నారు. వారు శైవులయ్యును వైదికధర్మమునందెట్టి యభిమానమున్నదో దీనివలన స్పష్టపడకమానదు.

ఇంకొక్క విషయంమాత్రం నిలిచివుంది. అది స్పృశించక విడువతగదు. సందేహం చాలామందికి వుండవచ్చు. కొందరికి పూర్తిగా సందేహనివృత్తి కాకపోవచ్చు. అప్పడభిప్రాయమును కోవాలె. గాంధిమహాత్ముడుగూడ నెల్లూరులో గాబోలు ఈ విషయం కొంత హేళనగాను ఆక్షేపణగాను పంతులుగారితోనే అన్నారట. పంతులుగారు గాంధిగారికి జవాబు చెప్పక ఊరుకున్నారు. నేనప్పుడక్కడ లేను. తరువాత మద్రాసులో పంతులుగారు ఆవిషయం నాతో ప్రస్తావించి మీ అభిప్రాయమేమిటన్నారు. ఎవరభిప్రాయమేదయినా మీరప్పుడు ఏ సందర్భములోనయినా మార్చవలదన్నాను. మార్చుకోమని మీరంటారా అన్నారు. ఏ సందర్భములోను మార్చుకోమని నేననను. నేను మార్చుకోమన్నా మీరు మార్చుకోవద్దని నేనన్నాను. అయితే మీ యభిప్రాయమేమిటని పంతులుగారన్నారు. నా యభిప్రాయమెందుకని నేనంటే నా మనస్సృష్టికని వారన్నారు. అయితే వినండి ఒక కథ చెపుతానని నిజముగా జరిగిన క్రిందికథను చెప్పాను.

1918 లో నేను కొందరు ఆంధ్రయువకులు కొందరు సాంధ్రులు బారిస్టరు పరీక్షకు ఇంగ్లండుపోయి డబ్లినులో కింగ్స్‌ఇన్సులో చేరదలచాము. బారిస్టరుకోర్సుకు చదువులేకాక సహభోజనాలుకూడ అవసరమే. మనకు పంక్తిభోజనమెటువంటిదో వారికి ఒక టేబులుమీద భోజనము అటువంటిది దర్జా తక్కువవారితో ఒక టేబిలుమీద కలిసి అక్కడ భోజనము చేయరు. కనుక ప్రతిబారిస్టరు విద్యార్థి దర్జా సర్టిఫికటు దాఖలు చెయ్యాలె. ఆ నియమమిప్పుడంతగా పాటింపబడకున్నను దర్జా సర్టిఫికటుమాత్రము అందరు దాఖలు చేయవలసిందే. మాలో చాలామందిమి అవి తీసుకపోలేదు. అక్కడ మమ్మెరిగి సర్టిఫికట్లు ఇయ్యగలవారెవరూ లేరు. ఎవరయినా ఇస్తే అబద్ధపు సర్టిఫికట్లియ్యవలసిందే. అందరిలో నాలావుండికంటె నేను కొందము పెద్దవాడిని. హాట్ పెట్టుకోకుండా పట్టు తిలకుద్ధమాత్రమే ధరించే వాడిని. అందువల్ల నాకదో జమీందారీ పాయ వున్నదనుకొనేవారు. కొదవన్న వసేర్మవారుగారు. రిజస్ట్రారు వీరందరినీ మీరెరుగుదురా అని నన్నడిగారు. ఎరుగుదును అన్నాను. వీరు దర్జాగలవారని మీరు సర్టిఫికెట్టు ఇస్తారా అన్నారు. అవో ఇస్తానన్నారు. చాలు. వీరందరిని ఇక ఏ ఇతర సర్టిఫికెట్లు లేకుండా చేర్చుకుంటానన్నారు. వారు నమ్మటానికి మరొక హేతువుకూడ చెప్పారు. ఇండియాలో కలెక్టరు పనిచేసి వెళ్లిన ఆయన అంగ్లమిత్రుడొకడు అన్ని నొప్పులకు మందు అని ప్రకటింపబడిన నాలుగు అమృతాంజనం బుడ్లు చాల చాకగా తెచ్చి పెట్టాడట. అవి నొప్పుల మీద అద్భుతంగా పనిజేసినవట. బూటకాలని చెప్పుకునేమందు ప్రకటనలో అంత సత్యంగావుంటే మీరు సత్యవాదులే అయివుండాలెనన్నారు. ఈ కథయొక్క సారాంశం ఇండియనులమంతా సత్యవాదులం కాకపోయినా అమృతాంజనం అన్ని నొప్పులమీద పనిచేస్తుందనేమాట సత్యమని.

## 'ఆంధ్రపత్రిక' ద్వారా రాష్ట్రానికి చేసినసేవ

ఆంధ్రపత్రికవల్ల పంతులుగారు ఆంధ్రదేశమునకు చేసినమేలు వర్ణనాతీతము. మాసపత్రికలు, వారపత్రికలు, దినపత్రికలు, విజ్ఞాన సర్వస్వాలు— ఒకటేమిటి, పవాలకు ప్రచురణలు. ఆంధ్రపత్రిక ముద్రణాలయము ఆంధ్రదేశాన్ని విజ్ఞానంలో ముంచియెత్తింది. ఇదంతా అమృతాంజన ప్రభావమే. ఒకటేమిటికి నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రదేశానికి చేయని మేలున్నదా. అన్ని మేలులూ చేశారు. అందరికీ చేశారు. అందుకనే విశ్వదాత అనే బిరుదు వారికెంతయు తగియున్నది.

పంతులవారి జీవితమును సంగ్రహముగ చెప్పమున్నచో వారు కృష్ణానదీప్రాంతమున ఉత్తమ శైవబ్రాహ్మణ వంశములో జన్మించారు. శైశవములో బి. ఎ. వరకు ఆంగ్ల విద్యాభ్యాసం చేశారు. తెనుగులో పాండిత్యము గడించారు. తగుపాటి సంస్కృతభాషాజ్ఞానము సంపాదించారు. యౌవనములో గృహస్థ ధర్మ మవలంబించి లోంపులేని సంసారసుఖ మనుభవించి వ్యాపారవృత్తిలో ప్రవేశించి లక్షలాది ద్రవ్యము గడించి తామింత తిని ఎముకలేని చేతితో ఒకరికి పుష్కలంగా పెట్టి విశ్వదాత యనిపించుకున్నారు. సర్వత్యాగము చేసి తమ జీవితమును దేశసేవ కర్పించుకున్నారు. తరువాత మననశీలురైనారు. గీతామననంచేసి ఆంధ్ర భాషలో గీతాభాష్యం వ్రాశారు. యోగపరులయినారు. ధ్యానయోగంలో శివసాయుజ్యమును పొందారు. సర్వవిధముల ధన్యులైనారు. ఆదర్శప్రాయుడైన భారతీయుడని అనిపించుకున్నారు. శ్రీకాళిదాస మహాకవి ఈ క్రింది శ్లోకములో పొందుపరచిన ఆర్యసంప్రదాయమునకు లక్ష్యమైనారు.

"శైశవేభ్యస్త విద్యానాం
యౌవనే విషయైషిణాం
వార్ధకే మునివృత్తీనాం
యోగేనాంతే తనుత్యజాం"—
ఇక కావలసిన దేమున్నది?

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ

# అతిప్రాచీన గ్రామ్య కళ

# "తోలు బొమ్మలు"

—రచన: శ్రీ తాండవకృష్ణ

ఆంధ్రులే లేకపోతే భారతీయ నాగరికత జగత్ప్రసిద్ధమయ్యేదా? భారతీయసంస్కృతి ఖండ ఖండాంతరాలకూ వ్యాపించేదా? అన్న ప్రశ్నలు కలుగుతున్నవి మన ప్రాచీన చరిత్రనుపరిశోధిస్తూవుంటే. భారతదేశాన్ని గుడిగోపుర, శిల్ప సంపదల మహాద్భుత సీమగా, ప్రపంచ విఖ్యాతికి తేగలిగిం ప్రతిష్ఠ, గౌరవం ఆంధ్ర రాజులకు దక్కిందన్నారు క్రీటి యన్ రామచంద్రన్. ఈవిధంగా ఇతర దేశాల వ్యాపించిన కళలలో ఈ "తోలు బొమ్మల ఆట" ఒకటి. శ్రీ తాండవకృష్ణగారి వ్యాసంలో ఈ కళ చరిత్రను వివరించారు.

నవీనాంధ్ర చరిత్రలో స్మరణీయమైన ఈ రోజు మన పూర్వచరిత్రను, కళా సంప్రదాయాలను స్మరించి పురోభివృద్ధికి కావలసిన సూచనలను చేసికొనుట మనకత్యవసరం.

మన ప్రాచీనకళా సంప్రదాయాల్లో నేటికినీ తెలుగుదేశంలో సజీవంగా ఉన్నవి రెండు: కూచిపూడి వారి నాట్య నాటకములు రెండవది తోలు బొమ్మలాట. రెండును ప్రజాహృదయాన్ని చూరగొన్నవే. ప్రజాహృదయాన్ని చూరగొన్నవే కాలాతీతంగా సజీవంగా చైతన్యంతో ఉంటూ ఉండటానికి నిదర్శనం వేరే అక్కరలేదు.

## అతి ప్రాచీన కళ

తెలుగు దేశంలో ఇతర గ్రామ్య కళలవలె 'తోలుబొమ్మలాట' కూడ అతి ప్రాచీనమైనదే. ఆంధ్రదేశమును సుభిక్షముగ నేలిన ఆంధ్ర రాజవంశాలలో శాతవాహనులు మొదటి వారు. యుగకర్తలు. వీరు క్రీస్తు పూర్వం మూడవ శతాబ్దిలో ఆంధ్రదేశ పాలన చేసినటుల చరిత్ర చెప్తుంది. వీరి కాలంనాటికే ఆంధ్రదేశంలో తోలు బొమ్మలాటలు, వీధి నాటకాలు, నాట్యాలు ప్రసిద్ధి చెందినటుల కనిపిస్తుంది. హాలుడు రచించిన 'గాథా సప్తశతి'లో నాట్యసంగీత, వినోదాల ప్రసక్తి మెండుగా కనిపిస్తుంది. ఇవన్నీ శిల్పాలలో ధంగిములవల్ల, వాద్య విశేషాలవల్ల, దృశ్యాలవల్ల మనం నేటికీ గ్రహించవచ్చు. అమరావతి శిల్పము, నాగార్జున, గోలీశిల్పాల శేషాలవల్ల కళా చరిత్ర మనకు మెరుపురూపంతో దృగ్గోచరమవుతుంది.

తోలుబొమ్మలాట విశేషంగా వీధి నాటకాల లాగ వీధిలోనే రంగస్థల నిర్మితమై "చీరమఱుగు"న ప్రచలితమై యుండిన పామర జనరంజకమై ఆంధ్రదేశంలో కలుమూలలా ప్రాకి కృష్ణా గోదావరి ప్రాంతాలనుండి మలబారుకు తలసబోయిన ఇప్పటి మలబారీయులకు కూడ అవగతమయింది. మలబారులో కూడ ఇప్పటికీ ఈకళ బాగా సజీవంగా ఉంది. భావాలలో, భాషాల్లో, సౌజన్యంలోనవలెనే నాట్యకళలోనూ, తోలుబొమ్మలాటలోనూ కూడా తెలుగులకు, మలబారు దేశస్థులకూ చాలా సామ్యం కనబడుతూ ఉంటుంది.

## రాజాదరణ

శాతవాహనుల తరువాత పల్లవులు, చాళుక్యులు, కాకతీయులు, విజయనగరాధిపతులు, తంజావూరురాజులు ఈ నాటకకళను పోషించిరని చెప్పవచ్చును. దేశంలో అవిచ్ఛిన్నంగా నేటికి పామరజనరంజకంగా నిలిచి ఉన్నదీకళ.

18వ శతాబ్దిలో పండితారాధ్య చరిత్రకారుడైన పాల్కురికి సోమనాధుడు,

"ప్రథమరులు జానిముల్ బయునముల్ మెలని రమణ బంచాంగ పేరణి యాడువారు ప్రకట పురాతన పటుచరిత్రములు క్రమమొంద బహునాటకములాడువారు లలితాంగ రసకళా లంకార రేఖ లలవడ బహురూప మాడెడువారు అమరాంగ వలు దిధి వాడెడు మాడ్కి సమరంగ గడలపై వాడెడువారు అరియద్గతి యతులాడెడు నట్టె భావన ప్రమోదులపై వాడువారు భారతాదికథల చీరమఱుగు నారంగ బొమ్మల నాడించువారు కడు నద్భుతంబుగ గంధమాత్రంబు అదరంగ బొమ్మల నాడించువారు నారట గంధర్వ యక్ష విద్యాధరాదులై పాత్రల నాడించువారు"

పర్వతప్రకరణంలో తోలుబొమ్మలాటను కళ్లకు కట్టినట్లు వర్ణించినాడు. బొమ్మరికలు, తోలుబొమ్మలాటలు, వీధిభాగవతాలు, చిరకాలం నుండీ మన దేశంలో ఉన్నవనటానికి ఈ పై రచనే తార్కాణం.

"... చీరమఱుగు నారంగ బొమ్మ లాడించువారు" కడు నద్భుతంబుగ గంధి మాత్రంబు అదరంగ బొమ్మల నాడించువారు నారట గంధర్వ యక్ష విద్యాధ రాదులై పాత్రల నాడించువారు"

## నిర్వాహకుల అసమాన సామర్థ్యం

ఎంత అద్భుతంగా వర్ణించాడో చూడండి. తోలు బొమ్మలాట చాలా మంది అనుకొన్నంత తేలికగా త్రోసి వేయ తలసినది కాదు. బొమ్మల్ని తెర మీద ఆడించటానికి ఎంతో నేర్పరితనం కావాలి, నైపుణ్యం అలవడాలి. అదీ అభ్యస్త విద్య. "గంధర్వ, యక్ష, విద్యాధరాదులై" ఆడించువారు—ఆయా పాత్రల తోటి వైకేరతుండర ఉచ్ఛైస్వరాలతో ఆలాపన చేయుచు, సంవాదములు, సంభాషణలు నడుపుచు కథా తోరణాన్ని అల్లుచు, హాస్యము చెప్పుచు, జనరంజకంగా, ఆయారసం ఉట్టిపడుతున్నట్లు, భావావేశం కలిగించేట్లు, చమత్కృతితో చతురంగా, కథా సంవిధానం అతుకుచు, అలుచు, తోలుబొమ్మలాటను నడుపువాడు కడు సమర్థుడై, కొన్ని సంవత్సరాలు విద్య నభ్యసించినవాడై ఉండాలి.

## నిర్వహణ విధానం

తోలుబొమ్మలాటకు ప్రధానమైనవి తెర, దీపము, మృదంగము, తాళములు, తోలు బొమ్మలు.

సాధారణంగా పురాణ ప్రసిద్ధములైన రామాయణ, భారత, గంధస్థ విషయ కథలనే ఇతి వృత్తాలుగా తోలుబొమ్మలాట ప్రదర్శిస్తారు. ఈ ప్రదర్శకులు ఆరేళ్ళపులవానికి చెందినవారు. బర్రె, మేక, గొర్రె, జింక చర్మము పదును చేసి ఆయా పాత్రలకు అనువైన రూపురేఖలతో బొమ్మలను కత్తిరించి వానికి రంగులు వేయుదురు. ఆభరణాదులను బంగారు మయము చేయుదురు. ఆయా పాత్రల స్వభావాన్ని బట్టి సత్వరజస్తమోగుణ ప్రాధాన్యాన్ని బట్టి, ధరోదాత్తాది నాయకాది విధాన్ని బట్టి నీలము, ఆకుపచ్చ, ఎరుపు, నలుపు రంగులను ముఖములకు దిద్దుతారు.

తెరమీద ఈ బొమ్మలు వెనుక దీపం వెలుగునలన ఛాయలవలె కనపడతాయి కాబట్టి "ఛాయాక్రీడ" అని పిల్వలు నవ్యనాటకాలన్ని అట్టలలో పాత్రల్ని తయారుచేసి ప్రదర్శిస్తున్నారు. ఆయా పాత్రలఆకారాల్ని తోలుతో తయారుచేసి ప్రదర్శించేవారు కాబట్టి "తోలు బొమ్మలాట" అని వ్యాప్యలనేవారు.

స్త్రీ పురుష పాత్రల రూపాల్ని తెర మీదకి ఎక్కించేప్పుడు పాత్ర ప్రవేశించినట్లు, నీడలోకి తీసేటప్పుడు అంతర్ధానమైనట్లు చేయుట వీరి ప్రత్యేక నైపుణ్యాన్ని చాటుతుంది. ప్రతిబొమ్మకు శరీరనికి ప్రధానంగా వెదురు బద్ద కట్టబడి ఉంటుంది. కాళ్లు, చేతులు మెడ కదల్పుటకు వీలుగా దారాలతో కట్టబడి ఉంటుంది. తెరమీద బొమ్మ నిలబడటానికి ముళ్ళముళ్లతో గుచ్చుతారు. మానవుల బొమ్మలనే కాక జంతువుల బొమ్మల్ని కూడ తెరమీద ప్రవేశపెడతారు.

బొమ్మలతో నాట్యం చేయిస్తారు. యుద్ధం చేయిస్తారు, గంతులు వేయిస్తారు. ముగ్గులు వేయిస్తారు. ఎంతో సహజంగానూ, రసావేశంగా త్రివిక్రమక చేసేట్లు ఉంటుంది. ఈ త్రిపాత్రలు హస్తము, శిరస్సు కదల్పుట తప్ప తక్కినఅంగాలు కదల్పవు. మధ్యమ పాత్రలు, నీచపాత్రలచే మాత్రం సర్వాంగాభినయం చేయిస్తారు. సాధారణంగా పేటలోజాల్లో లంకాదహనము, భారతయుద్ధము, ఉత్తరగోగ్రహణము, రామరావణయుద్ధము, మైరావణ యుద్ధము, మనవారు "తోలుబొమ్మలాట" అడుతున్నారు. రామనాటకము, సీతాపహరణము మొదలైనవి కూడ కొందరు ప్రదర్శిస్తారు.

## ప్రచారం

ఈమేళములవారు ఊరూరా తిరుగుతూ చాలచక్కనదృతికే ఈప్రదర్శనాలిస్తుంటారు. రాత్రి పదిగంటలకు మొదలుపెట్టి తెల్లవార్లు వీధి నాటకాలవలె ఆరుబయట ఆడుతారు. ఒకే గ్రామంలో అనేక బజార్లలోకూడ ప్రదర్శిస్తుంటారు. పండితులు, నవనాగరికులమనుకునేవారు పేట రోజాల్లో యీ ప్రదర్శనల్ని ఆదరించటంలేదు. అనేక ఇతర జాతీయ కళలవలెనే ఈ కళా సంప్రదాయంకూడా మాయమవటానికి అవకాశం లేకపోలేదు.

వివాహాలలోను, దేవుని పెళ్లిళ్ళలోనూ, వీధి చావళ్లలోను, ప్రత్యేక సమావేశాలలోనూ నేర్పరులైనవారిచే ప్రదర్శింపజేసి మరల ఈ కళయందు ప్రజల కౌసక్తి యొక్కువవునటుల చేయాలి. జాతీయ ప్రభుత్వంకూడ తగు ప్రోత్సాహమిచ్చి, దేవుని కళ్యాణమహోత్సవాలలో ఎండోవుమెంటుబోర్డువారు ప్రతి ట్రస్టీ ఇవి ఏర్పాటు చేయునట్లు చిర్దయిస్తే తగు ప్రోత్సాహం కొంతవరకైనా లభించే అవకాశం లేకపోలేదు.

## నూత్న ప్రభుత్వ కర్తవ్యం

ఈ ప్రదర్శకులు అనాగరికులు, చదువు సేర్వనివారైనను, వారిలో స్త్రీలగాత్రములు అతిమధురంగానుండి సుశ్రూరము స్పష్టంగా వినబడి అనేకులకు వినోదాన్ని కలగజేస్తాయి. సరియైన ప్రోత్సాహము, అవకాశం కలగజేస్తే ఈ కళకు అత్యున్నతమైనస్థానం లభిస్తుంది.

ఈ కళ యితర దేశాల్లో "మిక్కీమౌస్" చిత్రాలను తయారు చెయ్యటానికి అవకాశం కల్పించింది. నేటి కళా సంప్రదాయాల పునరుద్దరణలో తగిన స్థానము ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వం దీనికి కల్పిస్తుందని ఆశించుదాము.

—

ఉదయగిరీ మందేరా,
సింహపురీ మందేరా
కానీ ఎవ్వరు వాదుకవస్తే
కాంచీపురమూ మందేరా
　　　　　　　　　త్రిపురనేని.

—రచన—
నటరాజ
రామకృష్ణ బి. ఏ.

...నాడు రాయల దర్బారులో రక్షా క్షేత్రపై చిరు మువ్వల ధ్వనింప జేస్తూ సుందరతర భంగిమల్లో మూర్తీభవించిన కూచిపూడి నృత్యకళ, నేడు.

కూచిపూడి నృత్యం వీధి భాగవతము అందు రసభావములు తక్కువ.

ఇట్టి అపోహాలకు లోనై, నృత్యము కూచిపూడి నృత్యమే యైననూ, నేర్పు నరకులు కూచిపూడి నాట్యాచార్యులైనను ప్రదర్శనము లిచ్చునప్పుడు విజయవాడ నృత్య మనియు, తంజావూరు నృత్యమనియు దినదినం పేర్లతో పత్రికలలో ప్రకటించు సంతటపోవనీయు స్థితి ఈ నృత్య కళకు కలుగుటకు కారణాలు తెలుసుకుంటే, నేటి దేశకాల పరిస్థితులకు అనుగుణ్యమైన, ఆంధ్రులయొక్క జీవితాన్ని ప్రతిబింబించే నృత్య కళను సృష్టించి ప్రచారములోనికి తేగలుగుతాము.

ఆంధ్రదేశంలో తెలుగు దనం ప్రతిబింబించే నృత్యాన్ని ప్రచారములోనికి తీసుకు రావడానికి ప్రయత్నించే ముందు మన తెలుగు దేశపు నృత్య పద్ధతులు, నాట్యాచార్యులు వారు నేర్పే నృత్య రీతులు, పూర్వపు నృత్య సాహిత్య సంపద, నేటి గేయ కవిత సంపాదించి, సమన్వయ పరచి మన నృత్య కళకు ఒక స్వరూపమివ్వాలి.

కూచిపూడి నృత్యాన్ని ఏనాడో విస్మరించిన మనకు అన్య ప్రాంతీయులవలె ఒక సంప్రదాయమైన నృత్యం లేకపోవుటచే, నాట్యాచార్యులు ఎవరికి తోచినట్లు వారు నృత్యం నేర్పుటచే, ఒకే పద్ధతికి చెందిన నృత్యకళ పెంపొందలేదు. కావున ఆంధ్ర దేశములోగల నాట్యాచార్యులందరూ ఒకచోట సమావేశమై ఒక నృత్య పద్ధతి, నేర్పరచి ఆ క్రమము ననుసరించి శిక్షణ యిచ్చిన యెడల పాటి వారిలో ఆంధ్రులు నృత్యకళలో శాస్త్రీయ దృక్పథం గలవారని తెంచుకొనగలము.

ఏ దేశంలోనైనా సాధారణంగా నాల్గువిధములుగా నృత్యం ప్రచారములో వుంటుంది.

(1) ఆరాధన నృత్యం, (2) శాస్త్రీయ నృత్యం, (3) ప్రచార నృత్యం, (4) జానపద నృత్యం

వీరభద్రుని సంబరాలలో జేసే వీర నాట్యము, సేవ, కథకళిలోని సేవకళి దేవాలయాల్లో దేవదాసీనృత్యం, మణిపురి రాసలీలా, లయహరోబా మొదలైనవన్నీ ఆరాధన నృత్యాలకి చెందుతాయి. భరతశాస్త్రాన్ని ప్రమాణంగా తీసుకొని శాస్త్రప్రాయంగా భంగిమలు ముద్రలు కల్గి, రసభావములుగలది శాస్త్రీయనృత్యము, పదాభినయం, జతిస్వరనృత్తము, తరంగ నృత్యము మొదలగునవి. రామాయణ, భారత భాగవతాదుల నాటికలుగా, వీధిభాగవతాలుగా ప్రజల్లో ప్రచారం చేసే నృత్యమే ప్రచార నృత్యము. జక్కుల భాగవతులు, గొల్లభాగవతులు, తోలు బొమ్మలాటలు, బొమ్మలాటలు మొదలైనవి. కుమ్మి, కోలాటము, గొబ్బి కోతిలనృత్యము మొదలైనవన్నీ జానపద నృత్యాలు. ఇవిగాక ఆటవిక నృత్యాలు లెక్కకు మిక్కిలి యున్నవి.

మన కూచిపూడి నృత్యకళలో ప్రచారనృత్య కళ (ఉషాపరిణయం, ప్రహ్లాద, కుశలాయకం మొదలైన భాగవతాలు) గాక, శాస్త్రీయ నృత్యాన్ని (పదములు, వర్ణముల అభినయం, తరంగముల నృత్యము, జతులనృత్తము) కూడా వృద్ధిపొందించారు కనుక మన కూచిపూడి సంప్రదాయాన్ని మూలంగా తీసుకొని నేటి కాలానుగుణ్యంగా మన నృత్యకళను పెంపొందించాలి. తంజావూరు నృత్యకళకు కూచిపూడి నృత్యము మాతృక అని

కళారాధకుల అశ్రద్ధ వలన మహారాజుల అంతఃపురాల్లో చేరిగిన ఆ నృత్యకళకు - నృత నృత్త అభినయాలను చక్కగా పోషిస్తూ ప్రదర్శనయోగ్యమైన నృత్యక్రమాన్ని వడివేలు పిళ్ళె, మొదలయిన నాట్యాచార్యులేర్పరిచారు. అందుచే తంజావూరు నృత్య సాహిత్యమంతా తెనుగుభాషలో వున్ననూ అది ఆంధ్రుల యొక్క కళా సాంప్రదాయంగా చెప్పుకొనలేము.

మన ఆంధ్రదేశంలో ఒక నృత్య సంప్రదాయం ప్రచారంలోనికి తీసుకొని రావడానికి మార్గం ఆలోచించాలి.

ప్రప్రథమంగా ఆంధ్రదేశంలోని వివిధ పట్టణాలలో వున్న నాట్యాచార్యులు, నృత్య కేంద్రాలు వారు చేసే నృత్య విధానాలను గురించి కొంత చర్చిద్దాము.

ఆంధ్రదేశంలోని కొన్ని ముఖ్యమైన పట్టణాలు నెల్లూరు, ఒంగోలు, బాపట, తెనాలి, గుంటూరు, విజయవాడ, హైదాబాదు, ఏలూరు, రాజమహేంద్రవరం, విశాఖపట్నం, విజయనగరం.

ఇందు విజయవాడ, రాజమహేంద్రవరములలో భరతనాట్యం, కూచిపూడి, కథకళి నృత్యాలలో శిక్షణ యివ్వబడుతుంది. హైదాబాదులో, భరతనాట్యం, కథక్, కథకళి, మణిపురి నృత్యాలు ప్రచారంలో వున్నవి. నెల్లూరులో భరతనాట్యం, కూచిపూడి నృత్యాలు నేర్పుతున్నారు. మిగిలిన పట్టణాల్లో భరతశాస్త్రాన్ననుసరించి అభివృద్ధి చెందిన నృత్యకళ విరివిగా ప్రచారంలో వుంది. భరతనాట్యము కూచిపూడి, కథక్ మొదలైన నృత్యాలన్నింటికి ప్రామాణిక గ్రంథం 'భరతశాస్త్ర'మే అయిననూ ఆయా ప్రాంతీయ ప్రజా భిరుచుల ననుసరించి నాట్యశాస్త్రజ్ఞులు వారి వారి నృత్య పద్ధతులకు ఒక ప్రత్యేక స్వరూప మేర్పరిచారు. కనుకనే ఆంధ్రదేశంలో గూడా భరతశాస్త్ర ప్రామాణికమైన నృత్యాన్నే నాట్యాచార్యులందరూ నేర్పుతున్ననూ ఒకే పద్ధతి నృత్యం మనదేశంలో పెంపొందలేదు. అందుచేత కళోద్ధీపనకైన పద్ధతులు, ముందు చేయవలసిందేమనగా, తెనుగు దేశంలోని నాట్యాచార్యులందరినీ ఒకచోట సమావేశపరచి, వారియొక్క అభిప్రాయములన్నియు స్వీకరించి, అందరియొక్క ఆమోదమును పొందిన శాస్త్రీయ నృత్య క్రమము నొకదానిని ఏర్పరచి ఆ పద్ధతిని ఆంధ్రదేశంలో ప్రచారం చేయుటకు, పెంపొందించుటకు, తగిన ప్రోత్సాహమివ్వాలి.

ఇక రెండవది—అతి ప్రాచీనమయిన నృత్యరీతులు కొంతవరకు అంతర్ధానము పొందినా, కాళహస్తి, నగరి, వెంకటగిరి, విజయనగరం, మాడుగుల, బొబ్బిలి, పిఠాపురం, పెద్దాపురం మొదలైన సంస్థానములలోనూ, ముఖలింగం, చెయ్యూరు, జొన్నవాడ, మాచెర్ల, మండపేట మొదలగుచోట్లలో వున్న వృద్ధ దేవదాసీలవద్ద కొంతవరకు మిగిలివుంది. కొందరు నాట్యాచార్యులు, ఆ ప్రాంతాలకు వెళ్లి వారివద్ద మిగిలివున్న నృత్య సాహిత్యాన్నంతా స్వీకరించి, వారి నృత్యరీతులలోవున్న విశిష్టతను గ్రహించాలి. గ్రహించి మన నృత్యకళను పెంపొందించాలి, మన ఆంధ్రప్రభుత్వం ఒక

(23-వ పేజీ చూడుడు)

# నేటి ప్రసిద్ధాంధ్రకవులు

(17 వ పేజీ తరువాయి)

రసమందరములైన కావ్యములను వీరు అవిష్కరించిరి వీరి జాతీయ గేయములు గురజాడ గేయములవలె కర్తవ్య నిరూపణాత్మకమైనవి కాక, ప్రబోధ మహితములైనవి 'తమ్ముడా! ఏదేశి మేగినా ఎందు కాలిడిన' వంటి రచనలు సార్వజనీనములైనవి. సుబ్బారావు గారి శైలినుండి మెత్తని కయ్యగలిగి భాషావధూటికి పూలపాన్పును సంతరించినది ఆధునిక కవిత్వమునందు అస్పష్ట మధురమైన భాగము తరుచు కన్పించును. ఇవి పూర్వకావ్యములందలి గ్రంథగ్రంథులవంటివి నూతన కవిత్వ సంకేతములును, లాక్షణిక నియమోల్లంఘనమును అయోమయమునకు కారణములు కావచ్చును ఇది వ్యంగ్య విలసనమని సుబ్బరాయకవి ప్రభృతులు భావింతురు కాని లోకమునకు ప్రత్యయము కలుగలేదు రాయప్రోలు కవి ఇటవల ఆధునిక కవిత్వమునకు భావ్యక ర్తృభారమును స్వీకరించెను. 'రమ్యాలోకము, మాధురీ దర్శనము' వారి తాత్త్విక చింతనలకు పేటికలు

## స్వామీ శివశంకరులు

సాహితీ సమితి సభాపతి, ఇప్పుడు తురీయాశ్రమాధిష్ఠితులు స్వామి శివశంకరులు కవులను గన్న కవి కమనీయ చీనాంశుకముల పోశలావేషము నుండి కాషాయాంబరముల నిస్సంగత్వమువరకు వీరి జీవితమునందున్ని రు ములుగలవో కవిత్వమునందన్ని యింద్ర ధనూరోచిస్సులు కలవని చెప్పుదురు శివశంకరుల కవిత్వ మొక అచ్ఛోద సరస్సు దాని నీటియందు గున కొండలు గుటలు లేవు అందు దుర్మార్గ వక్రములును లేవు అంతయు ప్రసన్న మధురము. మానవజీవితములోని భయంకరమైన తుఫానులను సందర్శింప దలచినచో ఇక్కడ కాక మరియొకచోట పడవ యెక్కవలెను పూర్వాశ్రమమునందు వీరు చేసిన రచనలు లెక్కకు మిక్కిలిగా నున్నవి. 'హృదయేశ్వరి' 'వకుళమాలిక,' 'వ్రతభంగము' ఇట్లసంఖ్యాకములైన మనోహర రచనములందు వస్తువు మాత్ర ప్రాయముగ నొక్కచో యువయువతుల ప్రణయ శారదరాత్రులలో సహృదయుడు తన్ను తాను మరచును. ఆసన్న హేమంత చ్ఛాయలు తాత్కాలిక ప్రణయభంగరూపమున, నెదురొక్కనుచుండును 'శిశిరము ఘనీభవింపవచ్చును గాని వసంతము దిసంతులు కొట్టుచు రాకమానదు శాస్త్రి గారి కవిత్వపు తూణీరమునందు మృదుహాస్యమను పుష్పబాణము కలదు జీవిత వ్రణములను మాన్పు అమృత రసాయనము హాస్యము ప్రణయభంగమునకు హేతువులనరయుచు వీ రొకచో నిట్లు వ్రాసిరి.

> "కారణమ్ములలోన మన భావ్రీయత్వము ప్రబలమైనది
> మర్కటమ్ముల తుండదిగినది
> మానవుల కేలో" సాధకుడు,

జీవితపరమార్థ మానంద మేయనియు, తత్సాధనకు సహధర్మచారిణి, కరణమనియు వీరి సందేశముగా తోచును.

> 'నీ వెంత కాదన్న నిశ్శ్రేయసమ్ము
> స్త్రీ నుపాసింపక సిద్ధింపదోయి'

## "పింగళి - కాటూరి"

త్రోటికి 'సౌందరనందము' 'పోలస్త్య హృదయము' మొదలగు అమృతాయమానమైన రచనలను చేసిన జంటకవులు శ్రీ పింగళి లక్ష్మీకాంతము - కాటూరి వెంకటేశ్వరరావు గారలు. ఈ కవిద్వయము తమ గురువులైన తిరుపతి వెంకటేశ్వరుల వలె అభేద్యరచనాసిద్ధిని గనిరి రమ్యార్థమునకు రమణీయశబ్దముతో దాంపత్యము కూర్చుటయందు వీరు అధికసాధన చేసి కృతకృత్యులైరి. అందును కాటూరి వారు అప్రసతిని - శబ్దమునందుగాని అర్థమునందుగాని-సహింపలేని సౌందర్యనిష్ఠితులు పౌలస్త్య హృదయము వైరభక్తికి పరమోదాహరణము. సౌందరనంద శిల్పము నవ్యకవిత్వములో మేలిమి కుందనపు పనితనమని భావింపబడుచున్నది భగవానుడగు గౌతమబుద్ధుని దివ్యసందేశమును ఆంధ్రభారతికి సమర్పించిన కవిపుంగవులు, శ్రీ తిరుపతి వెంకటేశ్వరులు, పింగళి - కాటూరి, సన్నిధానము వారును. వీరు ధన్యులు సౌందరనంద కవులు చేమకూర వెంకటకవి పాకమును తనివార స్వదించిరి చేమకూర కవితలో సెలయేటిమీది తెలదేటిపుల కలరుతములు మెండు. హిమభూధర శృంగాగ్ర సుహాసుప్తోత్థకేసరి గర్జా స్ఫూర్జధ్వనులు అరుదు ఈ కవులు జీవిత మధువును విస్తారముగ పంచిపెట్టిరి కాని జీవితములో హాలాహలముకూడ సమవిభక్తముగ నున్నదనుట లోకానుభవము

## "యెంకి పాటల నండూరి"

'యెంకి' యను ప్రాకృత నాయికను సృష్టించి, యెంకి పాటలలోని ధూపరీమళము గల శైలిని కల్పించి, నవ్యసాహిత్యమునందొక ప్రమాదము లేని దుమారమును లేపిన నిండు కవి నండూరి సుబ్బారావుగారు వీరు తమ కక్షిదారుల వాదములతోపాటు జానపదజీవితమునకు వకాలతునామ పుచ్చుకొన్నవారు యెంకిపాటలు ప్రాకృత ప్రేమ యాకృతిలో నున్నవి పట్టు పంచెలు కట్టుకొని చదువుకొన దగినంత పారిశుద్ధ్యము కలిగి యున్నవి 'దూరాన నారాజు కేరాయి కాడో'

గాయక సార్వభౌమ పారుపల్లి రామకృష్ణయ్యగారు

కూచిపూడి నాట్యకళానిధి శ్రీ వేదాంతం లక్ష్మీనారాయణ

'గోవుమాలచ్చిమికి కోటి దణ్ణాలు' 'ఆడనీ కుక్కని యీడ నే గడియేసి-పడవెక్కి బద్రాద్రి పోదామా' వంటి చావు నోవులులేని పదములు కలకాలముండు రచనలు. లక్షణ గ్రంథములందలి స్వాధీనపతికా శృంగారమునకు యెంకి యెంతిమాత్రము జంకదు. పామరప్రయుక్తభాషలో గారడి చేసి సుబ్బారావుగారు, పాప మెందరో గ్రాంధికవాద సహృదయులకు రజ్జు సర్పభ్రాంతి కలిగించి అదురుకొను నట్లు చేసిరి. ఇది కనికట్టుమాత్రమని వారును గ్రహించి తమలో తాము ముసిముసి నవ్వులు నవ్వుకొనుచున్నారు 'తెలుగు తల్లియొక్క నిజ స్వరూపము, తెలుగుపస, తెలుగు నుడి, తెలుగునాదము, తెలుగురుచి' ఈ పాటలలో కొట్ట వచ్చినట్లు కనబడును

## "కవి సమ్రాట్ విశ్వనాథ"

కవి సమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ఒక కవివ్యక్తి యనుటకన్న నొక కవితాసంస్థయనుట సముచితముగా నుండును వీరు చేపట్టి సామర్థ్యముతో నిర్వహింపని ఆధునిక కవిత్వప్రక్రియ లేదనవచ్చును. ఖండకావ్యములు, గేయములు, శతకములు, నాటకములు, కథలు, విమర్శన వ్యాసములు, నవలలు, మహాకావ్యములు శరపరంపరగ వీరి మేధః కర్మాగారము నుండి వెలువడుచునే యున్నవి వీరి రచనలన్నియు గాఢముగ ఆత్మముద్రాముద్రితములై యుండును నూనూగు మీసాల నూత్న యౌవనమున రచింపబడిన 'గిరికుమారుని ప్రేమగీతము'ల నుండి ప్రాయమింతకు గైవ్రాలకుండ తమ సందేశమును లోకమునకు సమర్పించు మనీషతో వ్రాయబడుచున్న 'రామాయణ కల్పవృక్షము'వరకు వీరి ప్రతిభాసమున్మీలన మొక క్రమబద్ధము, మహత్తర లక్ష్యసాధనపరము అయినట్లు కాన్పించును. వైదికధర్మము - ఆర్షసామాజిక సంస్థ - వీనిని సనాతన దీప్తితో ప్రజ్వలింపజేసినచో లోక కల్యాణము కాకపోయినను భారత కల్యాణమైన సిద్ధవస్తువు కాగలదని సత్యనారాయణగారి విశ్వాసముగా తోచును ఇట్లు కవిగా మొలకరించిన సత్యనారాయణగారు ప్రవక్తగా చేవదేరుచున్నారు వర్తమాన భావకల్లోలములచే ఘుమఘుమావర్తములవు సామాజిక మహార్ణవమున, అడుగు దెబ్బతిన్న పురాతన నౌకలో, కతిచిన్నావికసహాయముతో ప్రయాణింప దలచిన వీరి ధీరత్వము స్థిరసంకల్పము ప్రశంసావహములు అయినను ఫలితమునెడ నిశ్చయ మనోహ్యము 'కర్మణ్యే వాధికారస్తే' యను గీతావచనమే వీరాలంబనముగా గొన్నారు

ఈ యపురూపమైన భావన ఈ కవికి పెక్కునాళ్ళక్రిందనే కలిగెను

> "దివ్యజ్యోతిని నీవు వెల్లుబుకు
> భక్తిగా జాట జూటాగ్రభా
> రువాల్యబద్ధ పవిత్ర దైవతధునీ!
> రుద్రాభి షేకంబొగిన్
> నవ్యశ్రీగతిఁజేయఁగా నమక
> మైనన్ రాదు గా హోరునా
> కొక్కవ్యామోదము ముక్తిస్రోత
> దురుచుక్కపోయె విశ్వేశ్వరా"
> విశ్వేశ్వర శతకము

ప్రకృతి దృశ్యములుకూడ భారతీయాదర్శములకు దిగ్దయ స్తంభములుగా ఈ కవికి భాసించును. అతివకిన్నరసాని పాతివ్రత్యపరీక్ష దీని కాద్యోదాహరణము సత్యనారాయణగారి భావనాశక్తి వైనతేయునివలె దుర్దాంతబలము కలదనుట పునరుక్తి. నేటి కవిత్వముయొక్క ముఖ్యలక్షణముగా పరిగణింపబడుచున్న భావకౌకుమార్యము వీ రుపాసించినట్లు కనబడదు. వీరి భావములు పేశలములు

శ్రీ పాలగుమ్మి పద్మరాజు

గావు. మాంసలములు అవి స్త్రీలింగములు కావు పుంలింగములు వీరి శైలియు భావస్ఫీతమై, ఘనీభూతమై నాచన సోమనాయితమై, తెనాలిరామకృష్ణాయితమై రాక్షసమైన సత్త్వము గలిగియున్నది శ్రీ సత్యనారాయణగారి రామాయణము, నిరంతర కావ్యానుశీలనాభ్యాసపరులకు కల్పవృక్షమే యగును కాని బహుళ పాఠక లోకమున కిది వజ్రవృక్షము

## దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు

ఇప్పటి శోక పుష్కరము వెనుక వలకు శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి గారికి ఏకలవ్య శిష్యులు గాని యనువశే లేకుండి రనుట యత్యుక్తి కాదు. కృష్ణపక్షముయొక్క సమ్మోహనశక్తి యంత గాటముగా నుండెను జీవితచషకమునందు అమృతము హాలాహలము అర్ధనారీశ్వరరూపము నందియున్నవి హాలాహలముదే పైచేయి యని కృష్ణశాస్త్రిగారు భావించిరి. అవశ్యం భావియైన ఈ దుఃఖమును జూచి దుఃఖించ నేల. దానినే వలచి ప్రేమింతమని, దుఃఖమునే సుఖముగా జూచుకొందమని వీరు చేసిన భావన, యువలోకమును ముగ్ధ మొనర్చినది ప్రణయదుగ్గములో విఫలత్వ మను ఉప్పుకల్లు పడి, వ్యథితమైన నవ హృదయములకు కృష్ణపక్షము- ప్రవాసము - వంటి సాంత్వ నౌషధములు నభూతో నభవిష్యతి

> "నా కుగాదులు లేవు
> నా కుషస్సులు లేవు
> నేను హేమంత కృష్ణానంతశర్వరిని"—ప్రవాసము

శోకఘూర్ణితమైన మనః కాసారముపై ఈ కావ్యములు చల్లని మెల్లని పిల్లగాడ్పుల వలె ప్రసరించి జోలపాడి నిద్రపుచ్చును కాని ఈనాటి యువకులు దుఃఖమును ప్రేమించగల చిత్తవృత్తిలో లేరు సమాజమును పీడించి దుఃఖకారకులగువారిని వధించి దండింతుమని కనుబొమలు చేసికొన్నారు కృష్ణపక్షము సమాజములో విస్మృతమైనను వ్యక్తి హృదయాంతరాళ సింహాసనాధ్యాసియై కలకాలముండగలదు 'దీపావళి' కావ్యము వ్రాసిన గౌతమీకోకిల శ్రీ వేదుల సత్యనారాయణశాస్త్రిగారు శ్రీ కృష్ణశాస్త్రి కోవలోని వారే మానవ హృదయమందలి నైరాశ్యమే వీరి భావతంత్రులను శ్రుతివరకు లాగి అనితర సౌందర్యముగల గానము లాలపింపజేసినది కృష్ణశాస్త్రిగారును సత్యనారాయణశాస్త్రిగారును వృత్తములు నడిపించుటయందును, హోయిహోయి యనిపించు తత్సమ శైలిలో పద్యములను మల్లెపూలను గురిపించుటలోను అసమానులు

## దుర్భాక రాజశేఖర శతావధాని గారు

ఇంతకుముందు నవకవిత్వమునందలి యొకభవ్యశాఖయైన దేశభక్తి గీతము లనుగురించి సూచన చేసియుంటిమి గురజాడకవి 'దేశమును ప్రేమించుమన్నా' యను మహోన్నత గేయముతో పల్లవించి, రాయప్రోలు వారి ప్రబోధ గీతములతో పుష్పించి, విశ్వనాథవారి యాంధ్ర ప్రశస్తిలో పూవసింపదెలతోనున్న దేశభక్తి కవితాశాఖ రాయలసీమ మహాకవు లిద్దరి హస్తములందు స్వాదుఫలములను దాల్చినది. వీరు ఆంధ్ర శౌర్యమను గార్హపత్యాగ్నితో సంతృప్తిపడక భారతశౌర్యమను ఆహవనీయాగ్నిలో కవిత్వమను హావ్యమును వ్రేల్చిరి. వీరిలో నొకరగు శ్రీ దుర్భాక రాజశేఖర శతావధానిగారు రాణాప్రతాపసింహచరిత్ర, చండి నృపాల చరిత్రము మొదలగు వీర కావ్యములను వ్రాసి వానికెక్కరి ధార్మిక వీరాగ్రణియు శుద్ధసత్త్వస్వభావుడును అగు రాణాప్రతాపుని వీరు భావించి చిత్రించిన విధానము నిఖిలకవిలోక స్తుత్యము ఈ మహాకావ్యమును రాజశేఖర కవిగారు ఆంధ్ర మహాభారత చ్ఛాయలో విరచించిరి. హల్దిఘాటు యుద్ధవర్ణనము వీరరసమునకు హిమాలయ శృంగము

## గడియారము వెంకటశేషశాస్త్రిగారు

రాయలసీమ తొలకరి కవులలోమరొక్కరగు శ్రీ గడియారము వెంకటశేషశాస్త్రిగారు 'శ్రీ శివభారతము' అను 'వీర మహారాష్ట్ర' వీరుడు ఛత్రపతి శివాజీచరిత్రను మహా ప్రబంధముగా నిర్మించి వన్నెకెక్కిరి. నీరసముగు చరిత్ర కంకాళముపై యమృతపు సోనల మంచెత్తు కవిత్వ గంగా భవానిని పారించి, అది యొత్తిగిలి, మేల్కాంచి, లేచి, పరుగెత్తి జీవకళతో కలకలలాడునట్లు చేయగల్గిన శేషశాస్త్రిగారి శిల్పము ప్రశంసనీయము కేవల సంభావనరీతిలో పద్యములపై పద్యములు వ్రాయు నేర్పును వీరు తిక్కన సోమయాజికడను పింగళి సూరనార్యునికడను అభ్యసించి రనిపించును వీరి కవిత్వములో జాతీయములు, అచ్చ తెనుగు నుడికారము మెండు శివాజీతల్లి జిజియాబాయి చిత్రణము వీర రసాత్మకముగా నున్నది

## తుమ్మల సీతారామమూర్తి చౌదరి

ఒకవంక రాయలసీమ కవులు యుద్ధ వీరుల కుద్దులు పద్దు వ్రాయుచుండ శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు శాంతి సంగ్రామ గాండీవియైన గాంధిమహాత్ముని 'ఆత్మకథ'ను చక్కని జాను తెనుగు శైలిలో నుడువ మొదలిడిరి

చౌదరిగారి ఏవగింపు అపత్సురాణ విషయముగనే గ్రహింపదగును వీరి 'రాష్ట్రగానము' విశ్వనాథవారి ఆంధ్రప్రశస్తితో ప్రశస్తికి నుచ్చరించుచు, ఉడుకుడుకు భావములును గడుసు నుడికారమును గలిగి యాంధ్రుని యాత్మ భిమానాగ్నికి ధామ్యగా నున్నది. వీరి కవితాధార యనర్గళమైనది.

## నాయని

తెలుగువారి కత్యంత ప్రీతిదాయకమును, అతిపరిచయముచే నవజ్ఞకు పాత్రమై "మేనత్త కొడుకూ ఒక మగడేనా! పప్పుతో ఉండ్రం ఒక పిండివంటేనా" అను సామెతకు గురియైన మేనరికపు సంబంధము నితి వృత్తముగా జేసికొని ప్రణయ మాధుర్యమును దాని దివ్యతత్త్వమును గానము చేసినవారు శ్రీ నాయని సుబ్బారావు గారు వీరి 'సౌభద్రుని ప్రణయ యాత్ర' రమణీయములైన భావములును సుకుమారమైన శైలియుగల సాత్త్విక - కావ్యము ధర్మ్యమైన దాంపత్యమే ఇహపరసాధనమని యీ కావ్యముఖమున నీ కవివతంసము పలికినవాడాయెను 'తల్లికొలుకు'

> అమృత మయమూర్తియైన
> యయ్యమ్మ పలుకు
> పలుకునను తేట చిలునగ వొలుకఁ
> బలికె
> ప్రకృతి నియమమ్ము లన్నియు
> బాడువెట్టి
> మూర్ఖుఁడా! యింటివచ్చితే పూజ
> సేయ

## వేంకటపార్వతీశ్వరకవులు

అంతర్ముఖ కవిత్వముయొక్క పరమావధియైన ఆత్మ విమర్శనమును ఆత్మ నివేదనమును వస్తువుగా గొని తొల్లింటి భక్తుల విన్నపములవంటి దివ్యరచనలు గావించిన కవిశేఖరులు వెంకట పార్వతీశ్వర కవులు తెలుగునందలి యాత్మపర కవిత్వము వీరి చేతులలో గొప్పస్థాయి నధిరోహించినది, గద్యమువలె కాన్పించు పద్యమునే వీరు ఆత్మార్పణకు వాహినిగా గైకొనిరి. వీరి యసంఖ్యాకరచనలలో 'ఏకాంతసేవ' భావసంకీర్తనము మాలికములుగా భావింపబడుచున్నవి.

> 'నీ నీడలోనుంటి నీడ నే ననుకొంటి
> నీడ నేఁగాదన నేరకుంటి
> నీవ జూచినవాడ నిను జూచుకుంటిని;
> నీవలో నడకలు నేర్చుకొంటి,
> నేను నీ నీడనాదునో కానో యెఱుఁ
> గఁ గాని
> యీనీడ వాఁడను గానటంచు,
> నీడ నాది గా దనుచును నిశ్చయించు
> కొంటి
> నీవాఁడ నే నమకొందునె ప్రభు!"
> —భావసంకీర్తనము,

నవ్యకవిత్వము లేక భావకవిత్వము అను ప్రసిద్ధవడసిన కవితాశాఖయందలి కొన్ని భావస్ఫోరకములైన మార్గములను వాని ప్రవర్తకులను ఉదహరింపనైనది. ఈ సార్థమునకు చెందినవారే శ్రీనాళం కృష్ణారావు, శ్రీ కవికొండల వెంకటరావు, శ్రీ జాషువా, శ్రీ బొడ్డు బాపిరాజు మొదలగు సముద్ధులైన కవు లింకెందరో కలరు

## భారత కవిత్వంపై తిరుగుబాటు

రమారమి 1930 సంవత్సర ప్రాంతమున కే విప్లవాత్మకమైన భావకవిత్వముపై మరియొక తిరుగుబాటు ప్రారంభమయ్యెను ఈ తిరుగుబాటుదారులు తిరిగి యువకులే విప్లవోద్రేకముతో బయలుదేరిన నవ్యకవిత్వము ఆ విప్లవమును సర్వాత్మనా నిర్వహింపలేక, కర్తవ్య విమూఢమై చప్పబడ్డారిందని పొంగులువారు హృదయములు గల యువకులు తలపోసిరి 'విశ్వశ్రేయః కావ్యమ్' అను ప్రాచీన సూక్తిని తమ కవిత్వపుధ్యేయముగా విడుకొని ఈ నూతన విప్లవ కవిత్వమునకు 'అభ్యుదయ కవిత్వము' అని పేరిడిరి.

## శ్రీరంగం శ్రీనివాసరావుగారు

వ్యక్తిగతములో కల్పితములో అగు నావేదనలను దృఢముగా తిరస్కరించి సామాజిక వేదనచేతను పీడిత మానవరోదనముచేతను వ్యథితమైన హృదయముతో కణకణలాడు భావములను భగభగమను కవితలో భుగభుగ సొంగింప జేయుటకు దారితీసిన కవి శ్రీ శ్రీరంగం శ్రీనివాసరావు గారు. కానైతే ఈ కవిగూడ చిన్నారి పొన్నారి కవిత లల్లువాడు కృష్ణపక్షమువంటి కావ్యముల ప్రతిధ్వనులు పలికినవారే వీరి 'ప్రభవ' సంపుటియందలి కవితలు దీనికి నిదర్శనము. అట్లయ్యును ఈ కవి త్వరలోనే ప్రణయ సుఖసుషుప్తినుండి దద్దరిల్లుచు లేచి యొక నూతన ప్రస్థానమును సాగించెను.

భావకవిత్వము నవకును, శ్రీ శ్రీ గారును వారి యాదర్శ ప్రేరితులైన యితర యువకవులును స్థాపించుటకై పోరాటము సల్పిన, సల్పుచున్న అభ్యుదయ కవిత్వమునకును లక్ష్యములందలి భేదము సులక్ష్యముగానే యున్నది ఒకటి వ్యక్తివాదన రెండవది సామాజిక వాదన పీడిత దశనుండి సౌభాగ్య దశకు మానవలోకము చేయు ప్రస్థానమే శ్రీ శ్రీ గారి 'మహాప్రస్థానము' యొక్క సందేశము ప్రజాశక్తి యనే జగన్నాథరథము మెల్లగనే కానిండు తప్పక దొర్లివచ్చుచున్నదని వీ రాలపించిన రౌద్ర భయానక గేయము ఆంధ్రవాణికి కపాల మాలాలంకారమై శోభిల్లగలదు

## "ఆరుద్ర"

ఆరుద్ర కవి 'త్వమేవాహమ్' అను కావ్యసంపుటియందు అభ్యుదయ కవిత్వముయొక్క బల దౌర్బల్యములు అస్ఫుటముగా గోచరించును. భావములు పరిశోధితవి. చేవ మెరుగులు కలవి వాటని పాదిగిన భావ విశ్వతమో, సుకృతమో, కాలమును లోకమును నిరయింపగలవు.

## దాశరథి : కాళోజి

తెలంగాణమునందునిరంకుశమైనరాజరికముతోను దుష్టమతశక్తులతోను జరిగిన యుద్ధము అదనముగా నుద్దీపకమయ్యెను. శృంఖలాబద్ధమైన తెలంగాణ ప్రజాహృదయ వేదనను, విజయానంతరము వెల్లివిరిసిన యానందమును ముక్తకంఠముతో ఘోషించిన యువకవు లిద్దరను ముఖ్యముగ ప్రశంసింపదగును శ్రీ దాశరథి కృష్ణమాచార్యులుగారును, శ్రీ కాళోజి నారాయణరావు గారును కృష్ణార్జునులవలె తెలంగాణ నవసాహితీ వనమునకు అండగా నున్నారు దాశరథికవిగారి 'అగ్నిధార' 'రుద్రవీణ' యను కావ్యసంపుటములు వారి ఉజ్జ్వల భవిష్యత్తు కలదని చాటుచున్నవి

దాశరథి కలమునందెంత చురుకుదనము గలదో భావములందంత పరిణామము కలదు హృదయమునందంతకోమలతయు కలదు

'నా గొడవ' అను కావ్యసంపుటమును గూర్చిన శ్రీ కాళోజి నారాయణ రావుగారికి తెలంగాణమునందు ఉత్తమ కవిగాను, 'నీతైనవోడ్డ వోలమ్మ' యన్నట్లు విజాయతి పరుని గను చెల్లుబడికలదు 'నా గొడవ' ప్రపంచముయొక్కయు అహింసా న్యాయముల యొక్కయు గొడవకాని వ్యక్తిగతమైన సొద కాదు. ఈయన భావములు 'వావిరి పుట్టు రత్నములు'

ఉద్యమ రచనలయందు వేద ఋక్కులందు వంటి నిరాడంబరము, నైతిత్యము గోచరించును కాళోజి గారిలో చక్కని మృదుహాస్యమును గలదు.

## "పుట్టపర్తి"

'శివతాండవము' అను ప్రశస్త కావ్యమును వ్రాసిన శ్రీ పుట్టపర్తి నారాయణాచారిగారికి రాయలసీమ యువకవులందు సమున్నతస్థానము కలదు. దివ్యకళయైన నాట్యమును వస్తువుగా చేసికొని వెడలిన యీ కృతి వర్తమాన సాహిత్యమునందు విశిష్టత నొందియున్నది. నాట్యసంకేతము లిందు చక్కగా పొందుపరుపబడినవి కవిత్వము నునుబచ్చి ముత్యములవంటి తెలుగు పలుకుబడులతో జాలువారినది.

# మన నాట్యకళ - నాట్య సంప్రదాయం

21 వ పేజీ కొరవ.

ఆదర్శవంతమైన కళాక్షేత్రాన్ని స్థాపించి, ప్రతిభావంతులు, త్యాగపురుషులు అయిన కళోపాసకుల యొక్క సహకారం లభించినప్పుడే యిదంతయూ సాధ్యపడుతుంది

మనదేశంలో స్థాపించే కళాకేంద్రంలో ఈ క్రిందచెప్పిన విధంగా నృత్యకళయందు శిక్షణనిచ్చిన ప్రజలు విశేషలాభము పొందగలుగుతారు

(1) పాఠశాలల్లో నేర్పే నృత్యవిధానం, (2) శాస్త్రీయ నృత్యాన్ని అభ్యసించి నృత్యప్రదర్శనము లిచ్చుటయే వృత్తిగా పెట్టుకొన్నవారికి నేర్పే విధానం, (3) బాలురకు, యువకులకు నేర్పే నృత్యం, (4) నాట్యాచార్యులు, ప్రచారకులు కాగోరే వారికిచ్చే శిక్షణ.

## పాఠశాలల్లోనేర్పే నృత్యము

పాఠశాలల్లో చదువుకునే విద్యార్థినులు సంపూర్ణంగా శాస్త్రీయ నృత్యాన్ని అభ్యసించడానికి అవకాశముండదు స్కూల్లో జరిగే యితర పాఠాలవలె ఒక సబ్జక్టుగా గవర్న్మెంటువారు యేర్పరుస్తారు అందుచే యెక్కువ కాలం వినియోగించి పరిపూర్ణ పాండిత్యం సంపాదించుటకు వీలుండదు కనుక వారు శీఘ్రకాలంలో అభ్యసించుటకు అనువుగా వుండే నృత్యాలను తయారుచేయ్యాలి ప్రతి విద్యాలయంలో డ్రిల్లు పీరియడు ఒకటి వుంటుంది దానికి బదులుగా కొన్ని సులభమైన హస్తపాద విన్యాసాలను చెప్పించిన ఆరోగ్యానికెంతో వుపకరిస్తుంది సంగీతముతో కూడిన ఈ వ్యాయామము నేటికాలపు డ్రిల్లువలెగాక పిల్లలనందర్నీ ఆకర్షిస్తుంది వివాహానంతరము మన స్త్రీలు యెట్టి వ్యాయామము లేకపోవుటచే అనారోగ్యవంతులుగా తయారవుతున్నారు చిన్నతనంలో పాఠశాలల్లో చదువుకునేటప్పుడు సుందరతరమైన కొన్ని నృత్యకరణులు చెప్పించిన అవివారి జీవితంలో వ్యాయామరూపంగా శరీర పోషణానికి ఉత్తమంగా తోడ్పడుతాయి గుజరాతు మొదలైన ప్రాంతాల్లో స్త్రీలందరు పండుగ సమయాల్లో ఒకచోట కూడినప్పుడు 'గర్బా' మొదలైన నృత్య కాలక్షేపాలతో ఉల్లాసంగా కాలాన్ని గడుపుతారు కాని మనపండుగ నిస్సారంగా కేవలం పిండివంటకాలను తినుటకేఅన్నట్లు ఉపయోగిస్తున్నాం అట్లుగాక స్త్రీలందరూ కలిసి వినోదంగా కాలంగడుపుటకు కొన్ని పాట నృత్యాలను మనము యేర్పరచి చిన్నతనే బాలికలకు నేర్పించాలి అంతేగాక మన దేశచరిత్రను, మన జాతియొక్క ఔన్నత్యాన్నీ, దేశనాయకుల జీవితాలను నృత్యరూపంలో నేర్పించుట అత్యవసరము విజ్ఞానవంతులైన మాతృమూర్తులున్నప్పుడే దేశం అభివృద్ధిగాంచుతుంది. జీజియాబాయి వంటి మాతృమూర్తి సుశిక్షణ వల్లనే శివాజీ హైందవ జాతిని ఉద్ధరించాడు.

(2) నృత్యకళనే వృత్తిగా స్వీకరించే వారి శిక్షణవిధానం రెండు విధాలుగా వుంటుంది

(అ) నేటి తంజావూరు భరతము వలె యేక పాత్రాభినయానికి పనికి వచ్చే శిక్షణ.

(ఆ) కొందరు నర్తకులు కలిసి నృత్త నాటికలు, యక్షగానములు ప్రదర్శించుటకు అనువైనట శిక్షణ

ఏకపాత్ర నర్తకులు భరతశాస్త్రమే గాక, అలంకార శాస్త్రము, శిల్పశాస్త్రము, కావ్యములను గూడా విధిగా పఠించాలి పూర్వపు నృత్య సాహిత్యము, అలారి, జతులు, శబ్దాలు, మంఘూక శబ్దము, జక్కిణి దరువులు, కైవార దివ్య ప్రబంధాలు, కొల్లుకట్టు జతులు, స్వర పల్లవులు, స్వర జతులు, పద వర్ణాలు, పిద్ద వర్ణాలు, తాన వర్ణాలు, క్షేత్రయ్య, సారంగపాణి, అన్నమయ్య మొదలైనవారి పదములు, కృతులు, కీర్తనలు, అష్టపదులు, తరంగులు, శ్లోకములు, తిల్లానలు, తిరాపలు మొదలైనవే గాక, నేటి ఆధునిక కవులు దేవులపల్లి, బసవరాజు, బాపిరాజు వేదుల మొదలైన వారి భావగీతలు, నండూరు, కొనకళ్ల మొదలైన వారి యొక్క జానపద సాహిత్యాన్ని గూడా అభ్యసించాలి అంతియేగాక నేటి కాలంలో పాశ్చాత్య పద్ధతుల ననుసరించి శిల్ప భంగిముల సాధారంగా తీసుకొని 'ఒరియంటల్' నృత్యాన్ని సృష్టించిన ఉదయ శంకరు మొదలైన వారి యొక్క నృత్య సృష్టియందు గూడా కొంత వరకు కృషి సల్పిన యిదివరకు మన నృత్యములో లేని ఒక నూతన శైలివాన్ని, సౌకుమార్యాన్నీ, సౌందర్యాన్ని మన నృత్యంలో తీసుకొని రాగలము

పాశ్చాత్య దేశాలలో 'కరియోగ్రాఫర్,' 'ఇంప్రసారియో' లున్నారు దేశములో వివిధ పట్టణాలలో వున్న థియేటర్లు దానిలో నృత్యప్రదర్శనము నిచ్చుటకు పనికివచ్చేవి, రంగస్థలము యేర్పాట్లు మొదలైనవన్నీ తెలిసియుండి యోగ్యులైన నర్తకులు తమ ప్రదర్శనములు నిచ్చుటకు ఉత్సాహపడినప్పుడు వారికి తోడ్పడుతాడు 'ఇంప్రసారియో'

ఇక నర్తకుడు ఒక క్రొత్తనృత్యమును సృష్టించినప్పుడు దానిని ఎలాగు ప్రారంభించి, యే భంగిములో ముగిస్తే ప్రేక్షకుల దృష్టిలో రక్తిగా వుంటుందో, యెట్టి విద్యుద్దీపాలంకారము కావలెనో, రంగాలంకారములో నృత్యములోని వివిధఘట్టాలకు ఎలాగ వుండాలో, అందు నాట్యముచేసే వివిధపాత్రలు ధరించే ఆహార్యం మొదలైన విషయాలలో అనువిధంగా సహాయపడి, నృత్యప్రదర్శనం విజయానికి తోడ్పడేవాడు 'కరియోగ్రాఫర్' మనదేశంలో యిట్టివారు లేరు శ్రీ హిరణ్ ఘోష్, ఉదయశంకరు సాధనబోసు మొదలైనవారియొక్క ప్రదర్శనములు యేర్పాటు చేసేవారు కాని బెంగాలు మరికల్లోలంలో వారూ అసువులుబాసారు. కనుక మనదేశంలో నర్తకులుగాని నాట్యాచార్యులుగాని యీ విషయాలన్నీ తెలుసుకోవడం యెంతైనా అవసరముంది. ఎంత మహావిద్వాంసుడైననూ, తన కళను ప్రజల ముందు ప్రదర్శించే విధానము తెలియనిచో ఆ నర్తకునికి విజయము చేకూరదు

జానపద నృత్యసాహిత్యం గురించి చెప్పేటప్పుడు నండూరివారి 'యెంకి' గురించి కొంత వ్రాయవలసిన అవసరం వుంది నాకు తెలిసినంతవరకు బెంగాలి, హిందీ, తమిళము మొదలైన యే దేశభాషల జానపద గేయాలలోను 'యెంకి' వంటి అపూర్వసృష్టి మనకు కనిపించదు 'యెంకి' భారతదేశ సాహిత్యానికి, గేయకవితకు ఆంధ్రుడర్పించిన అమూల్య కానుక

అట్టి 'యెంకిని' సరిగానర్థము చేసుకొని ఒక చక్కని న్యాయమిచ్చి ప్రపంచానికి చూపుబాధ్యత ఆంధ్ర నృత్య కళారాధకులపై వుంది

నృత్యనాటికలను ప్రదర్శించువారు వీరి ప్రచార వర్తకులు ప్రజలహృదయాల్లోనికి చొచ్చుకొనిపోయి కళలను ప్రజాపాన్ని ధ్యానికి తీసుకొని పోగలరు వీరికి శాస్త్రీయ దృక్పథంతోకూడిన ఉషాపరిణయం, ప్రహ్లాద మొదలైన భాగవతాలనే గాక, తంజావూరు లైబ్రరీలో మరుగుపడివున్న యక్షగానాల నన్నింటిని బయటికి తెచ్చేబాధ్యత వీరిపైనుంది కనుక — భాగవతులలోవుంటే వివిధ విధములైన నృత్యనృత్త పోకడలు,- దరువులు, కందార్థములు, జతుల మొదలయిన వానిలో శిక్షణివ్వవలెను వారు స్వయంగా వారు ఆ పురాతన యక్షగానాలను పఠించపరుచగలరు అంతేగాక నేటి ఆధునిక కవుల రచనల్లో— రాయప్రోలువారి 'వసంతం,' విశ్వనాథవారి 'కిన్నెర', శ్రీశ్రీ 'మరోప్రపంచం', పద్మారతి చరణచారణ చక్రవర్తి, వకుళమాలిక, గురజాడ వారి 'కన్యక' మొదలైనవన్నీ గేయనాటికలు, నృత్యనాటికలుగా ప్రదర్శించవచ్చును.

## బాలురకు, యువకులకు నేర్పే నృత్యాలు

ప్రస్తుత కాలంలో యెవరైనా యువకులు నాట్యాచార్యులవద్ద నృత్యము నభ్యసించ దలచినప్పుడు, నాట్యాచార్యులు వారికి పురుషత్వానికి సరిపడునట్టి నృత్యాలు గాక స్త్రీభావాలు చిత్రించునటి, భంగిములు, ఆంగిక సాత్త్వికాభినయాలను నేర్పుటచే ఆ యువకుల అభినయము స్త్రీల అభినయమూగాక పురుషుల అభినయమూగాక వికృతరూపముదాల్చి చూచుటకు ఏవగింపు కలిగించునట్లుగా తయారవుతుంది అంతేగాక స్త్రీ ప్రకృతిని అలవర్చుకోడానికి వారు పూర్తిగా వారికాలమువంతా వినియోగించుటచేత నిత్యజీవితములో యితరసమయాల్లో గూడా భంగిమల్ని, భావాల్ని స్త్రీలవలె ప్రదర్శించుట అలవాటై పోవుటచే నిత్య జీవితములో పనికిరానివారుగా తయారవుతున్నారు. ఇది మనదేశములో చాలావుంది నాట్యాచార్యులుచేయు గొప్పపొరపాటు కనుక నే నాట్యమందు ఉత్సాహమున్నను యెక్కువమంది విద్యాధికులైన యువకులు ఈ కళను అభ్యసించుటకు ముందుకు రావడములేదు

ఇదిగాక, గోండులు, సైగాలు, భిల్లులు, కోయలు, సవరలు మొదలైన ఆటవికులు చేయు నృత్యాలలో పురుషులకు పనికివచ్చే నృత్యాలు యెన్నో వున్నాయి వానినిగూడా సేకరించి వచ్చేయువకులకుగూడా నేడు స్కూళ్లు, కాలేజీలలో డ్రిల్లుకు బదులు నృత్యాన్ని ప్రవేశపెట్టవచ్చును

## తెలుగు నృత్యకళా స్వరూపము

మన నృత్యానికి పునాదిగా కూచిపూడినృత్యమే వుండాలి. కాని అపద్ధతిలోలేని కొన్ని అంశములను చేర్చుకుని మనసంప్రదాయం చెడకుండా నూతన తేజంతో విలసిల్లే కళను వృద్ధిపొందించాలి. పూర్వం ఒకప్రాంతం నుండి మరొక ప్రాంతానికి పోవడానికి ప్రయాణసౌకర్యాలులేక మనము అన్యప్రాంతాల్లోని కళను చూడ్డానికిగాని, మనకళను అభివృద్ధిపరచుకొనుటకుగాని అవకాశము వుండేదిగాదు నేడు వున్న సౌకర్యాలు దేశంలోని అన్ని ప్రాంతాలను మనకు సన్నిహితులను చేశాయి అందుచే ఇతర నృత్యపద్ధతులలోని విశిష్టతను మనం సులభంగా గ్రహించగలుగుతున్నాము దేవులపల్లి బసవరాజు, బాపిరాజు మొదలైనవారి యొక్క గీతములు, సుకుమారమైన మణిపురి ఆంగికముతో ప్రదర్శించిన కడుల పసందుగా వుండును భావగీతములు తెలుగు మనసంగీతానికి, కవిత్వానికి ఒక నూతనత్వాన్ని కలిగించావో అలాగే మణిపురి ఆంగికముతో ప్రదర్శింపబడు భావగీతాభినయం గూడా మననృత్యకళకు నూతనశోభను చేకూర్చగలదు ఈభావగీతములను శాస్త్రప్రధానమైన భరతనాట్య భంగిములు, కరణాలు, రేచకముల సాధారంగా ప్రదర్శించిన రాణించవు నృత్యనాటికలను ప్రదర్శించునపుడు, "కథకళి" నృత్య పద్ధతులను మనము కొంతవరకు గ్రహించాలి నృత్తము 'కథక్' పద్ధతిలో అభివృద్ధిచెందినట్లు మరి యేపద్ధతిలో గూడా పోషింపబడలేదు మనపద్ధతులలో-జతిస్వరం, తిల్లానలలో కొన్ని జతులు, తీర్మానములు, నృత్తమాడుదుము. 'కథక్' నందు అట్లుగాక మృదంగములో పలికించిన విధంగా శబ్దాలవన్నింటిని, నృత్తమాడుటఅభ్యాసంలోవుంది ఇది మనకు క్రొత్తగనుక అశాస్త్ర విషయాలను మనం అభ్యసించి మనపద్ధతిలో ప్రవేశపెట్టవచ్చును.

## ఆహార్యము

మూడువిధములైన ఆహార్యము మనము అభివృద్ధిచేయాలి.

(1) శిల్పములోని ఆహార్యం; (2) అజంతా చిత్రములలోని ఆహార్యం; (3) సాధారణంగా మనస్త్రీలు ధరించే ఆభరణ విశేషాదులు.

శిల్పములోని ఆహార్యం:- పురాణేతిహాసముల నభినయించునప్పుడు నృత్త నృత్తములందు వుపయోగపడును.

అజంతా ఆహార్యం:- మన ఆధునిక కవులయొక్క గేయాలను, నృత్యగేయ నాటికలను ప్రదర్శించునప్పుడు వుపకరించును.

క్షేత్రయ్య, సభాపతయ్య మొదలగువారి పదములు అభినయమందు సాధారణంగా మనస్త్రీలు ధరించు ఆభరణాదులతోను, పల్లెటూరివారి ఆహార్యము జానపదగేయాలందును ప్రచారములోనికి తేవచ్చును. ఈవిధంగా ఆహార్యములోగూడా ఒక నూతనత్వాన్ని మనం ప్రవేశపెట్టవచ్చును.

శాస్త్రీయ నృత్యప్రదర్శనములో నృత్యక్రమము యెలాగు వుండాలి?

నృత్యవిద్య — నాట్యము నృత్యము, నృత్తము, అభినయము అనియు, ఆంగికము, వాచికము, ఆహార్యం, సాత్త్వికము, లాస్యము, తాండవ మను భేదాలను కలిగివుంటుంది. ఈ భాగాల నన్నింటిని పోషించునదే శాస్త్రీయ నృత్యమగును.

ఇందు ఉద్ధతమై, గంభీరభావప్రదర్శనముతో కూడివుండి, పురుషులకు పనికివచ్చే నృత్యము తాండవము, సుకుమారభావ ప్రదర్శనములో నిండి వుండి స్త్రీలచే ఆరాధింపబడేది లాస్యం.

నాట్యము, నృత్యము మనముచాలా మట్టుకు నృత్యనాటికలు, గేయనాటికలలో చూస్తాము. కనుక శాస్త్రీయంగా దక్షిణాదినందువలె యేకపాత్రాభినయానికి (Solo Dance) పనికివచ్చే నృత్యపద్ధతిని మనము కూర్చేటప్పుడు పైనజెప్పిన నృత్య, నృత్త, అభినయములను చక్కగా పోషించుటకు యీ క్రింది విధంగా ఆంధ్రదేశంలోని నృత్యకళకు స్వరూప మివ్వాలి.

(1) గణపతి కవుతం, (2) అలరింపు, (3) జతిస్వరము, (4) శబ్దము, (5) వర్ణము, (6) పదము, (7) భావగీతములు, జానపదగేయములు, (9) నృత్తము, (10) తిల్లాన,

హైందవ సాంప్రదాయానికి చెందిన నృత్యకళ 'గణపతి' స్తోత్ర నృత్యముతో ప్రారంభించుట సముంజసముగా వుండును. అంతియేగాక ఈ 'గణపతి కవుతం' 72 అక్షరముల అపూర్వతాళం, వినాయకతాళములో రచింపబడింది. ఈ రచన ఆంధ్రదేశంలో ఒక రిద్దరు నాట్యాచార్యులవద్ద మాత్రమే వుంది. అందునా 72 అక్షరముల దీర్ఘ కాలముతో గూడిన యీ తాళమును గురువు, లఘువుల విన్యాసముతో నృత్యమాడేవారు అరుదు. ప్రచారములోలేని యితర నృత్యాల వలె యీ నృత్యము గూడా అంతర్థాన మొందకుండా దీన్ని మరల మనం ప్రచారములోనికి తేవాలి.

'అలరింపు':—ఈనృత్తము దక్షిణాదివారుకూడా చేస్తున్నారు. 'అలరింపు' అనగా పుష్పించుట లేక వికసించుట—శిలావిగ్రహమువలె రంగస్థలముపై వున్న నర్తకి, సంగీత మాధుర్యము వినపైకొనంత చంచలం కలిగి తాళలయానుకూలంగా అంగప్రత్యంగ ఉపాంగములను కదిలించుతుంది.

జతిస్వరం: కరుణ, చారి, రేచకములతోకూడిన నృత్తము పోషించబడుతుంది.

శబ్దంలో—తాళలయల ననుసరించి గతులనాడుతూ, కీర్తనల యొక్క భావానికి ఆంగికాభినయప్రాధాన్యమైన నృత్యము ప్రదర్శింపబడుతుంది.

వర్ణములు పదములు, భావగీతము లందు రసాభినయము పరిపూర్ణత నొందుతుంది.

నృత్తము, తిల్లాన:-నృత్తము. ఇందు సంపూర్ణ వికాసము పొందుతుంది.

గనుక యిట్టే యేర్పాటు చేసిన- అలరింపు, జతిస్వరము, నృత్తము, తిల్లానలలో నృత్తము;

శబ్దం, వర్ణములలో ఆంగికాభినయ ప్రాధాన్యమైన నృత్యము. పదములు, భావగీతాదులలో సాత్త్వికాభినయము సమముగా పోషింపబడుతుంది, ఇట్టే పద్ధతి నొకదానిని యేర్పరచి, పెంపొందించి ప్రచారములోనికి తెచ్చినయెడల ఆ కళ మనయొక్క నృత్య సాంప్రదాయంగా వర్ధిల్లుతుంది.

నృత్యకళ విరివిగా ప్రచారము జరుగుటకుగాను, యువకులందు ఉత్సాహము కలుగుటకు ప్రభుత్వం ప్రతి సంవత్సరం నృత్యకళయందు, నృత్య సంగీతము సాహిత్యములందు పోటీలు పెట్టి బహుమానము లివ్వాలి. నృత్యకళా ప్రచారమునకు సంసిద్ధులైయున్న ప్రచారకులకు ఆర్థిక సహాయము చేయవలెను.

పైచెప్పిన పద్ధతులలో మన మొక సంస్థ స్థాపించి నాల్గు సంవత్సరముల శిక్షణ కాలంలో సౌందర్యవంతులు, విద్యాధికులు, త్యాగమూర్తులైన యువతీ యువకులకు శిక్షణనిచ్చి, వివిధ పట్టణాలలో కళాకేంద్రాలను స్థాపించి వారిచే నృత్యమునందు బాలబాలికలకు శిక్షణనిప్పించినప్పుడు ఒక విధమైన నృత్యకళ పెంపొంది తెనుగుదనాన్ని వ్యక్తపరిచే శాస్త్రీయ నృత్యాన్ని ప్రపంచానికి ప్రదర్శించ గలుగుతాము.

---

చారిత్రక, సాంస్కృతిక, సారస్వతరంగాలలో మాదిరిగానే కళారంగంలో కూడా ఆంధ్రులది భారతదేశంలో ఒక విశిష్టస్థానమని వేరే చెప్పనవసరంలేదు. ఆంధ్రులు స్వభావసిద్ధంగా కళోపాసకులు, ఆంధ్రభూమి అనాదిగా ఉత్తమకళలకు ఆటపట్టు. ఉత్తర హిందూస్థానానికీ, దక్షిణాపథానికీ మధ్యగావున్న ఆంధ్రసీమ ఉత్తర, దక్షిణభారత సంస్కృతులకు ఉత్తమ సమన్వయకేంద్రంగా ఉపయోగపడింది. చిత్రకళలో ఆంధ్రుల ప్రాభవాన్ని ఈ వ్యాసం విశదీకరిస్తున్నది.

# ఆధునిక ఆంధ్ర చిత్రకళ ప్రాశస్త్యం: మన చిత్రాలు:

18 వ పేజీ కొరవ

ప్రసిద్ధిగాంచినతంజావూరుచిత్రరచనా విధానాన్ని నిర్మించిన చిత్రకార వర్గముగా కనపడుతుంది.

## పాశ్చాత్య నాగరికతా ప్రాబల్యము

కాని మన చరిత్రలో బ్రిటిషుయుగం సంప్రాప్త మయ్యేసరికి ప్రభువుల పాశ్చాత్య నాగరికతా ప్రాబల్యం వల్ల మనజాతీయ సాంప్రదాయాలన్నీ నిర్మూలనమయి మనకళలు కన్నగిలిపోయాయి. ఈ ఒత్తిడిలో మన ఆంధ్రుల సాంప్రదాయక చిత్రకళ, చిత్రకారులూ,అన్నిటితో బాటునీరసించడం సంభవించింది. అయినా, పైనచెప్పిన ముచ్చివంశస్తులు మన తెలుగుదేశంలో పెద్దాపురం, రాజమహేంద్రవరం, కొండపల్లి మొదలగు కొన్ని ప్రదేశాలలో తమ కులవృత్తిని చేసుకుంటూ కళను విడవాడకుండా జీవదశలో నైనా నిలిచి ఉండిపోయారు.

పాశ్చాత్య ప్రభుత్వ పోషణక్రింద పాశ్చాత్య చిత్రకారులకు ఈ దేశంలో ప్రాధాన్యం కల్పింపబడింది. పాశ్చాత్య చిత్రరచనా వ్యాపనకై ప్రభుత్వ చిత్రకళాశాలలు పెద్దపట్టణాలలో నిర్మింపబడ్డాయి, యుగలక్షణంలో మార్పుకలిగింది ఈ పాశ్చాత్య సంప్రదాయంలో తయారయిన శ్రీ రాజా రవివర్మ రచించిన తైలవర్ణ చిత్రాలు చవుకగా ముద్రణపొంది దేశమంతటా ప్రబలమై పోయాయి. కాని ఈ ధోరణి ఎంతో కాలంజరుగలేదు. త్వరలోనే ముందువంగదేశంలోను దానవెంబడి ఆంధ్రదేశంలోను కళాలోకంలో తిరిగి జాతీయత పునరుజ్జీవన మొందింది. జాతిలో తిరిగి చైతన్యం పొడసూపింది.

## ఆధునికాంధ్ర చిత్రరచన

సహజ సాంప్రదాయాన్ని పురస్కరించుకుని ఆంధ్రదేశంలో నియువక చిత్రకారులు ఒక నూతనోత్తేజాన్ని పొంది యీ శతాబ్దంలో మూడవదశనుండి ఆంధ్ర చిత్రకళా చరిత్రలో ఒక నూతనయుగాన్ని సంకల్పించుకున్నారు. అటుబొంబాయి చిత్రకళాశాలలో శిక్షణపొందిన కొందరు చిత్రకారులు పాశ్చాత్య వాస్తవిక కళారీతిని అభ్యసిస్తోంటే యిటు వంగదేశంనుండి వెలువడుతున్న నూతన జాతీయ సాంకేతిక చిత్రరచనారీతిని స్వీకరించిన మరికొందరు వంగీయ సాంకేతిక కళావిధానాన్ని అభ్యసించుటకు మొదలుపెట్టారు. ఒక నూతన సాంస్కృతిక సంచలనం బయలుదేరింది. ఆంధ్రదేశంలో చిత్రకళకూ ఒక నూతనోత్తేజం కలగడమే కాక ఆంధ్ర చిత్రకళకు ఒకప్రత్యేకత, ప్రతిభ తిరిగివచ్చినటువంటిది.

## దామెర్ల రామారావు 'నూతనాంధ్ర చిత్రకళాయుగ స్థాపకుడు'

బొంబాయి చిత్రకళాశాలలో ఘనతతో ఉత్తీర్ణుడైన దామెర్ల రామారావు 1921వ సంవత్సరంలో తనస్వస్థలమైన రాజమహేంద్రవరం చేరుకుని తనకళా కృషిని ప్రారంభించేసరికి ఆంధ్రదేశంలో ఆనాడు చిత్రకళ నామావశిష్టమై యుండెను. పేరుగల ఆంధ్ర చిత్రకారుడేలేడు. ఆ స్థితిలో రామారావు తన చిత్రసృష్టిని ప్రారంభించి చిత్రకళాప్రదర్శనాలలో దిగ్విజయము నొంది ఆంధ్రచిత్రకళకు పరువు ప్రతిష్ఠలను సంపాదించినాడు. అతని చిత్రరచనా విధానము ఒక విశిష్టమైన శైలి కలిగి కళాలోకంలో గౌరవస్థానం సంపాదించుకొన్నది. పాశ్చాత్య రవి శాస్త్రీయులకు సహితము ఆశ్చర్యము కలిగించినది. అటు బొంబాయిలో వాస్తవిక సిద్ధాంతానుసారం కళాభ్యాసం చేసినవాడయినా తన స్వతంత్ర బుద్ధి వల్లనూ, దేశయాటనచేసి వివిధ కళాస్థానాల పరిశీలనవల్ల గడించిన అనుభవమువల్లనూ, దేశంలోని రాజపుత్ర, మొఘలు మొదలయిన సాంప్రదాయిక చిత్రరీతులను, నూతనంగా వెలువడిన వంగీయ సాంకేతిక కళారీతిని తాను విమర్శించి గ్రహించిన అనుభవంవల్లనూ, అతను సృష్టించిన చిత్రరచనలకు ఒకప్రత్యేక విశిష్టత ఏర్పడి విశేషమయిన రమ్యతనుపొంది ఆకర్షణీయమవడంచేత, అతడొక నూతనఆంధ్ర చిత్రకళారీతికి స్థాపకుడైనాడు. అతనికి అజంతా చిత్రలేఖనం ఒక ప్రధాన ప్రమాణమై నిల్చింది. యావదాంధ్ర కళాసాంప్రదాయమూ ప్రాతిపదిక అయినట్లు తోస్తుంది. ఇతనితోనే ఆధునికయుగంలో ఆంధ్రచిత్రకారులకు తిరిగి ఒక గౌరవస్థానం చేకూరింది, ఇతనితోనే నవ్యాంధ్ర చిత్రకళాయుగం ప్రారంభమయినదని చెప్పవచ్చును. ఈయుగ

శ్రీ అడివి బాపిరాజు

స్థాపకుడు ఈతడే ఇతడు స్వల్పకాలమే జీవించినవా మహోజ్వల నక్షత్రమువలె వెలిగి తన ప్రకాశాన్ని కళాలోకంలో వెదజల్లుకొని అమరజీవి అయినాడు ఇతడు అనేక చిత్రరచనలు చేసినాడు దృశ్యచిత్రాలు, భావచిత్రాలు, రూపచిత్రాలు అతివిరివిగా చిత్రించాడు విస్తారంగా నీటిరంగులను, కొద్దిగా తైలవర్ణాలను ఉపయోగించాడు పెన్సిలు స్కెచులకు, హద్దులు అంతేలేదు ఆంధ్రత్వం ఉప్పొంగే జాతీయతతో ఒక విస్ఫుట కళావిధానానికి నిర్మాతఅయినాడు, ఆధునికాంధ్ర చిత్రకారులలో ఇతని దే ప్రధానస్థానము

## రామారావు చిత్రాలు

రామారావుయొక్క చిత్ర రచనలలో ముఖ్యమైనవి కొన్ని పేర్కొందాము సామూహిక చిత్రాలు, 'సిద్ధార్థ రాగోదయము', 'పుష్పాలంకారము', 'కార్తీక పూర్ణిమ', 'రామ వివాహము', 'కృష్ణలీల', 'నీలాటిరేవు', 'నందిపూజ', నీటిరంగులలో తనభార్య సత్యవాణియొక్క రూపచిత్రములు, పెన్సిలు స్కెచ్ లలో రవీంద్రనాథఠాగూరు, భరతగుప్త మొదలగువారి రూప చిత్రాలు, దృశ్య చిత్రాలలో ప్రధానంగా గోదావరినదీదృశ్యాలు. ఇతనిచిత్రాలు రాజమహేంద్రవరంలో, రామారావు స్మారకకళా ప్రదర్శనశాలలో చిరస్థాయిగా ప్రదర్శితములై నిలిచియున్నవి

## ఆధునిక ఆంధ్ర చిత్రకారులు

ఆధునిక ఆంధ్ర చిత్రకారులను వారివారి కళారీతులనుబట్టి ఈ క్రింద అనుక్రమంగా వర్గీకరించవచ్చును:—

## రాజమహేంద్రవర కళా కేంద్రము చిత్రకార వర్గము

రామారావు తన స్వల్ప జీవితకాలంలోనూ రాజమహేంద్రవరంలో ఒక చిత్రకళా సంస్థను ప్రారంభించి కొందరు చిత్రకారులకు మార్గదర్శకుడయాడు ఈ సంస్థ ఇప్పటికీ కొనసాగుతోనే ఉన్నది. రామారావు జీవితకాలంలోనూ, అతరువాతనూ ఈ పైసంస్థలో ఉత్తీర్ణులై ప్రఖ్యాతి గాంచిన చిత్రకారులు పెక్కుమందిగలరు వీరిలో ముఖ్యులు వరదా వెంకటరత్నం, చేమకూర సత్యనారాయణ, శ్రీ వి. వి. భగీరథి, శ్రీమతి దిగుమర్తి బుచ్చికృష్ణమ్మ, శ్రీమతి దామెర్ల సత్యవాణి, యోకేల సుబ్బారావు, ఎమ్. ఎస్. ప్రకాశరావు, దుర్గారావు, సీతారామాచార్యులు, పారిశ్యంద్రశర్మ మొదలయినవారు వెంకటరత్నంయొక్క శైలి బహు సున్నితమయి, సొపు అయిఉంటుంది. ఈయనచిత్రాలలో ముఖ్యమైనది 'గౌరీ శంకర్' ఈయన రామారావు చిత్రకళాసంస్థ 'గౌరవసిద్ధ కళాచార్యుడు' చేమకూర ప్రఖ్యాత చిత్రాలు చాలాఉన్నాయి ప్రసిద్ధ రూపచిత్రాలు విరివిగా చిత్రిస్తున్నారు ఈయన భావచిత్రాల ముఖ్యమైనవి 'సిద్ధార్థుడు' 'మహాత్మాగాంధి' భగీరథి ప్రకృతి దృశ్యచిత్రాలు అధిక సంఖ్యాకములై ఉన్నవి వీటలోక విశిష్టరమ్యత బుచ్చి కృష్ణమ్మ 'వటరాజు' 'తులసీపూజ' సత్యవాణి 'రాధాకృష్ణ', 'ఆంధ్ర బాలిక' సుబ్బారావు 'ఫకీరు' పేరెన్నిక గాంచిన చిత్రాలు.

## బందరు చిత్రకళా కేంద్రము కళావిధానం చిత్రకార వర్గము

1924లో బందరులో ఆంధ్రజాతీయ కళాశాలలో వంగీయ చిత్రశిల్పాచార్యులు ప్రమోదకుమార ఛటర్జీగారి అధ్వర్యాన కొద్ది సంవత్సరాలు జరుపబడిన చిత్రకళా కేంద్రంలో కొందరు ప్రతిభావంతులయిన ఆంధ్ర చిత్రకారులు శిక్షణపొందారు వీరిలో ముఖ్యులు శ్రీ అడివి బాపిరాజు, సుబ్రం మల్లయ్య, కవుతా రామమోహన శాస్త్రి శ్రీ ఆనంద మోహన శాస్త్రి, శ్రీమతి యశోదాదేవి, కేశవరావు మున్నగువారు వీరి చిత్రరచనలదొక ప్రత్యేకమైన మధురశైలి. ఇది వంగీయ సాంకేతికరీతి అనుసరించి ఉంటుంది. బాపిరాజు చిత్రాలు భావసౌందర్య పూరితములై ఉంటాయి. ఈయన చిత్రాలలో ముఖ్యమైనవి 'తిక్కన', 'త్రివేణి', 'సముద్రగుప్త' ఆనందమోహనశాస్త్రి యొక్క, 'షాజహాను మరణం', ప్రఖ్యాతి గాంచిన చిత్రం. రామమోహనశాస్త్రి రూపచిత్రములైన స్కెచ్ లు భావతీవ్రకళా యుక్తమై యుంటవి.

## మద్రాసు చిత్రకళాశాలకళారీతి చిత్రకారవర్గము

1928 నుండి వంగీయ కళాచార్యులు దేవీప్రసాదరాయ్ చౌదరీగారి అధ్వర్యాన సంస్కరింపబడి వర్ధింపబడుతోన్న మద్రాసు ప్రభుత్వ చిత్రకళాశాలలో శిక్షణనొంది ప్రసిద్ధిగాంచిన ఆంధ్ర చిత్రకారులు పలువున్నారు. వీరిలో ముఖ్యులు దేవీప్రసాద్ నారాయణరావు, మాధవపెద్దిగోఖలే, పిలకా నరసింహమూర్తి, రామగోపాల్, పైడిరాజు, పోడూరి రామమూర్తి మొదలైనవారు వీరిచిత్రకళలోకూడ వంగీయ సాంప్రదాయాన్ని పురస్కరించుకున్న రమ్యత గలదు నారాయణరావు 'సంఘమిత్ర సందేశము' గోఖలే 'మూంచాల బాలచంద్రులు' నరసింహమూర్తి 'గోపాలకృష్ణ' పైడిరాజు ప్రకృతి దృశ్యాలు పేర్కొనదగినవి

## శాంతినికేతన కళాకేంద్రము కళారీతి చిత్రకారవర్గము

శాంతినికేతనంలో చిత్రకళా విద్య నభ్యసించి విఖ్యాతిగాంచిన ఆంధ్రులలో ప్రధానుడు శ్రీ వి. ఆర్. చిత్రా వీరు టెంపెరా రంగులలో చిత్రించిన ప్రకృతి దృశ్య చిత్రాలు ప్రత్యేక రమ్యతగన్న చిత్రాలు

## బొంబాయి చిత్రకళాశాల కళా విధానము చిత్రకారవర్గము

బొంబాయి చిత్రకళాశాలనుండి వెలువడిన ప్రథమ ఆంధ్ర చిత్రకారులలోనివారైన చామకూర భావ్యకార్లరావు, చావలి నాగేశ్వరరావుగార్లు ప్రధానంగా రూపచిత్ర రచనలో ప్రావీణ్యంపొంది కీర్తివంతులైనారు భావ్యకార్లరావు ప్రముఖుల రూపపటాలు అనేకం చిత్రించారు నాగేశ్వరరావు జాతీయనాయకుల రూపపటాలు అనేకం చిత్రించి ప్రతులు ముద్రించి భారతదేశమంతటా వెదజల్లుతున్నారు.

## స్వతంత్ర చిత్రకారులు

తమంతట తామే స్వతంత్రంగా కళను అభ్యసించి పేరొందిన ఆంధ్ర చిత్రకారులలో శ్రీ శ్రీ కె. యస్. వెంకట్రావు, అద్దంకి వెంకటేశ్వరరావు, అంకాల వెంకటసుబ్బారావు, మొక్కపాటి కృష్ణమూర్తి, శ్రీమతి సీతాదేవి శ్రీమతి సంఘం లక్ష్మీబాయి, శ్రీమతి కమ్మల కమలాబాయి, భాగేశ్వర శర్మ, ధనపాల్, మొదలైనవారు, పేర్కొనతగినవారు కె. యస్. వెంకట్రావు, భావచిత్రాలు చాలచిత్రించారు. వీరి 'సుగాలిపడుచు' - అన్నబొమ్మను ముఖ్యంగా పేర్కొనవచ్చును వీరి కుమారుడు శ్రీనివాసరావుకూడ పేర్కొనదగిన చిత్రకారుడే వెంకటేశ్వరరావు ప్రకటనా చిత్రరచనలు పెక్కుచిత్రిస్తున్నారు. అంకాలవారు రూపపటములు పెక్కుచిత్రిస్తున్నారు. మొక్కపాటి కృష్ణమూర్తి పెన్సిల్ స్కెచ్ రూపపటాలు వేయడంలో నిపుణులు. సీతాదేవి 'పాలమరగలు,' లక్ష్మీబాయి, 'ఏకలవ్యుడు,' కమలాబాయి - భావచిత్రాలు, భాగేశ్వరశర్మగారి స్కెచ్చిలు ఉదహరింపతగినవి

## ఆధునిక ఆంధ్ర చిత్రకళా విశిష్టత

ఇల్లా, ఆంధ్ర చిత్రకారులెందరో ఈ నవయుగంలో వెలువడి చిత్రకళను పునరుద్ధరించడంలో ఆంధ్ర సంస్కృతికి వన్నెతెస్తున్నారు భావచిత్రరచనలో, తమతమ వ్యక్తిత్వాలను స్పష్టపరుస్తో రచనావిధానాలలో స్వాతంత్ర్యాన్ని కనుపరుస్తో, కల్పనలలో, వర్ణసంధానంలో, అలంకారాలలో ప్రత్యేకతలను వ్యక్తపరుస్తో ప్రాధ్యమైన జాతీయతను ప్రతిబింబిస్తున్నారు ఇది మనకళాభివృద్ధికి చాలా ఆశాజనకమైన విషయము

ఇల్లాగే దృశ్యచిత్రరచనలలోకూడ ఆధునిక ఆంధ్రచిత్రకారులు విశిష్టత కనుపరుస్తున్నారు రూపచిత్రాలలో మాత్రం ఈ విశిష్టత కనుపడటంలేదు. రూపచిత్రాలు చిత్రించడంలో విస్తారంగా, చిత్రకారులు, ఛాయాపటాల నుండి విస్తృతపరచడమే అభ్యసించడంచేత జీవకళలోటుపడుతున్నది ఈ లోటు తీర్చుకోవలసి యున్నది.

## శుభోదయము

మొత్తంమీద ఆధునిక ఆంధ్ర చిత్రకళ ఒక అభ్యుదయాన్ని పొందింది. ఎందరో యువకులు ఉత్సాహంగా చిత్రకళను అభ్యసిస్తున్నారు. అయినా దేశదారిద్ర్యం వల్లనూ, ఆర్థిక నిరుత్సాహము చేతను తగినంత అభివృద్ధికి సావకాశములేదనే చెప్పాలి. ఈలోటు తీర్చడానికి కళాకారులకు, సంఘము యొక్క సహకార ప్రోత్సాహాలు కూడా కావాలి నేటిని చిత్రకారులు అర్థిస్తున్నారు ఆంధ్రరాష్ట్రావతరణంతో మనకు లభించిన స్వాతంత్ర్యాన్నీ ప్రత్యేకతనూ, పురస్కరించుకొని, ఆంధ్ర సంస్కృతి సత్వర పునరుజ్జీవనము పొందగలదనిన్నీ, అన్ని కళలతోబాటు, ఆంధ్రుల చిత్రకళకూడ ఇంకా ప్రోత్సాహాభివృద్ధులు పొందగలదని ఆశిస్తున్నాము



# ఆంధ్రోద్యమ అంకురార్పణ

## 40 ఏళ్లక్రితం 'ఆంధ్రపత్రిక' ప్రోత్సాహంతో జరిగిన కృషి వివరణ



★

### ఉద్యమ ప్రారంభకులలో ఒకరైన చట్టి నరసింహారావుగారి సమీక్ష

★

భాషా ప్రయుక్తరాష్ట్ర విభజనకు భారతరాజ్యాంగ పరిపాలనా సౌష్ఠవమునకును, సౌకర్యమునకును మూలసూత్రమని 1910-11 సంవత్సరములలో తెలుగువారు నివసించుజిల్లాల నన్నిటిని చేర్చి ఒకరాష్ట్ర మేర్పడుట ఆంధ్రుల పురోభివృద్ధికి అవశ్యకమని నేనొక వ్యాసమును వ్రాసి ఘనత వహించిన ఆంధ్ర పత్రికకు పంపా యుక్త పంపియుంటిని.

శ్రీ శ్రీ జక్కోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు నా వ్యాసమును ప్రచురించుచు ఆ పత్రికయందే వారి ప్రధాన వ్యాసమున నా భావముతో ఏకీభవించి ఆంధ్రరాష్ట్రము అవశ్యకమని ఉద్బోధించిరి.

తదాది పెక్కండ్రు ఆంధ్ర-ఆంగ్ల భాషలలో ప్రత్యేకాంధ్రరాష్ట్ర విషయమై వ్రాసియుండిరి. బందరునుండి శ్రీ శ్రీ కొన్నవిత్తుల గురునాథంగారు గుంటూరునకు వచ్చి రాధాప్రెస్ పెట్టి "ఆంధ్ర" అను వారపత్రికను ఆంగ్లమున ప్రచురించుచు "తెలుగువారు" అను విషయమును గూర్చి వ్యాసపరంపరలు వ్రాసి మా పోటి విద్యార్థులకు మార్గదర్శకులైరి. వారి ప్రేరణవలన కే ఆంధ్రుల పురోభివృద్ధికి ఆంధ్రరాష్ట్ర అవశ్యకతను గూర్చి నేను వ్యాసమును వ్రాసియుంటిని.

1918 సంవత్సరములో గుంటూరు జిల్లా బాపట్ల గ్రామములో ఆంధ్ర మహాసభ జరుపుటకు గుంటూరులో శ్రీ శ్రీ దేశభక్త కొండ వెంకటప్పయ్య పంతులు గారి అధ్యక్షత క్రింద ఆహ్వాన సంఘము ఏర్పడినది. మహాసభ శ్రీ శ్రీ బయ్యా నరసింహేశ్వరశర్మగారి అధ్యక్షత క్రింద జయప్రదముగా బాపట్లగ్రామములో జరిగినది. ఆ సభలో ప్రత్యేకాంధ్రరాష్ట్ర తీర్మానము యుక్తముగా లచే ప్రతిపాదింపబడి వాదోపవాదములు జరిగి తుదకు తీర్మాన ముపసంహరింపబడినది. తర్వాత నిడదవోలునకు సభలో ఆంధ్రరాష్ట్రతీర్మానము ఏకగ్రీవముగా ఆమోదింపబడినది. కొండ వెంకటప్పయ్యపంతులుగారిని కార్యదర్శిగా ఎన్నుకొనిరి. వారు చాలా కాలము కార్యదర్శిగానుండి ఉద్యమ ప్రచారము రాయలసీమలోను, సర్కారులలోను జరిపిరి. వారితో నేను, ఉన్నవ లక్ష్మీనారాయణప్రభృతులు కలసి ప్రచారము చేసియుంటిమి.

తరువాత కొంతకాలమునకు రాయలసీమ నాయకులలో అగ్రగణ్యులైన గాడిచర్ల హరిసర్వోత్తమరావు పంతులుగారు అధ్యక్షులుగను, గుంటూరు వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ కుర్మపల్లి పున్నయ్యశాస్త్రిగారు కార్యదర్శిగను ఏర్పడి వెటివరకు ఆంధ్రమహాసభలను జయప్రదముగా జరుపుచు ఆంధ్రరాష్ట్రసిద్ధికి తోడ్పడిరి. ఆంధ్రపత్రిక కార్యాలయము బొంబాయి నుండి చెన్నపురికి చేరిన కొంతకాలమునకు శ్రీ శ్రీ బల్లా శేషగిరిరావు పంతులుగారు ఆంధ్రపత్రిక అధిపులై చేరి ఆంధ్రపత్రిక ద్వారా ఆంధ్రోద్యమ ప్రచారమును చేసియుండిరి. వారి సేవ మరువదగినది కాదు.

ఆంధ్రోద్యమ లతాంతము వేళ్ళు నాటి వ్యాపించి చిగిర్చి, మొగ్గ దొడిగి, పుష్పించి, కాయ కాచి, ఫలోన్ముఖ మయియుండిన కొన్ని నేడు పురుషులు కోరబడి అభివృద్ధికి అటంకము కలుగజేసినందున త్వరలో ఫలము చేకూరియుండలేదు. నేడు మహామంత్రి నెహ్రూ పండితుని సానుభూతివలన ఆంధ్రరాష్ట్రము సిద్ధించినది. మహా జనాము!

*******************

ప్రభుత్వమువారు వారి పరిపాలనమునకనుకూలముగా నీయాంధ్ర దేశమును విభజించి యుండుటంబట్టి దీని వృత్తాంతము ప్రజాసామాన్యమునకు గోచరము గాక యున్నది. ...

# ఆంధ్రరాష్ట్రావశ్యకత

## 1912 నాటి ఉద్బోధ

గుంటూరునుంచి వెలువడే దర్బార్ పత్రిక 1912, మే 21 సంచికలో చట్టి నరసింహారావుగారు వ్రాసిన వ్యాసం

...లనువారు ప్రముఖులై కొంతకాలమైన తర్వాత బయల్పడుదురు. ... పాటుపడి ... కాలము గడచినకొలది దాని విజార్థము ప్రజలకు బోధపడి చివరకు లోక...

...సమ్మతమై యుండుట గనుక యాంధ్ర మహాజను లందఱు నేకగ్రీవముగ ప్రభుత్వమువారితో మొరపెట్టి ఆంధ్ర రాజధాని యేర్పడుట ప్రయత్నించవలయును గాక. ఈ విషయమై ఆంధ్రపత్రిక ...

స్వాతంత్ర్యభారతిలో స్వేచ్ఛతో మనజాతి
రాయలనాడ లేచి యా శైలాన మౌనాదు
చెయ్యగలిగి పాలించు స్వారాజ్యం
జయమంది భోగించు విరాజ్యం

— శ్రీ కృష్ణ

---

# అమరజీవి ఆశయసిద్ధి

★ ★

# మహాతపస్వి పొట్టి శ్రీరాములు దివ్యస్మృతి

రచన:

వి. ఎల్. సుందరరావుగారు

ఆంధ్ర ప్రజాసోషలిస్టుపార్టీ సంయుక్త కార్యదర్శి



తెలుగువారల కీర్తి
ఘళఘళల వెలుగాలి
తెలుగు కళలే దేశ
దేశాల ప్రబలాలి
తెలుగుతల్లీ నీకు జోహారు!

---

# తెలంగాణములో ఆంధ్రాభ్యుదయ వికాసము

## ★శ్రీ ఆదిరాజు వీరభద్రరావుగారు★

"అచ్చ తెనుంగు కబ్బముల కాదిపదంబయి వాల్కుభాగ్యముల్
హెచ్చుగ గన్న దేశమిది యే దురదృష్టమొ యాంధ్రభాషకే
డిచ్చట సొంపునింపుచెడి హీనదశార్తిని కుందెనక్కటా
అచ్చపుటాంధ్ర శ్రోతలకు నందజరుణ్ దలకంపు వానటుల్"

అని బహుళ గ్రంథకర్తలును, మహాకవులును, మహావక్తలును అయిన శ్రీ ఆదిపూడి సోమనాథరావు పంతులుగారు వాపోయియున్నారు. ఇది 1901 సంవత్సరములోని ముచ్చట. అప్పుడు నిజాం ప్రభుత్వంవారి రాజనీతి ప్రభావమున ఆంధ్రభాషకు స్వస్థానమునందు నిలువ నాశ్రయము లేకుండపోయెను. ఆంధ్రజాతి 'తెలంగీ'లయ్యిరి 'తెలంగీ బిడంగీ' అనుచు ముసల్మానులు ఆంధ్రులను నీచార్థములో వేళాకోళము చేయుచుండిరి.

పాఠశాలలలో ఆంధ్ర బాలురు, బాలికలు అలీఫ్, బే, పేలతో అక్షరాభ్యాసము చేయుచుండిరి. ఆంధ్రజాతి మహోన్నత చరిత్రగాని ఆంధ్ర మహాపురుషుల మహోదార చరిత్రగాని గ్రహించి మహోత్తేజము పొందు సంగతి సందర్భములు గగన కుసుమాయమానములయి యుండెను. తెలుంగువారు వేషభాషలయందు ముసల్మానులను అనుకరించుచు, ఉర్దూ మానసిక పుత్రులయి, ఇటు తెలుగువారు కాక అటు ఉర్దూవారు కాక రెంటికిం జెడిన రేవడి లయిపోయిరి.

ఇట్లు తెలంగాణములో పెచ్చు పెరిగిపోవుచున్న విచారకర పరిస్థితులను దూరమునుండి గమనించి, వాటిని దూరము చేయుటకు ప్రత్యక్ష చర్యలు తీసికొన కృతనిశ్చయులయిన మహోదారాశయులు ఇంకొకరు గలరు. వారు కీర్తిశేషులైన శ్రీ కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారు.

### హైద్రాబాదుకు పెద్దల రాక

శ్రీ రాజా నాయని వెంకటరంగారావు బహద్దరువారును, శ్రీ రాజాగారి మంత్రివర్యులైన లక్ష్మణరావుగారును రాచకార్యములపయి హైద్రాబాదుకు విచ్చేసిరి. శ్రీ రాజాగారును, లక్ష్మణరావుగారును, రావిచెట్టు రంగారావుగారును, సోమనాథరావుగారును, శైలజరపు నరసింహాశాస్త్రిగారును మంతనములు సల్పిరి. తత్ఫలితముగా శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషానిలయము 1901 సెప్టెంబరు 1 వ తారీఖున స్థాపితమయ్యెను. రాజధానియందే ఆంధ్రభాషాపతాకము ఎగుర వేయబడెను. తెలంగాణములో ఆంధ్రాభ్యుదయ వికాసమునకు అంకురార్పణ జరిగెను. శ్రీ రాజాగారు ధనము నొసంగిరి. శ్రీ లక్ష్మణరావుగారు పథకనిర్మాణము గావించిరి. రావిచెట్టు రంగారావుగారు కార్యనిర్వాహణమునకు కంకణము గట్టుకొనిరి. పండితద్వయము శ్రీ సోమనాథరావుగారు, శ్రీ శైలజరపు నరసింహశాస్త్రిగారు ప్రచారమునకు సన్నద్ధులయిరి. శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయరంగము ఆంధ్రభాషోద్ధరణమునకు, ఆంధ్ర జాత్యుద్ధరణమునకు నాటినుండి నేటవరకు ...చు, విజ్ఞాన కిరణములను ...యుచు మహాదాశయము ...ల్పుచున్నది.

### ...లో ప్రచారం

...నాథరావుగారు మహా...గంభీరాకారుడు. సభలో ...బావాదముతో ఉపన్య... సభ్యులు సమ్మోహితు... ఉపన్యసము లిచ్చుటకు ...అభావమని అటువైపు ...రాభావమే యోగ్యమైన ...టువైపువారును ప్రియ...యుండెను. ఆకాలములో ...రావుగారి యుపన్యాస...కు కనువిప్పుగా నుండెను. ...శ్రీగారు ఆంధ్రభాషను ... ఆంధ్రకవులను గురిం...ధజాతిని గూర్చియు, ...ములను గూర్చియు ...చేయసాగిరి. శ్రీ శైల...నరసింహశాస్త్రిగారు కవిత...ఆకవుల ప్రతిభను ప్రశం...బోధము గావింపసాగిరి ...సాద్యమము ఆంధ్రజనుల ...ర్షించెను. నూతనభావ... ఆంధ్ర భాషాభిమాన ...గ్రంథాలయములు ... ఆంధ్రాళికి స్థాపింప...

### అవతరణ

...జనించిన పృ డు ...లదిగా నున్నను, అది ...బలయి, మహోదార ...ఖోపశాఖా సమన్విత ...ను కుబ్జ్లె, ఇచ్చటి ...కంతి యు మహో...ములతో వివిధ శాఖల ...ంభిమానములయి ప్రక...భించెను. వార్తాపత్రి...తికలు వారి క...


శ్రీ శే. ప్రతాపరెడ్డిగారు

పంచికలు, గ్రంథమాలలు స్థాపితములయి తెలంగాణ జనుల మానసముల కలరింపసాగెను. పరిషత్తులు, సాహిత్యసంస్థలు, పరిశోధక మండలులు మున్నగు మహాసంస్థలు సాహిత్యరంగమున ఉన్నతస్థాయిలో సమంజస కార్యకలాపములను నిర్వర్తింప సాగెను. నవ్య భావ తరంగితులయి యువకులు భావగీతములను గానము చేయసాగిరి. ప్రాచీన, అర్వాచీన విద్వత్కవుల జయంత్యుత్సవములు, కవిసమ్మేళనములు, కథాసమ్మేళనములు, వార్షిక మహాసభలు జరగసాగెను. తెలుగులో హరికథలు, నాటక ప్రదర్శనములు ఆంధ్రజనుల రంజింపసాగెను. మంటిముద్దలవలె పడియున్న ఆంధ్రజాతి యొక్కసారిగా మేల్కొనెను. జగన్నాథ రథము బయలుదేరినది దాని నాప నెవ్వరితరము? 1927 లో శ్రీకృష్ణదేవరాయాంధ్రభాషా నిలయము రజతోత్సవము జరుపుకొనెను.

ఆ రజతోత్సవ సంచికలో "ఇరువది యయిదేండ్ల క్రింది యాంధ్రభాష నికృష్టస్థితిపోయి, ఇప్పటి సౌభాగ్యస్థితికి మూలకందమైన యీ భాషానిలయ జన్మము సార్థకమైనది" అని అప్పుడు నిలయమునకు కార్యదర్శిగా నుండిన శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు తమ తృప్తిని, తమ సంతోషమును ప్రకటించియున్నారు.

### హనుమంతరావుగారి గీత

శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయ నిర్మాణము, సోమనాథరావుగారి ప్రసంగధోరణి, నరసింహశాస్త్రిగారి ప్రబోధము పెద్దలను, పిన్నలను చకితులను జేసినవి. వంగదేశములో జనించిన స్వదేశోద్యమ తరంగములు కూడ నీ హైదరాబాదు రాష్ట్రమును కలంచి వైచినవి. ముఖ్యముగా విద్యార్థులయిన యువకులయందు లావి ప్రభావము అమితముగా నుండెను. అప్పుడు శ్రీ మాడపాటి హనుమంతరావుగారు విద్యార్థిగను, యువకుడుగను ఉండెను. అయినను అప్పటికప్పుడే తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ, పారిసీ భాషలయందు మంచి ప్రవేశము కలవారయి యుండిరి. దేశ, విదేశ చరిత్రలను చదివియుండిరి. తెలంగాణములో నింకను అవిద్య, అజ్ఞానము ప్రబలియున్నదని శ్రీ వారు గ్రహించిరి. తెలంగాణ జనులు శారీరక, మానసిక పుష్టిలేక, ఔన్నత్య మార్గమును బట్టించు ధార్మిక, సామాజిక, పారిశ్రామిక, రాజకీయాది తత్వముల నెరుంగక అజ్ఞానాంధకారములో నిద్రాముద్రితులయి యుండిరి.

"అన్ని విధములకు నౌన్నత్యము నలవడజేయ నత్యవసరముగు సంఘీభావము, పూర్వచరిత్రముగూర్చిన గౌరవము, భావిభాగ్యోదయ విషయమున విశ్వాసమును తెలుగువారి హృదయక్షేత్రములందంకురింపనిచో మృతతుల్యులుగానున్న వీరి భావిసంతానము గతియేమి గావలయును?" అని హనుమంతరావుగారు తమ విచారమును "తెనుగుపత్రిక" యందు ప్రకటించిరి.

"అరువదిలక్షలజీవులు నిజాంరాష్ట్రమునకును, భారతవర్షమునకును చిరకాలము భారముగా నుండవలసినదేనా?" అనికూడ అందులో ప్రశ్నించిరి.

ఇట్టి భావములు ఇంకెందరికో పుట్టియుండవచ్చును. ఇంతకన్న చక్కని రచనా పాటవముగలవారుండవచ్చును. కేవలము ఊహాపోహాలవలనగాదేమి? పత్సంకల్పముతో, సానుభూతితో, ఆత్మవిశ్వాసముతో, అకుంఠిత ప్రజాసేవా పరాయణుడగు కర్మయోగి కావలసియుండెను. ప్రజాహృదయమును చూరగొని, ప్రజాభిమానమును గ్రహించినవాడు ముఖ్యతరగతివారేయని హనుమంతరావుగారు గ్రహించిరి.

ఆంధ్రజనుల యభ్యుదయమును కాంక్షించుచు శ్రీ హనుమంతరావుగారు దీక్షాబద్ధ కంకణులయి, ఆత్మవిశ్వాసముతో, అచంచల ధీశక్తితో, అమానుష త్యాగ సంకల్పముతో కార్యరంగమున దుమికిరి. ఆంధ్రోద్యమము నడుపుకొనుచుండిరి.

### ఆంధ్రమహాసభ : ప్రభుత్వ ఆంక్షలు

ఆంధ్ర మహాసభల యేర్పాటునకు ప్రభుత్వమునుండి ఎన్నో యిబ్బందులు సంభవించినవి. హనుమంతరావుగారు నిరుత్సాహపడలేదు. శాంతముతో, మృదువచనములతో అలక్ష్యముగానైనను కార్యములను నడుపసాగిరి. "మందమందముగానైనను ముందంజ వేయవలయును" అని శ్రీవారి సూక్తి. ఒకసారి ఆంధ్రమహాసభను సర్కారువారు అన్యగోచరము కారణములతో నిషేధించిరి. తుదకు అనుమతి దొరికిన నిషయమును పురస్కరించుకొని శ్రీ తిరుమల కృష్ణశర్మగారు ఇట్లు వర్ణించియున్నారు:

"అదొక విషపుగడియ. హైద్రాబాదు రాజకీయ రంగముమీద కారుచీకటి కప్పియుండినది. ప్రజాపక్షపు అందోళనపయి ప్రభుత్వపు అంగారకదృష్టి పడియుండినది. మొదలే మూగలారు జనులు, అందులో పిరికి, ఈ పిచ్చుకపయి "తిర్యగ్గస్తి" బ్రహ్మాస్త్రము ప్రయోగింపబడి యుండెను. అది చాలదని సుగ్రీవాజ్ఞ యొకటి వెలువడెను. సభ చేయుటకు రు 2000 లు జామీనియ్యవలెను. సభ ప్రభుత్వపు మనస్సుకు రాకయున్న జామీను "జప్తు" చేళము గడగడ వడకినది వాయువుల కంటెకే పిడుగుపడెను. కమ్మిన చీకటి మూడేండ్లు తొలగలేదు. ప్రజాందోళన క్రమముగా అక్కడక్కడ పోరాడి పోరి ఇల్లారినది. పలుకు అతిమితిగ్గించు నిరాశ అది, హఠాత్తుగ పత్రికలలో జను లొకదినము చదివిరి. "ఆంధ్రమహాసభకు అనుమతి జామీను అక్కరలేదు" లోకుల్ ప్రజలు ముక్కుపై వేళ్ళిడిరి. ఈ అమావాస్య చంద్రుని నమ్ముటయే కష్టమాయెను. శ్రీ హనుమంతరాయలు పట్టినపట్టుకే ఆకీర్తి. వారి కార్యసాధనాదీక్షాఫలమే అది. నిరంతర ధారాప్రవాహమునకు బండరాతి చట్టెలాపొడిపొడి అగును. నిజాము దేశపు రాజకీయ ప్రళయములో రావుగారు ఆంధ్రమహాసభా వ్యవహారమును తనుకడకు తీసికొని యుండుట తెలుగులాయి జనులకు ఒకరీతి జీవదానము పునస్సృష్టి." (గోలకొండ పత్రిక)

### "ఆంధ్రోద్యమం"

ఆంధ్రోద్యమము తెలంగాణ జనుల కల్పతరువుగా భాసిల్లెను. ఈ యుద్యమ చరిత్రను రెండు సంపుటములలో 550 పుటలలో శ్రీ హనుమంతరావుగారే వర్ణించియున్నారు. ఆంధ్రజనులకు మేల్కొలిపి, కార్యకరలను సృష్టించి, మహోన్నతసేవ చేసి, జయప్రదులయిన శ్రీ హనుమంతరావుగారిని ఎవరో, ఎప్పుడో, ఎట్లో "ఆంధ్ర పితామహ" బిరుదాంకముతో సంబోధించి సత్కరించిరి. అదియే రూఢియయి పోయినది. జనమాన్యులయిన ఆంధ్రపితామహ మాడపాటి హనుమంతరావుగారి సంబంధములేని ఉద్యమము తెలంగాణములో లేదని ఘంటాపథముగ నుడువవచ్చును. ఆంధ్రమహాసభయే తుదకు తెలంగాణ ప్రదేశ కాంగ్రెసుగా మారి అది క్రాంతిముగ ప్రజాసేవ, భాషాసేవ యొనర్చుచున్నది.

### ప్రతాపరెడ్డిగారి సేవ

నీలగిరి పత్రిక, తెలుగుపత్రిక, గోలకొండ పత్రిక ప్రజావిజ్ఞానమును పెంపొందించుటలో అపారకృషి సలిపినవి. గోలకొండపత్రికను స్థాపించి 25 సంవత్సరములు ప్రజాప్రబోధము సల్పిన శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారు చిరస్మరణీయులు. శ్రీ ప్రతాపరెడ్డిగారే ప్రథమాంధ్రసభకు అధ్యక్షులుగానుండి మాతృతో తేజము నొసంగిన వారు విజ్ఞాన ఖనులయిన ప్రతాపరెడ్డిగారి పత్రికా నిర్వహణ కార్యము ప్రభుత్వమునకు కంటకముగను, ప్రజలకు మానసీయముగను భాసిల్లెను. గోలకొండ పత్రిక సలిపిన రాజకీయ, సామాజిక, భాషావిషయక చర్చలు శ్రీ రెడ్డిగారి విజ్ఞానమునకు తార్కాణముగా నుండెను. రెడ్డిగారివంటి విద్వన్మణులు దివంగతులగుట తెలంగాణ జనుల దురదృష్టము. ఇప్పుడు గోలకొండపత్రికను దినపత్రికగా మార్చి శ్రీ సూకల నరోత్తమరెడ్డిగారు సంపాదకులుగా దక్షతతో నిర్వహించుచు ప్రజాభిమానమును చూరగొనుచున్నారు. సుజాతం కోథి మొదలగు మాసపత్రికలు మంచి సాహిత్యమును ప్రకటించుచు ప్రబోధమొనర్చుచున్నవి. రచయితలకు దారిద్ర్యము వహించిన యీ భూమియందు పెక్కుమంది రచయితలు శృంఖలాను శృంఖలములుగా నవ్య విలాసముతో రచనలు సాగించుచున్నారు.

### ఆంధ్రసారస్వత పరిషత్తు

ఆంధ్రసారస్వత పరిషత్తు, విజ్ఞానవర్ధనీ పరిషత్తు సాహిత్యరంగమున గణనీయమయిన కృషి సలుపుచున్నవి. ఆంధ్రసారస్వత పరిషత్తు ఆంధ్రభాషలో ప్రాథమిక, మాధ్యమిక, ప్రవేశ, విశారద పరీక్షలను జరిపి, పారితోషికములను, యోగ్యతాపత్రములను నొసంగి ప్రశంసనీయమయిన కార్యజాతము నడుపుచున్నది. ఓరుగల్లు, తూపురాణి మంచిర్యాల, ఆలంపురము ప్రదేశములందు వార్షిక మహోత్సవములు జరిపి సాహిత్య, చారిత్రక, శాస్త్రీయ విజ్ఞానప్రసారమునకు కేంద్రముగా ఆంధ్ర సారస్వత పరిషత్తు విశాలాంధ్రమునందలి యందరను ఆకర్షించినది. ఈ పరిషత్తు వయోజనవిద్యా ప్రసార విషయములో కూడ శ్రమించుచున్నది. కొన్ని యుద్గ్రంథములను గూడ ప్రకటించియున్నది. విజ్ఞానవర్ధనీ పరిషత్తు చేయుచున్న క్రియాకలాపము అక్షరాలా విజ్ఞానవర్ధనమే. కొన్ని యుద్గ్రంథములుకూడ ప్రకటించినదీ పరిషత్తు.

వందలకొలది గ్రంథములు రచితములయి ప్రకటింపబడినవి. సురవరం ప్రతాపరెడ్డిగారి ఆంధ్రుల సాంఘిక చరిత్ర ఒక యుద్గ్రంథము. ఇది ప్రమాణాధార భూయిష్ఠమై శాశ్వతముగా నుపకరించు చరిత్రగ్రంథము. యువజన విజ్ఞానముకూడ సురవరం ప్రతాపరెడ్డిగారు రచించినదే. ఆంధ్ర సంస్కృత గ్రంథములలో చరిత్ర, ఆంధ్ర భాష, ప్రకృతి శాస్త్రములకు


ముఖ్యమంత్రి
శ్రీ రామకృష్ణరావు

సంబంధించిన ఉత్తమ గ్రంథములు ప్రకటింపబడినవి. గోలకొండ పత్రిక పక్షమున శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారు ప్రకటించిన "గోలకొండ కవుల సంచిక" తెలంగాణములోని ప్రాచీన, ఆధునిక కవుల విషయమును తెల్పు కవితాపుష్పము. ఆధునిక యుగమున 804 గురు కవుల కవిత లిందు గలవు. లక్ష్మణరావు పరిశోధకమండలి పక్షమున "తెలంగాణ శాసనములు" అను పేరుతో తెలంగాణములో నిర్దుష్టముగా విడుదలబడిన శాసన ప్రతిబింబములను సంపాదించి ఒక ఉద్గ్రంథమును ప్రకటించియున్నది. ఈశాసన సంపుటము చరిత్ర పరిశోధకులకు ఎంతయు నుపకరించుచున్నది. ఇంతమాత్రము దిక్ప్రదర్శనముగా చూపుచున్నాము.

### తెలుగు రచయితలు

ఆంధ్రోద్యమ సందర్భములో పెక్కురు కార్యకర్తలు ఉద్భవిల్లినట్లుగా ఇదివరలో మనవి చేసియున్నాము. వారందరు వివిధకార్యరంగములలో అహోఘముగా కృషిసలుపుచున్నారు. మూరాష్ట్రమంత్రులు శ్రీ బూర్గుల రామకృష్ణరావుగారు, శ్రీ కొండా వెంకట రంగారెడ్డిగారు, మా శీ మంత్రి శ్రీ వల్లూరి బసవరాజుగారు ఆంధ్రోద్యమ రణధీరులే. వ్యవసాయమంత్రి డాక్టరు చెన్నారెడ్డిగారు, ఆంధ్రసారస్వత పరిషదధ్యక్షులు, దేవులపల్లి రామానుజరావుగారు, వితత్పర కార్యదర్శి పులిజాల హనుమంతరావుగారు, గడియారం రామకృష్ణశర్మగారు, సర్వ వెంకటేశ్వరరావుగారు, మాటేటి రామప్పగారు మున్నగువారందరు విద్యాధికులు, ప్రజాసేవాధురీణులు. శ్రీ మాడపాటి వెంకట రమణాచార్యులవారిని ప్రత్యేకముగా ప్రశంసింపవలసియున్నది. శ్రీ వెంకటరమణాచార్యులవారు తెలంగాణ చరిత్ర పరిశోధనమందును, భాషాచరిత్ర పరిశోధనమందును మూర్తదర్శులయి పేరు గొందుచున్నారు. స్త్రీలలో ఎల్లా ప్రగడ సీతాకుమారిగారు, ఇల్లెందల సరస్వతీదేవిగారు, సంఘం లక్ష్మీబాయమ్మగారు, మున్నగువారు విద్యావతులు. తెలుగునందు రచనా పాటవము, వాక్పాటవము కలిగి శోభాయమానముగా ప్రజాసేవకరకార్యములందు మున్నలయి యున్నారు.

### మాతృభాషలో విద్యాబోధ

నిజాం ప్రభుత్వము వారి నిర్బంధ విద్యాప్రణాళిక నమలులోనుంచి ఆంధ్ర బాలురకు, బాలికలకు బాలశిక్ష మొదలు కొని తెలుగులో విద్యగఱపు సావకాశము లేకుండెను. సర్కారు వారి విద్యావిధానమును తిరస్కరించి శ్రీ హనుమంతరావుగారు బాలికల ఉన్నత పాఠశాలను స్థాపించిరి. ఈపాఠశాల 1200 బాలికలతో స్వతంత్ర...ముగా గొప్ప విద్యాదానము చేయుచున్నది. హైద్రాబాదులో బాలుర కొరకు, ఆంధ్ర విద్యాలయము హైస్కూలు స్థాపింపబడినది. జనగామలో, ఓరుగల్లులో మన వారు హైస్కూళ్లను స్థాపించియున్నారు. ఇప్పుడు అన్ని పాఠశాలలయందును ఆంధ్రబాలురకు, బాలికలకు ఆంధ్రభాషయందే విద్య గఱుపబడుచున్నది. ఇది యెంతయు సంతోషింపదగిన విషయము.

అంతయు ఉత్సాహభరితముగానే యున్నది. అంతయు సంతోషజనకముగా నేయున్నది. భాగ్యనగరములు ధనము సద్వినియోగము చేయుచున్నారు. ప్రజాసేవాగత్పరులుకూడ చాలమంది ప్రభవించియున్నారు. ఆయినను ఆంధ్రభాషకు మరియొకసారి దెబ్బ తగులునట్లుగా మాకు తోచుచున్నది. హిందీ ప్రచారము పులిమీద పుట్రగానున్నది. ఎనెన్ని ధర్మసన్నములు సలిపి సమాశ్వాసము చేయుచున్నను మాధ్యమునకు ప్రబల కారణములు గనుపడుచున్నవి. హిందూస్థానీ అను పేరుతో ఉర్దూకు చిరస్థాయి నిచ్చుటకు ఒక వంకను, హిందీకి పట్టాభిషేకము కట్టవలయునని మరియొక వంకను ప్రక్రియలు సాగుచున్నవి. ఉస్మానియా యూనివర్సిటీని హిందీ విశ్వవిద్యాలయముగా మార్చుటకు ప్రధాని సెక్రటరీగారు కృతనిశ్చయులయి యున్నారు. దానికి పునాదిగా ఉరూర హిందీ ప్రేమీమండలులు హిందీ ప్రచారక సభలు స్థాపితములగుచున్నవి. ఈ కార్యకలాపమంతయు ఆంధ్రులచేతనే చేయించుచున్నారు. "ఉత్త" లు తియారు అగుచున్నారు. విద్యా ప్రణాళికలో మాడవ తరగతి నుండియే హిందీని నిర్బంధము చేసినారుగదా!

హైద్రాబాదు రాష్ట్రము ఆంధ్ర, మహారాష్ట్ర, కర్ణాటక ప్రాంతముల కలగలపు రాష్ట్రము. వీరివీరి దృక్పథములు భిన్నముగా నుండుట సహజము. రాష్ట్రమునందు సగ భాగము తెలంగాణమే ఆవరించియున్నది. ఈ తెలంగాణ ప్రాంతపు నడిబొడ్డునందే హైదరాబాదు నగరము నెలకొనియున్నది. మరి దానికన్న హైద్రాబాదుమీద నే ఆంధ్రుల కెక్కుడు హక్కుగలదు. అయిన నేమి? ఆంధ్రులకు సహజరాజధానియయిన హైద్రాబాదు నగరము ఆంధ్రులకు చెందకుండ జేయుటకు మహాశపోము జరుగుచున్నది. అనుమానములు, అనర్థములు నిర్మూలనము చేయుటకు ఒక్కటే మార్గమున్నది. అది విశాలాంధ్ర నిర్మాణము, హైదరాబాదు రాజధాని నరణము. ఈ ఆశయ సిద్ధికై తెలంగాణ ఆంధ్రులు ఆయిలు చాచుకొనియున్నారు.



ఆంధ్రపత్రిక

# క్షామదేవత నుండి దక్షిణాపథాన్ని కాపాడిన సర్ ఆర్థర్ కాటన్

## ఆంధ్రులకు అన్నపూర్ణ సాక్షాత్కారం చేసిన ప్రముఖ ఇంజనీరు

సర్ ఆర్థర్ థామస్ కాటన్— దక్షిణాదివారికి చిరస్మరణీయుడు. ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఆయన చేసిన పనివల్ల ఈ నాటికీ తిండి లభిస్తోంది. ఆంధ్రదేశంలో సర్ కాటన్ నాలుగు ఆనకట్టలు నిర్మింపజేశాడు. తమిళనాడులో ఐదు నీటి వనరులను కల్పించి వ్యవసాయానికి తోడ్పాటు చేశాడు.

కాటన్ 15 మే 1808 నాడు ఆక్స్‌ఫర్డ్ దగ్గరలోవున్న ఉడ్ కోట్ లో జన్మించాడు. 1821 లో అసిస్టెంట్ ఇంజనీరుగా పనిచేయటానికి మద్రాసు వచ్చాడు. వచ్చినవెంటనే కంపెనీ అతన్ని కన్యాకుమారికి పంపారు. రామేశ్వర ద్వీపానికి భారతద్వీపకల్పానికి మధ్యవున్న పాంబం కాలువను లోతు చేయాలని ఒక సూచన చేశాడు— అలా చేస్తే ఆ కాలువగుండా పెద్ద పెద్ద ఓడలు పోగలుగుతాయి. కాని అనాడు కంపెనీ యజమానులు ఖాతరు చెయ్యలేదు. 1824 లో బర్మాయుద్ధంలో పనిచేసివచ్చినాక, 1828 లో దక్షిణ భారతదేశంలో నీటి వసతులను కల్పించటానికి, అభివృద్ధి చేయటానికి కాటన్‌ను నియమించారు. దక్షిణ భారతదేశంలో గోదావరి, కృష్ణ, పెన్న, కావేరి, పాలార్, చేయ్యార్ మొదలైన అనేక నదులున్నా, తరుచు వానలు రాకపోవటం, ఘోరమైన కాటకాలు రావటం, ప్రజలు వేలకు వేలుగా నశించటం పరిపాటి అయిపోయింది.

### జల వినియోగం

కాటన్ మొదట కావేరి, కొలరూన్ నదులపైన ఆనకట్టలు నిర్మించటానికి పూనుకున్నాడు. కావేరినదికి పూర్వపు రాజులు అక్కడక్కడా అడ్డుకట్టలు నిర్మించి కొంతపని చేశారు. కావేరి కొంత మేరకు ప్రవహిస్తుంది. అందువల్ల ప్రవాహంనుంచి నీటిని కాలవల్లోకి మళ్ళ చేయటానికి వీలుగా ఉంటుంది. కాని బాగా వరదలు వచ్చినప్పుడు డెల్టా ప్రాంతంలో గట్లు తెగిపోతుండేవి. లేక నీరంతా మిగిలిన పాయలలోకి పోకుండా కొలరూన్‌లోకి ప్రవహించేసేది. కాటన్—కావేరిపైన ఒక ఆనకట్ట, కొలరూన్ నదిపైన కావేరి సమీపంలో మరొక ఆనకట్ట, కట్టాలని సూచించాడు. తత్ఫలితంగా కావేరి నీరు కొలరూన్‌లోకి పూర్తిగా జాలువడిపోకుండా అడ్డం ఏర్పడింది. పైగా తిరుచ్చిరపల్లి, తంజావూరు జిల్లాలకు పుష్కలంగా నీరు లభించింది. ఇది గాక, మరో 70 మైళ్ళ దిగువన కొలరూన్‌కు ఇంకో ఆనకట్టను కట్టి దక్షిణ ఆర్కాటు జిల్లాకు నీటి వసతి కలగజేశాడు. ఈ నిర్మాణాలు 1836 లో పూర్తి అయ్యాయి. 1887 లో తిరిగి వానలు లేకుండాపోయాయి— కాని ఆ ప్రాంతంలో క్షామంమాత్రం రాలేదు.

### గోదావరి ఆనకట్ట

గోదావరిపైన రాజమండ్రిదగ్గర ఆనకట్ట కట్టటానికి పథకం 1845 లో తయారుచేసి మద్రాసు ప్రభుత్వానికి సమర్పించాడు, కాటన్. అప్పుడు ఆ ప్రాంతాన్ని రాజమండ్రిజిల్లా అనేవారు. అప్పటికి రాజమండ్రిజిల్లా ఒక క్షామంనుంచి కొత్తగా బయటపడి ఉంది— పోయినవారు పోగా మిగిలినవారు అప్పులతో మిగిలియున్నారు. ప్రతివారూ శిస్తుబకాయిలు చెల్లించుకోవలసినవారే. [illegible] చెరువుల క్రింది సేద్యం మండలంనుంచి పుష్కలమైన గోదావరి ప్రవాహం పొర్లుతున్నా, ప్రజలకు నీటి కరువు తప్పదు. కాని గోదావరి, కావేరి కొలరూన్ లలాగా చిన్నదికాదు. ఆనకట్ట కట్టాలనుకున్న చోటనే దానివెడల్పు 6487 గజాలు— అయితే మధ్యలో మూడు లంకలు ఉండటంవల్ల, నిర్మించాల్సిన ఆనకట్ట పొడవు 4946 అడుగులయింది. అయినా అది చాలా పెద్దపనుకే, పైగా కావేరీనదిలాగా, గోదావరినదికి పెద్ద కట్టలులేవు— కావేరి ప్రాంతంలో అనాదినుంచి కాలవలున్నాయి— గోదావరి ప్రాంతంలో లేవు. గోదావరి పొంగిందా మండలం సగం జలాక్రాంతమైపోతుంది. కాటన్‌కు కావేరి కొలరూన్‌లమీద ఆనకట్టలను నిర్మించటం ఆటగా కనిపించింది, గోదావరి చేతి నిండా పని ఇచ్చింది. గోదావరి ఆనకట్ట 1847 లో ప్రారంభించారు — [illegible] నిర్మాణం [illegible]. ఒక సెంప ఆన కట్టను కట్టుంటే, ప్రజలు ఉత్సాహంతో కాలవలు తవ్వేవారు— [illegible] ప్రజలు సంతోషంలో పనిచేశారు. అంతే— గోదావరి ప్రాంతంలో కాటకం మాయమైంది. ప్రజలకు తిండి, ప్రభుత్వానికి శిస్తులద్వారా ఆదాయం సమకూరాయి.

### విజయవాడవద్ద కృష్ణకుఆనకట్ట

ఇదే సమయంలో కృష్ణానదిపైన బెజవాడదగ్గర ఆనకట్ట నిర్మాణానికి కాటన్ తోడ్పాటు చేశాడు. సర్ హెన్రీ అడ్వెల్ లేక్ అనే ఇంజనీరు ఇంతకుముందే దీనికి సంబంధించిన పథకం తయారుచేశాడు. కాటన్ ఈ పథకం బాగా పరిశీలించి తన సలహాలను ఇచ్చాడు. కొంతకాలం సర్ లేక్, ఆ తర్వాత కాటన్ శిష్యుడు చార్లెస్ ఆర్ కృష్ణ ఆనకట్ట నిర్మాణానికి నాయకత్వం వహించారు. కృష్ణ ఆనకట్ట నిర్మాణం, గోదావరి ఆనకట్ట నిర్మాణంతో పోటీపడటానికి కాటన్ పురమాయింపు ఎంతో పనిచేసింది. లేకుంటే, దీని నిర్మాణం, గోదావరి ఆనకట్ట నిర్మాణానంతరం కొన్ని ఏళ్ళకుగాని అయ్యేదికాదు.

ఇదే విధంగా ఆ తర్వాత నెల్లూరు వద్ద పెన్నపైన, పాలార్, చేయార్, పెల్లార్ నదులపైన ఆనకట్టల నిర్మాణానికి సర్ కాటన్ కృషిచేశాడు. గోదావరి, కృష్ణ, కావేరి నదులపైన కట్టిన నిర్మాణాలంత ముఖ్యమైనవి కాకున్నా, ఈ చిన్న నదులపై ఆనకట్టలు స్థానిక ప్రజల తిండి సమస్యను తీర్చాయి. మధుర జిల్లాకు అత్యంత లాభకారిగా పరిణమించిన పెరియార్ ప్రాజెక్టును కూడా సర్ కాటన్ తన కాలంలో ప్లాను వేసి ఉంచాడు.

### "దొక్కల కరువు"

1877 సంవత్సరంలో మద్రాసు రాష్ట్రంలో పెద్ద క్షామం వచ్చి దాదాపు 40 లక్షలమంది మరణించారు. కాని పై నీటి వసతులే లేకుంటే ఇంకా ఎంతోమంది ఛనిపోయేవారు. నీటి వసతులున్న ప్రాంతంలో కరువు లేనే లేదు — ఈ ప్రాంతాలనుంచి కరువు ప్రాంతాల్లో కొన్ని చోట్లకు 80 లక్షల మందికి ఆహారం పంపించారట.

### కృష్ణపై మరొక ఆనకట్టకు ఆలోచన

సర్ కాటన్ 1852 లోనే పదవీ విరమణ చేశాడు. కాని తర్వాత చాలా సంవత్సరాలవరకు ఇంజనీరింగ్ సలహాదారునిగా పనిచేస్తూనే వచ్చాడు. కృష్ణపైన కర్నూలు దగ్గర ఆనకట్ట కట్టాలని చాలా కాలంగా ఆశిస్తూ వచ్చాడు. కాని అతని ఉద్యోగకాలంలో అది జరగలేదు. ఉద్యోగ విరమణ తర్వాత, కర్నూలు దగ్గర ఆనకట్ట కట్టటానికి ప్లానులు అతనికి పంపబడ్డాయి. వాటిని బాగా పరిశీలించి సరిదిద్ది తగు సలహాలిచ్చాడు. దాని నిర్మాణంలో బాగా శ్రద్ధవహించాడు. కాని ఏమిలాభం. కర్నూలుదగ్గర (సుంకేసుల) కట్టిన ఆనకట్టను ప్రజలు సరిగా ఉపయోగించుకోలేదు. వానలు పడినప్పుడల్లా, కాలవనీటిని ఉపయోగించటం మానేసేవారు. పైగా చుట్టుప్రక్కల భూమి కూడా అంత మంచిది కాకపోవటం వల్ల నీటిని ఉపయోగించుకోటంలో ప్రజలు ఉత్సాహం చూపలేదు. అధికారులు నీటి ఉపయోగావసరాన్ని గురించి ప్రజలకు బాగా తెలియచెప్ప లేకపోయారని సర్ కాటన్ విచారపడ్డాడు.

### నదులన్నింటినీ కాలవలద్వారా కలపడానికి ఆలోచన

కాటన్‌కు ఒక కోర్కె జీవితాంతం వరకు బాధించింది— అదేమంటే, భారతదేశంలో ఉండే నదులన్నింటిని కాలవలద్వారా కలపవచ్చు— ప్రయాణ సౌకర్యాలుకూడా కలగజేయవచ్చు అని కాటన్ నమ్మకం. చాలా సంవత్సరాలలో దీన్ని గురించి తన ప్లానును తెలియజేశాడు. భారతదేశంలో నదుల నీటిని కాలవలకు పెట్టి, వ్యవసాయ సౌకర్యాలేగాక ప్రయాణ సౌకర్యాలు కూడా కల్పించవచ్చని అతను చేసిన సూచన కొంతవరకు బ్రిటిషు ఇంజనీర్ల అపహాస్యానికి గురి అయింది. అతని బుర్రలో నీళ్ళు చేరాయని ఆక్షేపించారు. అతనికి సంపూర్ణ స్వాతంత్ర్యం ఇచ్చినట్లయితే అంత పనీ చేసేవాడే. కాటన్ ఉద్యోగ విరమణచేసిన తర్వాత భారతదేశంలో వచ్చిన క్షామాలను చూసి, రాజప్రతినిధి కర్జన్, కాటన్ సూచనలను అనుసరించినట్లుంటే ఇంత బాధ ఉండేదికాదని ప్రకటించాడు.

### దేశభాషలలో ప్రవేశం

కాటన్‌కు 1861 లో "సర్" బిరుదమిచ్చారు. తర్వాత 1866 లో కె. సి. యస్. ఐ. అనే బిరుదం ఇచ్చారు. కాని అతనికి భారతదేశంలో నీటి వసతులు ఇంకా బాగా నిర్మించవచ్చుగదా అనే విచారం జీవితాంతం పట్టి పీడిస్తూనే ఉంది. 1877 లో తిరిగి జన్మస్థలమైన ఉడ్ కోట్ చేరుకుని అక్కడే నివాసం ఏర్పరచుకున్నాడు. సైన్యంలో ఆయనకు జనరల్ పదవి ఉండేది. సైన్యంతో సంబంధం [illegible] వ్యవసాయానికి [illegible] తమిళం, తెలుగు, ఉర్దూ భాషలలో సొంతంగా "అవసర పదకోశాలు" వ్రాసుకున్నాడు. వివిధ భాషాజ్ఞాన సముపార్జనలో కాటన్‌కు చాలా శ్రద్ధ [illegible]. పైగా ఉన్న ఒక్క కోరికా తీరకపోయాడు. 24 జూలై 1899 నాడు అనాయాసంగా మరణించాడు. ఆయన మరణానంతరం ఆయన భార్య ఎలిజబెత్‌కు సంవత్సరానికి 350 పౌన్ల పింఛను బ్రిటిష్ ప్రభుత్వం మంజూరు చేశారు.

సర్ ఆర్థర్ కాటన్— తెలుగు వారికి అన్నపూర్ణ సాక్షాత్కారం గావించాడు. వందనీయుడు.

# విశ్వవిఖ్యాతి గాంచిన కోహినూరు వజ్రాన్ని కన్న "రత్నగర్భ"

## విశాలాంధ్ర సహజ సంపద: శ్రీ మహదేవన్ సమగ్ర సమీక్ష

ప్రస్తుత మద్రాసు రాష్ట్రంలోని ఆంధ్రప్రాంతాలు, హైదరాబాదు సంస్థానంలోని తెలంగాణా జిల్లాలు, మైసూరు సంస్థానంలోని కోలారు, తుంకూరు, బెంగుళూరు జిల్లాలలోని కొన్ని భాగాలు, ఒరిస్సా రాష్ట్రంలోని గంజాం కోరాపుట్టు జిల్లాలలోని కొన్ని భాగాలు, బస్తరులో చాలాభాగం, చాందా జిల్లాలోని సిరోంచాలను కలిపి విశాలాంధ్ర అని చెప్పవచ్చు. ఒకే సంస్కృతి, భావాలు అములులోనున్న ఈ ప్రాంతమంతా సహజసంపదదృష్ట్యా భారతదేశంలో ఆర్థిక సంపన్నమైన భాగాలలో ఒకటి. విశాలాంధ్రలోగల లోహవస్తు సంపదను, దాని నభివృద్ధి చేయగల పరిశ్రమలను గురించి ఈ వ్యాసంలో కొంతవరకు పరిశీలించుదాం. ఆయా ఖనిజాల అభివృద్ధికి వినియోగపడే పరిశ్రమలను గురించికూడా యీ వ్యాసంలో ప్రస్తావించబడుతుంది.

ఒక ప్రాంతంలోని శిలాస్వభావానికి ఆ ప్రాంతంలో దొరికే ఖనిజాలకు పరస్పర సంబంధం వున్నది గనుక ఒక ప్రాంతంలో దొరికే ఖనిజాలు పూర్తిగా తెలుసుకోవటానికి ఆ ప్రత్యేక ప్రాంతంలో భూమితత్వం గురించి తెలుసుకోవడం అవసరం.

### ధర్వార్ శిలలు

విశాలాంధ్రలో ఏర్పడిన శిలలలోకల్లా ధర్వార్ శిలలు పురాతనమైనవి. ఆర్థికంగా లాభదాయకమైన లోహాలకు ధర్వార్ కొండలు [illegible] లనటంలో అతిశయోక్తిలేదు. చిన్న చిన్న గుట్టలుగా ఈ కొండలు ఈ ప్రాంతమంతా కనిపిస్తవి. ఇండియాలో వుత్పత్తి అయ్యే బంగారంలో ఎక్కువభాగం దొరికే కోలారు గనులు ఈ ప్రాంతంలోనే వున్నవి. కోలారు గనులు ప్రపంచ విఖ్యాతి చెందినవి.

ఈ కొండలు ఈశాన్యంగా వ్యాపించి గూడూరు ప్రాంతంలో కూడా కనిపిస్తున్నవి. ఈ ప్రాంతంలోనే గూడూరులోని మైకాగనులు, కరిమినిపెంటలోని రాగిగనులు వున్నాయి.

హైదరాబాదు సంస్థానంలోని రాయచూరు జిల్లాలో 'షిస్ట్' సంబంధమైన శిలలు ఎక్కువున్నాయి. ఈ శిలలలో పొరలు కనిపిస్తవి. హట్టి, మస్కి, తోపులదొడ్డి, గద్వాయిలలోని బంగారు గనులన్నీ ఈ శిలాసంబంధమైనవే. కరీమ్ నగరులో కూడా 'షిస్ట్' సంబంధపు శిల కనిపిస్తున్నటు తెలుస్తున్నది. అనంతపురం, బళ్ళారి ప్రాంతాలలోకూడా ధర్వార్ శిలలు బాగా అభివృద్ధిచెందినవి. అనంతపురం జిల్లాలోని బంగారు గనులను పూర్వం కొంతకాలంపాటు విదేశస్థులు బాగా అభివృద్ధి చేశారు. బళ్ళారి జిల్లాలోని ధర్వార్ కొండలలో మంగనీసు, ఇనుముగనులు కనిపిస్తాయి.

బస్తర్ జిల్లాలోని శైలదిల కొండల వెంట ధర్వార్ శిలలో ముఖ్యభాగం కనిపిస్తుంది. ఇండియాలో ఇనుము దొరికే ప్రాంతాలలోకల్లా గొప్ప వాటిలో ఇదొకటి. సుమారు 6,000 మిలియన్ల టన్నుల ఇనుము దొరికే మిశ్రమం ఈప్రాంతంలో వున్నట్లు అంచనా వేస్తున్నారు.

సర్కారు జిల్లాలలోని తూర్పు కనుమలలో కనిపించే శిలలుకూడా ధర్వారుశిలల జాతికే చెందినవి అని ఇప్పుడిప్పుడు స్పష్టమవుతున్నది. ఈ శిలలలో మాంగనీస్, ఇనుము, మైకా, గ్రాఫైట్లవంటి లాభదాయకమైన లోహపుగనులు ఉన్నవి.

### గ్రానైట్లు

విశాలాంధ్రలో గ్రానైట్ కొండలు ఎక్కువగా కనిపిస్తవి. వీటిలో అందమైన గ్రానైట్లు ఎక్కువున్నవి. డబ్బు సంపాదించడానికి వినియోగపడే లోహాలు ఈ కొండలలో వున్నట్లు తెలియదు కాని, అలంకరణకు వినియోగపడే వస్తువు ఎక్కువున్నాయి. ఉస్మానియా విశ్వవిద్యాలయం భవనాలు, హైకోర్టు భవనాలు ఈ వస్తువులతోనే అలంకరింపబడ్డాయి.

### "పురానాలు"

ధర్వార్ శిలల తరువాత విశాలాంధ్రలో పురానాలు అని పిలువబడే శిలలు పురాతనమైనవి. సర్ థామస్ హాలెండ్ వీటికి ఈ పేరు పెట్టాడు. వరంగల్లు జిల్లాలో వీటిని "పాఖాల్స్" "కుడ్డపాలు" అంటారు. తెలంగాణా ఈశాన్యప్రాంతంలో "పెంగంగాస్" అంటారు. ఇవన్నీ ఒకేజాతి శిలలు. సున్నపురాయి, [illegible] మొదలైనవి నీటిలో గడ్డకట్టినందున ఇవేర్పడ్డాయి. బంగనపల్లిలోని కర్నూలు శిలలలో ప్రపంచ విఖ్యాతిగాంచిన గోల్కొండ వజ్రాలు దొరుకుతాయి. ఈరకపు కొండలున్న ప్రాంతంలో సిమెంటు తయారుచేయడానికి వినియోగపడే సున్నపురాయి, ఇండ్లలో పరిచేందుకు వినియోగపడే రాళ్ళు, ఇంటి పైకప్పులకు వినియోగపడే రాళ్ళు పుష్కలంగా లభిస్తాయి. మనందరికీ పరిచితమైన కడపపలకలు ఈ శిలాజాతివే. రాయలసీమలో ఈ కొండలలో బరైట్లు, ఆస్‌బెస్‌టాస్‌లవంటి లాభదాయకమైన వస్తువు లున్నవి. [illegible] ప్రదేశాలలో ఇవి పుష్కలంగా దొరుకుతున్నాయి.

### గండ్వానా శిలలు

పోతే విశాలాంధ్రలో కనిపించే శిలలలో గండ్వానా శిలలు ముఖ్యమైనవి. ప్రాణహితగోదావరిమైదానంలో సుమారు 50 మైళ్ళ పొడుగున అనేక మైళ్ళ పర్యంతం ఈ శిల లున్నాయి. హైదరాబాదు సంస్థానంలోని కాలరీలు, మధ్యప్రదేశ్‌లోని కాలరీలలో ఎక్కువభాగం ఈ ప్రాంతంలోనే వున్నాయి. ప్రస్తుతం హైదరాబాదు సంస్థానంలోని కొత్తగూడెం, బెల్లంపల్లి ప్రాంతాలలో మాత్రమే బొగ్గు త్రవ్వబడుతున్నప్పటికీ తూర్పు పశ్చిమ గోదావరి జిల్లాలలో ఇంకా అనేక ప్రదేశాలలో బొగ్గు పుష్కలంగా దొరుకుతుందని రుజువైంది.

రాజమండ్రి, తంగుడి, పశ్చిమ గోదావరిజిల్లాలో కొవ్వూరుకు ఉత్తరాన దక్కనుశిలలు కనుపిస్తాయి. వీటిలో దొరికే వాటిలో మున్నం, 'ఏగెట్లు' ముఖ్యమైనవి.

### ధనార్జనకు వినియోగపడే లోహాలు

ఆస్‌బెస్‌టాస్ స్వచ్ఛమైన సన్నని పొరలుగల పదార్థాన్ని ఆస్‌బెస్‌టాస్ అంటారు. ఈ పొరలు నిప్పులో కాలిపోవు. వాటిని తాళ్ళుగాకూడా పేనుకోవచ్చు. యుద్ధకాలంలో సైనికావసరాలకు ఆస్‌బెస్‌టాస్ చాలా వినియోగపడ్డది. విద్యుచ్ఛక్తి సప్లయికి ఇది బాగా ఉపయోగపడుతుంది. భవన నిర్మాణాలకు ఆస్‌బెస్‌టాస్ సిమెంటు చాలా అవసరం. రసాయనాలను వడపోసే యంత్రాలు, బాయిలర్లు మొదలైన వాటిలోకూడా ఆస్‌బెస్‌టాస్‌ను ఉపయోగిస్తారు. రాయలసీమలో పలుప్రదేశాలలో ఆస్‌బెస్‌టాస్ దొరుకుతుంది. కడప జిల్లాలోని చిన్నకుడల, పులివెందల, బ్రహ్మణపల్లె వాటిలో ముఖ్యమైనవి. అనంతపురం, కర్నూలు జిల్లాలలోకూడా ఇది కొంతవరకు దొరుకుతుంది.

బరైట్లు. ఇది తెల్లగా, సన్నని దారాలుగా వుంటుంది. బేరియమ్ గంధకంతో కలిస్తే బరైట్ ఏర్పడుతుంది. బేరియమ్‌తో తయారుచేసే రసాయనాలన్నిటికీ ఈ లోహం కావలసిందే. చిచ్చుబాంబులు మొదలైనవి తయారుచెయ్యడానికి యుద్ధకాలంలో ఇది ఉపయోగపడ్డది. సిరామిక్, ఉక్కుపరిశ్రమలలో బేరియమ్ మిశ్రమంకు వాడతారు. కొన్ని ప్రత్యేక లోహమిశ్రమములలో కూడా దీని నుపయోగిస్తారు. కాగితం, రంగులు, రబ్బరు, నూనెలు, వస్త్రాలు, ప్లాస్టికులు మొదలయిన పరిశ్రమలలో దీని ఉపయోగం ఎక్కువ.

కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలలోని అనేక ప్రదేశాలలో బరైట్ దొరుకుతుందని రుజువైంది. ఈ ప్రదేశాలలో ముచ్చుకోట, పంజిపురం, ఇప్పట్ల, వేంపల్లి మొదలైనవి ముఖ్యమైనవి. వేంపల్లి సున్నపురాళ్ళలో ఈ లోహం ఎక్కువగా వున్నది.

బాక్సైట్ : ప్రాణవాయువు అల్యూమినమ్‌తో కలిసినప్పుడేర్పడే లోహమిశ్రమాన్ని బాక్సైట్ అంటారు. పరిశ్రమల అభివృద్ధికి ఇది చాలా అవసరం. ప్రపంచంలో దొరికే అల్యూమినంలో ఎక్కువ భాగం ధాతువుగా తయారు చేయుబడుతున్నది. యుద్ధంలోను, మామూలు కాలంలోనుకూడా యీ ధాతువును దొరికిన దాన్ని దొరికినట్లు ఉపయోగించుకోవచ్చు. అల్యూమినమ్ లవణాల వుత్పత్తి పరిశ్రమలో యిది ఉపయోగపడుతుంది. లోహాల పరిశోధనకు ఇది ఎక్కువ ఉపయోగపడుతుంది. రంగులు, అద్దకం, పెట్రోలు పరిశుద్ధి పరిశ్రమలలో కూడా బాక్సైట్‌ను ఉపయోగిస్తారు.

విశాలాంధ్రలో ఉభయ గోదావరి జిల్లాలలోని కొండలలోను, కోరా

(40 వ పేజీ చూడుడు)

తుంగభద్ర ప్రాజెక్టు

# రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి అత్యంతావశ్యకమైన విద్యుచ్ఛక్తిసంపద

శ్రీ
బి. ఆర్. సోమయాజులు
చీఫ్ ఇంజనీర్ ఎలెక్ట్రిసిటీ.

కృష్ణా, గోదావరి, పినాకినీ (పెన్న) నదులు, వాటి ఉపనదులనేకం ఉండడంవల ఆంధ్రదేశంలో నీటికి కొదువలేదు. దక్షిణాది నదులన్నింటికన్నా గొప్పదైన గోదావరి, అరేబియా సముద్రానికి 50 మైళ్ళ యీవలగా, పశ్చిమ కనుమలలో పుట్టి, ఆగ్నేయదిశగా 987 మైళ్లు ప్రవహించి, బంగాళాఖాతంలో కలుస్తున్నది. బొంబాయి, మధ్యప్రదేశ్, హైదరాబాదు, ప్రస్తుత మద్రాసు రాష్ట్రంలోని మొత్తం 160300 చదరపు మైళ్ళ విస్తీర్ణంలో కురిసిన వర్షపు నీరంతా యీ నదిలోకి ప్రవహిస్తుంది. గోదావరి తరువాత, చెప్పుకోతగిన పెద్దనది కృష్ణకూడా మహాబలేశ్వరము వద్ద పశ్చిమకనుమలలో [illegible], 775 మైళ్లు ప్రవహించి, బంగాళాఖాతంలో కలుస్తున్నది. మైసూరు, బొంబాయి, హైదరాబాదు, మద్రాసు రాష్ట్రములలో 97 050 చదరపు మైళ్ల విస్తీర్ణంలో కురిసినవర్షపునీరంతా యీ నదిలోకి ప్రవహిస్తుంది. ఆంధ్రదేశంలో, యీ రెంటి తరువాత చెప్పుకోదగినది పెన్న. 20 వేల చదరపు మైళ్ళ విస్తీర్ణంలో కురిసిన వర్షపు నీరు యిందులో కలుస్తుంది. ఈ మూడునదులు వీటి ఉపనదులవల్ల, లక్షలాది ఎకరాలభూమిని సస్యశ్యామలం చేయగలగడమేగాక, రాష్ట్రానికి అవసరమైన విద్యుచ్ఛక్తినిగూడా ఉత్పత్తి చేసుకోవచ్చు.

ఈ నదులపై ప్రస్తుతం కొన్ని హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులు నిర్మింపబడుతున్నవి మరికొన్ని దర్యాప్తులో ఉన్నవి. వీటన్నిటిని పరిశీలించినట్లయితే యీ నదులపై హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులవల్ల, ఎంత విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేసుకోగలిగినదీ స్పష్టం కాగలదు.

### నిర్మాణంలో ఉన్న ప్రాజెక్టులు

మాచ్‌ఖండ్ ప్రస్తుతం నిర్మాణంలో ఉన్న హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులలో, ముఖ్యమైనది మాచ్‌ఖండ్ ప్రాజెక్టు. మాచ్‌ఖండ్ గోదావరి ఉపనది. ఒరిస్సా ఆంధ్రరాష్ట్రముల సరిహద్దున దుడుమా జలపాతంవద్ద యీ ప్రాజెక్టు నిర్మింపబడుతున్నది. ఇక్కడ 850 అడుగుల ఎత్తున నీటిని నిల్వచేయుటకు అవకాశం లభించింది. విద్యుదుత్పాదక కేంద్రం విశాఖపట్నానికి 125 మైళ్ళ దూరంలో ఉన్నది. ఈ ప్రాజెక్టు పూర్తిఅయితే, ఇందువల్ల 10,2000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి లభిస్తుంది. మొదటి దశలో ఒక్కొక్కటి 17 000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయగల మూడు యూనిట్లు యేర్పాటు చేయబడతవి.

(38వ పేజీ చూడుడు)

మాచ్‌ఖండ్ ప్రాజెక్టు

# రాష్ట్రసర్వతోముఖాభివృద్ధికి అత్యంతావశ్యకమైన విద్యుచ్ఛక్తి

87 వ పేజీ కొరవ

జలపుట్ ప్రోజెక్టు రిజర్వాయరు 1955 నుండి పని ప్రారంభిస్తుంది. మాచ్‌ఖండ్ విద్యుచ్ఛక్తి ఆంధ్రదేశంలో, శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు, పడమటి గోదావరిజిల్లాలు, కృష్ణా గుంటూరుజిల్లాలకు సరఫరా చేయబడుతుంది 290 మైళ్ల పొడవున 132 కె. వి. డబుల్ సరూ్క్యట్ ట్రాన్స్‌మిషన్ లైన్లు, విద్యుచ్ఛక్తి పంపిణీకి లోడ్ సెంటర్లవద్ద అనేక సబ్ స్టేషన్లు యేర్పాటుచేయబడినవి ఈ హైడ్రో ఎలెక్ట్రిక్ స్కీముకు 12 88 కోట్లు ఖర్చవుతుంది. ఈ ఖర్చు 10 ఏళ్లలో 14 55 కోట్లకు పెరుగుతుంది

తుంగభద్రా ప్రాజెక్టు.— ప్రస్తుతం నిర్మాణంలోఉన్న తుంగభద్ర హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టుకు హంపీ పేట అనకట్టవద్ద ఒక పవర్ స్టేషన్, 15 మైళ్ళ దూరంలో మెయిన్ కాల్వ వద్ద మరొక పవర్ స్టేషన్ను నిర్మింపబడినవి. ప్రారంభకలో 27 వేలు, అంతా పూర్తిఅయిన తరువాత నికరంగా 68 000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పన్నమౌతుంది విద్యుత్ప్రసారానికి 750 మైళ్ళ పొడవున, 66 కె. వి. 11 కె వి వోల్టేజిగల హై టెన్షన్ లైన్లు, వేయడమౌతుంది. ఈ ప్రాజెక్టునుండి ఉత్పన్నమయ్యే విద్యుచ్ఛక్తి, బళ్లారి, అనంతపురం, కర్నూలు, కడపజిల్లాలకు వినియోగింపబడుతుంది. బళ్లారిజిల్లా మైసూరుకు చెందడంతో రమారమి 30 70 దామాషాలో మైసూరు ఆంధ్ర రాష్ట్రాలు యీ విద్యుచ్ఛక్తిని పంచుకొంటాయి ఈ విద్యుత్ స్కీముకు మొత్తం ఖర్చు 7 80 కోట్లు మరో పదేళ్లలో యీ ఖర్చు 8 కోట్లరూపాయలదాకా పెరుగుతుంది. పవర్ స్టేషనులకు కావలసిన యంత్రాలు, ట్రాన్స్‌మిషన్ లైన్లు వేయడానికి సబ్ స్టేషన్లు నిర్మించడానికి కావలసిన సాధన సామాగ్రి ఆర్డరు యివ్వబడింది. 1956 లో సంవత్సరాంతంలోగాని, 1957 లో ఆరంభంలోగాని విద్యుచ్ఛక్తి ఉత్పత్తి ప్రారంభమౌతుంది.

## దర్యాప్తులోఉన్న హైడ్రోఎలెక్ట్రిక్ ప్రాజెక్టులు

శైలేరు.— ఇది మాచ్‌ఖండ్ నదికి మరొక పేరు మాచ్‌ఖండ్ నదికి దిగువన, ఆ నదిని శైలేరు అని వ్యవహరిస్తారు. ఒరిస్సాకు, ఆంధ్రకు ఉమ్మడి సరిహద్దుగా ఉన్నది. మాచ్‌ఖండ్ ప్రాజెక్టువిషయంలో, ఒరిస్సా, మద్రాసు ప్రభుత్వాలు, కుదుర్చుకొన్న ఒడంబడిక షరతుల ప్రకారం, ఈ నదిని వినియోగించుకొనే హక్కు మద్రాసు ప్రభుత్వానికి (యిప్పుడు ఆంధ్ర ప్రభుత్వానికి) యివ్వబడింది శైలేరు స్కీముక్రింద మూడు విద్యుదుత్పాదక కేంద్రాలు నిర్మించవచ్చు ఎగువన (42 000 కిలోవాట్లు) మధ్యన (44000 నుండి 19000 కిలోవాట్లు) దిగువన (105 000) మొత్తం 1 91 000 నుండి 1 66 000 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పన్నం అయ్యే అవకాశం ఉన్నది

రామపాదసాగర్ :— (బహుళ ప్రయోజనాత్మకమైన ప్రాజెక్టు) ఈ ప్రాజెక్టుకు 6 600 అడుగుల పొడవున డాము, రెండు భాగాలుగా కట్టబడి ఉన్నది. ఈ రెండుభాగాలకు మధ్యన సహజసిద్ధమైన ఒక కొండ ఉన్నది అట్టడుగు పునాదినుంచి డాము ఎత్తు 458 అడుగులు 27 50 000 ఎకరాల పరిభూమికి నీరు సరఫరా చేయడానికి ప్రస్తుతం కృష్ణా, గోదావరి నదుల ఆయకట్టుగాఉన్న 21 లక్షల ఎకరాల భూమికి నీటి సరఫరా అభివృద్ధి చేసేందుకు ఈ ప్రాజెక్టు సంకల్పింపబడింది. ఈ ప్రాజెక్టునుండి, హెచ్చు తగ్గులేక సమప్రమాణంలో(స్థిరం) 150000కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని చౌకగా ఉత్పత్తి చేసుకోవచ్చు ఈ ప్రాజెక్టువల్ల సాగు వ్యవసాయాభివృద్ధి, చౌకగా విద్యుచ్ఛక్తి ఉత్పత్తిగాక, గోదావరి పొంగకుండా నివారించవచ్చు ఈ ప్రాజెక్టు దర్యాప్తు అయిందిగాని ప్రారంభింపబడలేదు.

శబరి — శబరి గోదావరి పెద్ద ఉపనదులలో యిది ఒకటి భద్రాచలానికి ఎగువన 80 మైళ్ళ దూరంలోఉన్న కూనవరందగ్గర గోదావరిలో కలుస్తుంది గోదావరి డెల్టాలో మొదటి పంటకు పుష్కలంగా నీరు సరఫరా చేయడానికేకాక, అదనంగా మరో 8 లక్షల ఎకరాలను రెండవపంట క్రిందికి తెచ్చుటకు, యీ నదిపై అనకట్ట కట్టాలని ఒక స్కీమును తయారు చేసి, ఇరిగేషన్ శాఖవారు దర్యాప్తు చేశారు ఈ స్కీము అమలు జరిపినట్లయితే 8500 కిలోవాట్ల సమప్రమాణపు విద్యుచ్ఛక్తి నీటి విడుదల తక్కువగా ఉన్నంతకాలంలో 4 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి, రిజర్వాయరునుండి ఉత్పత్తిచేస్తే సావకాశం ఉంటుంది

కృష్ణా పెన్నారు ప్రాజెక్టు :— ఈ ప్రాజెక్టుక్రింద, కృష్ణానదిపై సిద్ధేశ్వరం వద్ద, పెన్నానదిపై సోమేశ్వరంవద్ద రెండు రిజర్వాయర్లు కట్టాలని సంకల్పింపబడింది. మొదటి రిజర్వాయరు 73 మిలియన్ వాట్లు, రెండవది 120 మిలియన్ వాట్లు విద్యుచ్ఛక్తి ఉత్పత్తిచేయగలవని అంచనా వేయబడింది. ఈస్కీములో చాలామార్పులు వచ్చాయి. సిద్ధేశ్వరం రిజర్వాయరు ఎత్తు తగ్గించాలని ఆలోచనలోఉన్నది. కృష్ణానదికి దిగువన నందికొండవద్ద ఒకటి, పులిచింతలవద్ద మరొకటి, రిజర్వాయర్లు కట్టాలని ఆలోచనలో ఉన్నది. ఈ మూడు రిజర్వాయర్లు సిద్ధేశ్వరం, నందికొండ, పులిచింతలవల్ల 100 మిలియన్ వాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పన్నమౌతుంది ఈ ప్రాజెక్టు విషయంలో యింకా యిదమిత్థమైన నిర్ణయమే జరుగకపోవడంబట్టి, ఎంత విద్యుచ్ఛక్తి ఉత్పత్తికాగలదో, నికరంగా అంచనా వేయలేదు.

శ్రీశైలం — సిద్ధేశ్వరానికి దిగువన శ్రీశైలంవద్ద కృష్ణానదిపై హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టుల నిర్మాణానికి చక్కని స్థలం ఉన్నది. అయితే ఎగువన సిద్ధేశ్వరంవద్ద దిగువన నందికొండవద్ద రెండు ప్రాజెక్టులు నిర్మించాలనే ఆలోచన ఉండడంబట్టి, యీ ప్రాజెక్టునిర్మాణం జరుగకపోవచ్చు.

తుంగభద్ర హైలెవెల్ కాలువ - తుంగభద్ర రిజర్వాయరు నుంచి, యీ కాలువ త్రవ్వబడుతుంది. రిజర్వాయరులోని మిగులు నీటిని, ఈ కాలువద్వారా, పురవకొండవద్ద పెన్నానదిలో కలపాలని యోచన. ఇక్కడ కాలువనీటినుండి 250 నుంచి 280 అ॥ ఎత్తు జలపాతం ఉంటుంది ఈ కాలువ త్రవ్వడం జరిగితే, నీటి సరఫరా ఋతువులో 82 మిలియన్ వాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పన్నమౌతుంది.

చిత్తపట్టు కాలువ - నీటి సరఫరా ఋతువులో, విద్యుదుత్పాదన అవకాశం ఉండేటట్లుగా యీ స్కీమును రెండు సంవత్సరాలక్రితం పరిశోధించారు గోదావరి ఇరిగేషన్ సిస్టంలోని, పడమటి మెయిన్ కాల్వకుడి గట్టువద్ద చిత్తపట్టుదగ్గర కట్టక్రింద 186 అడుగుల ఎత్తునుండి 1400 ఘన క్యూసెక్కుల నీరు పడేటట్లు చేయాలని యీ స్కీము ఉద్దేశం ఈ స్కీము ఫలిస్తే ఒక ఋతువులో 1400 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తిఅవుతుంది

## పొరుగు రాష్ట్రాలనుండి విద్యుచ్ఛక్తి సప్లై

ఆంధ్రరాష్ట్రంలోని చిత్తూరు జిల్లాకు ప్రస్తుతం, దక్షిణమద్రాసు, విద్యుచ్ఛక్తి సరఫరా కేంద్రంనుంచి, విద్యుచ్ఛక్తి సప్లయి అవుతున్నది ఆంధ్రరాష్ట్రం యేర్పడిన తరువాత కూడా, యథాప్రకారం సప్లయి అవుతుంది. వచ్చే నాలుగైదేళ్లలో పెరిగే అవసరాలనుగూడా దృష్టిలో పెట్టుకొంటే, చిత్తూరుజిల్లాకు, మద్రాసు రాష్ట్రంనుంచి, మూడు, నాలుగు వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి అవసరం. మద్రాసు ఆంధ్ర ప్రభుత్వాలు దీన్ని గురించి ఒక ఒడంబడిక చేసుకోవలసి ఉంటుంది. మైసూరు శివసముద్రం స్కీమునుండి, హిందూపురమునకు విద్యుచ్ఛక్తిసరఫరా చేయబడుతోంది. ఒడంబడికప్రకారం 700 కిలోవాట్ల విద్యుచ్ఛక్తిసరఫరాకు మాత్రమే అవకాశం ఉన్నది. తుంగభద్ర హైడ్రో ఎలెక్ట్రిక్ పవరు హిందూపురం ప్రాంతానికి లభించకపోతే, మైసూరునుండి యింకా ఎక్కువ విద్యుచ్ఛక్తి తెచ్చుకోవలసిన అవసరం యేర్పడుతుంది.

పరిశోధింపబడని ఇతర హైడ్రో ఎలెక్ట్రిక్ స్కీములు - గోదావరి, కృష్ణా పెన్నారు నదులపై పైన వివరించిన హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులు మాత్రమేగాక, యింకా అనేక నదుల పైనా ఉపనదులపైన హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టుల నిర్మాణానికి అవకాశం ఉన్నది. వాటిలో,

విశాఖపట్నంలోని వంశధార, నాగావళి నదులు, కర్నూలు, గుంటూరు, నెల్లూరు జిల్లాల్లోని గుండ్లకమ్మ, అనంతపురం, కడపల్లోని ఉత్తర పెన్నారు, చిత్తూరు, కడపజిల్లాల్లోని చెయ్యేరు నదులు.

పైన ఉదహరించిన ప్రాజెక్టులవల్ల ఉత్పత్తి అయ్యే విద్యుచ్ఛక్తి, దేశావసరాలకు సరిపోనిపక్షంలో, యీ నదులపై హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులను కట్టేవిషయం ఆలోచించవలసి ఉంటుంది.

## మామూలు విద్యుచ్ఛక్తి కేంద్రాలు

(జలోత్పాద విద్యుచ్ఛక్తి కేంద్రాలుగావు) ప్రస్తుతం, విశాఖపట్నం, విజయవాడలలోని థర్మల్ స్టేషన్లకు, సింగరేణి, బెంగాల్ కొలరీలనుండి బొగ్గు సప్లయిఅవుతుంది నెల్లూరు థర్మల్ స్టేషన్ నూనె వినియోగిస్తున్నది. నూనె వినియోగించడం చాలా ఖర్చుతోకూడిన పనిగాబట్టి, నెల్లూరు థర్మల్ స్టేషన్లో గూడా బొగ్గు బాయిలర్లు త్వరలో యేర్పాటు చేస్తారు ఆంధ్రదేశంలో ప్రస్తుతంబొగ్గు లేదు. విశాలాంధ్ర రాష్ట్రం యేర్పడి హైద్రాబాదు తెలుగుజిల్లాలు ఆంధ్ర రాష్ట్రంలో కలుపబడినట్లయితే, సింగరేణి కొలరీలన్నీ, ఆంధ్రకు వస్తాయి బొగ్గుగనులదగ్గర పెద్ద థర్మల్ స్టేషన్ నిర్మించుకొని, హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులవల్ల ఉత్పత్తిఅయ్యే విద్యుచ్ఛక్తి చాలకపోతే, భర్తీచేసుకోవచ్చు.

విద్యుచ్ఛక్తిని వినియోగించుకొని ఆంధ్రదేశంలో అనేక భారీపరిశ్రమలు చిన్న కుటీరపరిశ్రమలు పెంపొందించుకోగల అవకాశం కావలసినంత ఉన్నది. ఇక చౌకగా జలోత్పాదకమైన విద్యుచ్ఛక్తి లభిస్తే, యీ అవకాశం, యిబ్బడి ముబ్బడి అవుతుంది.

ప్రస్తుతం అమరియున్న, షుగరు, మాంగనీసు, సిమెంటు పరిశ్రమలు నూనెమిల్లులు (రాయలసీమ) పేపర్ స్టెయిల్స్, వత్తిమిల్లులు, వంచదార, పెయింట్లు, సార, పేపరు, నాకా నిర్మాణ పరిశ్రమలను యింతో పెంపొందించుకోవచ్చు

విశాఖపట్నంలో పెద్ద ఓడరేవు, కాకినాడ, మచిలీపట్నం వగైరా చోట్ల చిన్న రేవు లనేకం, బ్రహ్మాండమైన కృష్ణా గోదావరి తుంగభద్రా నదులు, వాటికాల్వలు, కోస్తా పొడవునా దేశం ఒక అంచునుంచి మరొక అంచుకు వ్యాపించిన ట్రాంక్ రోడ్ రైలుగాక అనేకమైన రోడ్లు— పారిశ్రామికాభివృద్ధికి రాకపోకల మార్గాల విషయంలో యింతకన్నా కావలసినదేమిటి?

రాయలసీమలో నూ, తదితర ప్రాంతాలలోనూ అమూల్యమైన ఖనిజసంపద ఎంతో ఉన్నది. ఇంతటి సంపదఉన్నా, వాటి అభివృద్ధి చాలా హీనంగా ఉన్నది ఇందుకుగల ముఖ్య కారణాల్లో ఒకటి, చౌకగా విద్యుచ్ఛక్తి లభించే అవకాశం లేకపోవడమే

ఇక కుటీరపరిశ్రమలకు వ్యవసాయాభివృద్ధికిగూడా విద్యుచ్ఛక్తి కావాలని రైతులు కోరుతున్నారు మాచ్‌ఖండ్ హైడ్రో ఎలెక్ట్రిక్ స్కీము 1955 నుండి విద్యుచ్ఛక్తి సరఫరా ప్రారంభించడంతో, ఆంధ్ర రాష్ట్రంలో పరిశ్రమలు శరవేగంగా అభివృద్ధి చెందుతాయనడం నిస్సంశయం.

ఆంధ్రప్రాంతానికి ప్రస్తుతం, విజయవాడ, విశాఖపట్నం, నెల్లూరు థర్మల్ స్టేషన్ల నుంచి మొత్తం 25950 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి సప్లయి అవుతున్నది.

మైసూరులో నిజాగర్ సిస్టం క్రింద ఆదోని, ఆలూరు, రాయదుర్గం, గుంటకల్, అనంతపురం జిల్లాలకు, శివసముద్రం స్కీమునుంచి హిందూపురం ప్రాంతానికి, మెట్టూరు హైడ్రో ఎలెక్ట్రిక్ సిస్టంనుంచి, చిత్తూరుజిల్లాకు, ఎక్కువ విద్యుచ్ఛక్తి వస్తున్నది. 6600 కిలోవాట్ల ఉత్పత్తి ప్రమాణంగల 18 డీసెల్ స్టేషన్ లున్నవి మాచ్‌ఖండ్, తుంగభద్రా హైడ్రో ఎలెక్ట్రిక్ ప్రాజెక్టులనుండి విద్యుచ్ఛక్తి ఉత్పత్తి ప్రారంభమైతే, యీ 18 డీసెల్ స్టేషన్లను ఎత్తివేయవచ్చు

ప్రస్తుతం ఆంధ్రదేశంలో 200400 కిలోవాట్ల విద్యుచ్ఛక్తికి గిరాకీ ఉన్నది. ఈ గిరాకీ క్రమంగా పెరుగవచ్చు. 1954 (మాచ్‌ఖండ్ విద్యుచ్ఛక్తి సప్లయి ప్రారంభమైనప్పటి నుంచి) 29 మిలియన్ వాట్లకు, 1956లో (తుంగభద్రా ప్రాజెక్టునుండి విద్యుచ్ఛక్తి సరఫరా ప్రారంభమైతే) 43 మిలియన్ వాట్లకు, 1958 లో 60 మిలియన్ వాట్లకు పెరుగుతుంది

68 వేల చతురపుమైళ్ల విస్తీర్ణం, 15750 గ్రామాలుగల ఆంధ్రరాష్ట్రంలో ప్రస్తుతం పట్టణాలు పల్లెలుకలసి 251 కి మాత్రం అంటే 2% కి మాత్రం విద్యుచ్ఛక్తి సరఫరా అవుతున్నది.

1955 ఆప్రాంతాల మాచ్‌ఖండ్ విద్యుచ్ఛక్తి లభించడం ప్రారంభమవడంతో గ్రామాల అభివృద్ధి కార్యక్రమానికి కోతడంత ప్రోత్సాహం లభిస్తుంది.

ఈవిధంగా స్థూలంగా చూస్తే, ఆంధ్రదేశంలో 600 మిలియన్ వాట్ల విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయడానికి అవకాశం ఉన్నట్లు కన్పిస్తూన్నది. సవివరంగా సమగ్రంగా పరిశోధన చేసి సరియైన అంచనాలువేస్తే యింకా ఎక్కువ అవకాశం కన్పించవచ్చు. ఏదియేమైనా, ఆంధ్రదేశ పారిశ్రామికాభివృద్ధికి విద్యుచ్ఛక్తి కొరత ఉండదన్న విషయం నిర్వివాదం. ఉన్న సహజసంపదను సక్రమంగా, సమర్థంగా ఉపయోగించుకొని, ఆంధ్ర రాష్ట్రం భారతదేశంలోని పురోభివృద్ధికరమైన రాష్ట్రాలలో సముచితమైన స్థానంపొందేట్లు చేయడం ప్రభుత్వాధినేతల విధ్యుక్తం.

# 'కోహినూరు'ను కన్న రత్నగర్భ-ఆంధ్రదేశ సహజసంపద:

37 వ పేజీ తరువాయి

పుట్టి జిల్లాలోని గిద్దలూరు గనుల్ని, మందూరు ప్రాంతాలలోను బాక్సైట్ విశేషంగా దొరుకుతుంది

## భవనశిలలు

భవనాల నిర్మాణానికి ప్రత్యేక రకమైన శిలలు కావాలి ఎక్కువ కాలం మన్నిక కలిగి, చెక్కడానికి వీలయ్యే శిలలు, అందమైన శిలలు మాత్రమే భవన నిర్మాణానికి ఉపయోగిస్తవి విశాలాంధ్రలో దాదాపు ప్రతి ప్రదేశంలోను కూడా పైన పేర్కొనబడిన లక్షణాలుగల శిలలున్నవి వీటిలో గ్రానైట్లు మొదలైనవి ముఖ్యం పల్నాడులోని రెంటచింతలలో దొరికే సున్నపురాళ్ళు అందాలచిమ్మేవని చాలా కాలం నుంచి పేరున్నిక గన్నవి బెజవాడలోని వి రెడ్డిగారి భవనం, ఈ ప్రాంతంలో దొరికే శిలలను పాలిష్ చేయగా తయారైన రాళ్ళతో కట్టినదే

**బెరైల్**: బెరిలియమ్ నుంచి బెరైల్ తయారుచేస్తారు పరిశ్రమలలో అనేకవిధాల ఇదే ఉపయోగపడుతుంది అయితే దీన్ని తయారు చేయడం కష్టం రాగి, నికెలు, ఇనుము, అల్యూమినియమ్ మొదలైన వాటితో కలిసి, ఇది ధాతు మిశ్రమవుతుంది. కొన్ని ప్రత్యేక లోహ మిశ్రమాలు తయారుచెయ్యడానికి ఇది ఉపయోగపడుతుంది సున్నితమైన వస్తువుల ఉత్పత్తి పరిశ్రమలలో దీని వాడకం ఎక్కువ యుద్ధంలో అనేక పరికరాల ఉత్పత్తికి ఇది ఉపయోగించబడ్డది ప్రత్యేకరకమైన పింగాణి, దీపాలు తయారు చెయ్యడానికికూడా యిది ఉపయోగపడుతుంది ఈ అణుయుగంలో దీని ఉపయోగాలు చాలా ఎక్కువ

విశాలాంధ్రలో యిది పుష్కలంగా వున్నది గూడూరు ప్రాంతంలోని మైకా గనులలో యిది పుష్కలంగా వున్నది కృష్ణాజిల్లాలోని తిరువూరులోను, కురుపామ్‌జమీలోను, మైకాతోపాటు ఇదికూడా పుష్కలంగా వున్నది. కురుపామ్‌లో దొరికే బెరైల్ పగలగొట్టినప్పుడు కొన్ని విశిష్టమైన పొరలు కనిపిస్తవి ఇక్కడ దొరికే బెరైల్‌కు కాంతికిరణాలను ప్రసారించే లక్షణం వున్నది ఇటువంటి బెరైల్ విశాలాంధ్రలో మరెక్కడా దొరక్కపోవచ్చు

**క్రోమైట్**: లోహ మిశ్రమాలలో క్రోమైట్ ఒకటి పరిశ్రమలలో దీని ఉపయోగం కూడా చాలా యెక్కువ పారిశ్రామికాభివృద్ధికి ఇది చాలా అవసరం ఉక్కు పరిశ్రమకు ఇది ముఖ్యం తుప్పుపట్టని ఉక్కు వంటి లోహమిశ్రమాలలో క్రోమైట్ వుంటుంది తక్కువరకం క్రోమైట్‌ను మరికొన్ని పరిశ్రమలలో వినియోగిస్తారు క్రోమైట్ లవణాలను అనేక పరిశ్రమలలో వాడతారు

కృష్ణాజిల్లాలో కొండపల్లివద్ద క్రోమైట్ పుష్కలంగా వున్నదని డాక్టరు ఎస్ ఎస్ కృష్ణన్ 1940 లో కనిపెట్టారు కొండపల్లిలోను తిర్వరిన రాలలోను ఇప్పుడు దీని ఉత్పత్తి చేసి ఎగుమతిచేస్తున్నారు హైదరాబాదు సంస్థానంలోని మధిరవద్ద కూడా యిది దొరుకుతుంది కోరాపుట్టి ప్రాంతంలో కూడా యిది వున్నది అయితే అక్కడ దీనినిగురించి పరిశోధనలు ఇంకా జరగవలసి వున్నది

**పింగాణీ మట్టి**: రంగు, మంటలో కాలకుండా వుండడం, సాగదం మొదలైన కొన్ని లక్షణాలు గల మట్టి పరిశ్రమలకు ఉపయోగించుతుంది పింగాణీపన్లలో ఉపయోగించే తెల్లమట్టిని చైనా మట్టి అంటారు మూసలు తయారుచెయ్యడానికి ఉపయోగపడే ఒకరకం మట్టిని బెంటానైట్ మట్టి అంటారు. కుంపట్లు తయారు చెయ్యడానికి ఉపయోగపడే ఒకరకమైన మట్టివున్నది కాగితం, వస్త్రాలు, రబ్బరు, పెయింటు మొదలైన పరిశ్రమలలో కూడా రకరకాల మన్నులు వినియోగిస్తారు

వాట్లలో రకరకాలు విశాలాంధ్రలో పుష్కలంగా వున్నాయి. నెల్లూరు జిల్లాలోని గూడూరు, శ్రీకాకుళం జిల్లాలోని కరివిడి, కురుపామ్, విశాఖపట్టణంలోని అనేక ప్రదేశాలలోను, నిజామాబాద్ జిల్లాలోని చిత్రపాల, నల్గొండ, కోనసముద్రం ప్రాంతాలలోను ఇది పుష్కలంగా వున్నది.

**రాగి**: ఆధునిక నాగరికతకు ఇనుము, అల్యూమినియమ్ ఎంత అవసరమో రాగి కూడా అంతే అవసరం కనుక ఇది చాలా ముఖ్యమైనది దీని ఉపయోగాలు చాలా వున్నాయి. ఇతర ధాతువులతో దీన్ని కలిపి కంచు, ఇత్తడి రేకులను తయారు చేయవచ్చు

విశాలాంధ్రలో అనేక ప్రాంతాలలో రాగి వున్నది అనేక శతాబ్దాల నుంచి దీన్ని ఆయా ప్రదేశాలలో ఉత్పత్తి చేస్తున్నారనడానికి రుజువున్నది నెల్లూరు జిల్లాలోని గరిమినిపేట రాగి గనులను గురించి పరిశోధనలు జరుగుతున్నవి ఇదేవిధంగా కడప జిల్లాలోని జంగంరాజుపల్లి, అనంతపురంజిల్లాలోని మదిగుబ్బ, గుంటూరు జిల్లాలోని అగ్నిగుండల, కర్నూలు జిల్లాలోని గని, గజ్జలకొండ మొదలైన ప్రాంతాలలో కూడా రాగి గనులను గురించి పరిశోధనలు జరగాలి నల్గొండజిల్లా కొండరాళ్ళలో రాగి దొరుకుతుంది రాయచూరు జిల్లాలో కూడా కొన్ని పురాతనపు రాగిగనులున్నాయి అవి చాలా కాలాక్రిందట పని చేసినవి వరంగల్లు జిల్లాలోని మైలారమ్, ఎల్లంతైలు ప్రాంతాలలోని రాగి గనులు ఈ రచయిత కనిపెట్టినవే ఇంకా అనేక రాగిగనులను గురించి పరిశోధనలు జరగవలసి వున్నది

## బొగ్గు

పరిశ్రమలకు బొగ్గు చాలా అవసరం ప్రతి పరిశ్రమకు బొగ్గుకావాలి ముఖ్యంగా జలపాతాలనుంచి తయారయ్యే విద్యుచ్ఛక్తి దొరకని ప్రాంతాలలో పరిశ్రమలకు బొగ్గు మరీ అవసరం బొగ్గునుంచి అనేక వస్తువులు తయారు చేయవచ్చు

విశాలాంధ్రలో బొగ్గు పుష్కలంగా దొరికే ప్రాంతాలున్నాయి చాందానుంచి హైదరాబాదు సంస్థానంగుండా, ఉభయ గోదావరి జిల్లాల వరకు గల ప్రాంతంలో బొగ్గు దొరికే గనులున్న ప్రాంతాలున్నవని రుజువైంది

వాటిని సక్రమమైన యోగంలోకి తీసుకురావాలి ప్రస్తుతంకొత్తగూడెం, బెల్లంపల్లిలో బొగ్గు తవ్వుతున్నారు తూర్పు గోదావరి జిల్లాలోని లింగాల, గరివిడిపేటలలోను, పశ్చిమ గోదావరిలోని బెడదనూరు, గోయలగూడెం, వెంకటాపాలెములలోను బొగ్గు గనులున్నట్లు స్పష్టమైంది. డాక్టరు ఫాక్సు చేసిన అంచనానుబట్టి విశాలాంధ్రలో కొన్ని వందల మిలియన్ల టన్నుల బొగ్గు దొరుకుతుంది వీటిలో చాలా కొద్ది గనులుమాత్రమే ప్రస్తుతం పని చేస్తున్నాయి

గంజాం జిల్లాలోని గోపాలపురిలో బొగ్గుగని వున్నట్లు తెలుస్తున్నది

## డొలోమైట్ - మెగ్నిషియమ్-సున్నపురాయి

వరంగల్లు జిల్లాలోని పాఖాల్ కొండలలోను, కడప కర్నూలు జిల్లాలలోను ఇది దొరుకుతాయి విశాఖపట్టణానికి సుమారు 50 మైళ్ళ దూరంలోవున్న బొర్రా, అనంతగిరి ప్రాంతాలలో కూడా యిది పుష్కలంగావున్నాయి. లోహపరిశ్రమలు, రసాయన పరిశ్రమలలో ఇది చాలా అవసరం విశాలాంధ్రలో మరికొన్ని ప్రాంతాలలో కూడా ఇది కొద్ది కొద్దిగా వున్నాయి

## వజ్రాలు - వజ్ర శిలలు

కృష్ణానదీ లోయలోను, రాయలసీమలో కొన్ని ప్రాంతాలలోను, సుమారు రెండు శతాబ్దం క్రిందటి వరకు వజ్రాల వాణిజ్యం విశేషంగా జరిగిన కేంద్రాలున్నాయి ప్రపంచవిఖ్యాతి పొందిన కోహినూర్ వజ్రం ఈ ప్రాంతంలోదొరికినదే వజ్రకరూరు, కొల్లూరు మొదలైన ప్రాంతాలలో ఇప్పుడు కూడా యిది దొరుకుతున్నాయి రాయచూరు జిల్లాలోని వాస్పేట అనే గ్రామంలో 1985—40 సంవత్సరాలమధ్య అనేక వజ్రాలు దొరికినవనీ, వాటిలో కొన్నింటిని అధికారులు స్వాధీనం చేసుకొన్నారని తెలుస్తున్నది వాటిలో ఒకదాన్ని చెక్కిన తరువాత దాని విలువ 80,000 రూపాయలని అన్నారట ఈ ప్రాంతాలలోని వజ్రాలు ఇంకా అయిపోలేదనీ, వీటిని తిరిగి పరిశీలించవలసిన అవసరమెంతైనా వున్నదనీ నిపుణుల అభిప్రాయం

## బంగారం

కోలారు బంగారు గనులు ఇండియాలో బంగారు గనులలోకల్లా కొన్ని శతాబ్దాలనుంచి ప్రసిద్ధి చెందినవి ఈ గనులు తప్ప వేరే బంగారు గనులు ఇండియాలో కనిపించవు రాయచూరు జిల్లాలోని హట్టి వద్ద కూడా బంగారుగనులున్నాయి 1904-24 సంవత్సరాలమధ్య ఈగనులు తవ్వారు రాయచూరు జిల్లాలోని గద్వాలలో పూర్వం బంగారు గనులుండేవి వరంగల్లు జిల్లాలోని పాల్వంచ సంస్థానంలో (అల్యూవియల్ గోల్డు) ఒక రకమైన బంగారం దొరుకుతుంది

## గ్రాఫైట్

గ్రాఫైట్ చాలా ముఖ్యమైన లోహం పెన్సిళ్ళు, డ్రైబాటరీలు, రంగులు మొదలైన పరిశ్రమలకు ఇది చాలా అవసరం ఉక్కునియమ్‌లోని మూత్రాల్ల వేగం తగ్గించడానికి గ్రాఫైట్ ఉపయోగపడుతుందని యుద్ధకాలంలో కనిపెట్టబడింది. విశాఖ, తూర్పుగోదావరి జిల్లాలలోని అనేక ప్రాంతాలలో ఇది దొరుకుతుందనిరుజువైంది వీటిలో కురుపాం, విజయనగరం ఆంధ్ర సంస్థానాలు ముఖ్యప్రాంతాలు వరంగల్లు జిల్లాలోని కుండ్లమడుగు మొదలైన ప్రదేశాలలో కూడా గ్రాఫైట్ దొరుకుతుంది ఇక్కడినుంచి రాజమండ్రికి సప్లయి చేయబడుతున్నది రాజమండ్రిలో కుటీర పరిశ్రమగా అల్యూమినియమ్ గిన్నెలు తయారుచేస్తారు వాటికి గ్రాఫైట్ బాగా ఉపయోగపడుతుంది ఈ గిన్నెలు రాజమండ్రి నుంచి ఇండియాలో వివిధప్రాంతాలకు ఎగుమతి చేయబడుతున్నాయి గోల్లమామిడాడ, నర్సీపట్నములలో ఈ పరిశ్రమ వున్నది విశాలాంధ్రలో గ్రాఫైట్ పుష్కలంగా దొరుకుతుందనడానికి అనుమానం లేదు

## ఇనుము - ఉక్కు

ఇనుము, బొగ్గు - ఈ రెంటివల్లనే బ్రిటన్, అమెరికాలు అంత గొప్ప దేశాలయాయి ఈ లోహాలన్నింటిలో ఉక్కు గట్టిది—చవుక ఇనుము లేకపోతే ఏ పరిశ్రమా అభివృద్ధి చెందదు

ఇనుము విశాలాంధ్రలో పుష్కలంగా వున్నది బస్తర్‌లోని బైలాదిలాలో ఇనుము దొరికే గని వున్నది ఇండియాలో ఇనుము దొరికే పెద్దగనులలో ఇదొకటి ఇంకా 6,000 మిలియన్ల టన్నుల ఇనుము ఇక్కడి గనిలో నిలవవున్నట్లు అంచనా బస్తరునుంచి తూర్పుగోదావరి వరకూ వున్న కొండలో కనిపించే జలపాతాల సహాయంతో తయారుచేసిన విద్యుచ్ఛక్తితో గాని, ప్రాణహిత - గోదావరి నది ప్రాంతంలో దొరికే బొగ్గుతో గాని ఈ లోహము నుంచి ఉక్కు తయారుచేయవచ్చు

నిజామాబాద్ జిల్లాలోని కోనసముద్రంవద్ద తయారైన వుక్కుతో శ్రేష్ఠమైన ప్రపంచ విఖ్యాతి చెందిన "డమాస్కస్ కత్తులు" తయారు చేయబడినవి పూర్వకాలంలో తెలంగాణా ప్రాంతంనుంచి యూరప్ దేశాలకు మామూలుగా ఎగుమతి అయిన వరుసలలో వుక్కు ఒకటి

తెలంగాణాలో దొరికే యినుములో సగభాగం గోదావరిలోను, నిజామాబాద్ జిల్లాలోను దొరుకుతుంది ఈ గని ప్రాంతాలకు ఆధునికశాస్త్ర విజ్ఞాన సౌకర్యాలు లభిస్తే అక్కడ ఉక్కు తయారు చేయవచ్చు

## సీసం

సీసం విశాలాంధ్రలో అంత ఎక్కువగా వున్నట్లు తెలియదు అయినా పూర్వం ఈ లోహం దొరికిన ప్రాంతాలైన గుంటూరుజిల్లాలోని కారంపేడు, రాయలసీమలోని జంగంరాజపల్లి, బసవాపురం, కోయిలకుంట్ల, నల్గొండజిల్లాలోని చేవరకొండ మొదలైనప్రదేశాలలోను సీసం గురించి పరిశోధించడం అవసరం

## అభ్రకం

విశాలాంధ్రలో మైకా గనులు చాలా వున్నవి గూడూరు మైకా విదేశాలకు ఎగుమతి చేస్తున్నారు. వరంగల్లు జిల్లాలోని ఖమ్మంమెట్ ప్రాంతంలో కొన్ని మైకా గనులు పనిచేస్తున్నాయి కృష్ణా జిల్లాలోని తిరువూరు, తూర్పు గోదావరి జిల్లాలోని కొన్ని ప్రాంతాలు, విశాఖ జిల్లాలో కొన్నిప్రాంతాలలో అభ్రకంగనులున్నట్లు ఇటీవల తెలియవచ్చింది కురుపామ్ జమీలో ఒకరకమైన మైకా వున్నది కోరాపుట్టి, విజయనగరం జిల్లాలలో మరోరకం మైకా వున్నది వరంగల్లు, తూర్పు గోదావరి జిల్లాలో ఒక కొత్తరకం మైకా కనిపించింది మైకావల్ల పరిశ్రమలలో అనేక ఉపయోగాలున్నాయి

## మాంగనీసు

విశాఖ, శ్రీకాకుళం, కోరాపుట్టి జిల్లాలలో మాంగనీస్ గనులు తవ్వుతున్నారు గరివిడి, కోడూరు, దువ్వమ్, దేవద, చీపురుపల్లి, సదానందపురం, గర్భామ్ ప్రాంతాలు మాంగనీసు దొరికే ప్రాంతాలలో కొన్ని ప్రతి సంవత్సరం మాంగనీస్ దొరికే కొత్త ప్రదేశాలు బయటపడుతున్నాయి మాంగనీస్ అంతా విదేశాలకు ఎగుమతి చేయబడుతున్నది బళ్ళారి జిల్లాలో కూడా చెప్పుకోతగ్గంత మాంగనీస్ వున్నది హైదరాబాద్ సంస్థానంలో కొన్ని ప్రాంతాలలో కూడా మాంగనీస్ వున్నట్లు చెపుతున్నారు కాని అవి పరిశ్రమ నెలకొల్పదగ్గంత పెద్ద ప్రాంతాలు కావు ఇనుము, ఉక్కుల తరువాత పరిశ్రమలకు మాంగనీస్ చాలా అవసరం

## రకరకాల ఇసుకలు

గంజామ్, శ్రీకాకుళం, తూర్పు గోదావరి జిల్లాలలో రకరకాల ఇసుక కనిపిస్తుంది ఈ యిసుకలో రకరకాల లోహాలున్నాయి విశాఖపట్టణం సముద్రతీరాన 120 మైళ్ళవరకు వున్న ఇసుకలో అనేకరకాల లోహాలున్నాయని ఆంధ్ర విశ్వవిద్యాలయంలోని భూగర్భశాస్త్ర విభాగం వారు రుజువుచేశారు

సముద్రతీరపు యిసుకలో పరిశ్రమలకు ఉపయోగపడే లోహాలు పుష్కలంగా వుంటాయి వాటిని సక్రమమైన యోగంలోకి తీసుకురావచ్చు రంగులు, ఉక్కు పరిశ్రమలకు అవసరమైన లోహం (ఇల్‌మెనిట్) కూడా యిసుకనుంచి తయారు చెయ్యవచ్చు ఆంధ్రప్రాంతం ఈ లోహాల విషయంలో స్వయంసంపూర్ణమే గాక, కోస్తాజిల్లాలలో పరిశోధనలు చేసి దీన్ని పుష్కలంగా తయారు చేస్తే ఇతర ప్రాంతాలకు కూడా ఎగుమతి చేయవచ్చు

**లవణాలు**: ఆంధ్రదేశానికున్న సముద్రతీరం ఇప్పటి ఉప్పు పరిశ్రమకు అభివృద్ధికి ముఖ్యమైన అవకాశం ఇస్తున్నది అన్ని పరిశ్రమలు క్రమపద్ధతిలో అభివృద్ధి చెందాలంటే సోడియమ్ వంటి లవణాలు ఆ పరిశ్రమలకు చాలా అవసరం

**గంధకం, పైరైట్స్**: పరిశ్రమలలో అనేకవిధాల ఉపయోగపడే గంధకికామ్లాన్ని గంధకంతో తయారుచేస్తారు రసాయనాల ఉత్పత్తి పరిశ్రమకు పిదప ఒకదశలో ఇది కావలసిందే పారిశ్రామికాభ్యుదయానికి గంధకికామ్లం ముఖ్యం.

కృష్ణాజిల్లాలోని కోనవద్ద నాటు గంధకం దొరుకుతుంది ఇండియా భూగర్భ శాస్త్రజ్ఞులు దీన్ని గురించి ఇటీవల పరిశోధనచేసి, పరిశ్రమ నెలకొల్పడానికి తగినంతగా ఇక్కడ గంధకం దొరకదని తేల్చారు కడప, కర్నూలు జిల్లాలలో పైరిట్సు దొరుకుతుంది. తాలుకు, కొత్తగూడెం బొగ్గుగనులలో కూడా యిది దొరకుతుంది

పైన పేర్కొనబడిన విషయాలనుబట్టి, విశాలాంధ్రలో పరిశ్రమల అభివృద్ధికి కావలసిన ఖనిజాలు పుష్కలంగా వున్నవని స్పష్టమవుతున్నది అయితే ఇంతవరకు చెప్పుకోదగ్గ ఒక్క లోహ పరిశ్రమ కూడా నెలకొల్పబడలేదు పరిశ్రమ నెలకొల్పడానికి తగినంతగా దొరికే లోహాలు, దొరకగలవని రుజువయిన లోహాల విషయం మాత్రమే ఈ వ్యాసంలో ప్రస్తావించబడింది ఈ లోహసంపదను శాస్త్రీయ పద్ధతులలో సక్రమోపయోగంలోకి తీసుకువస్తే విశాలాంధ్ర భారతదేశంలోని భాగ్యవంతమైన విభాగాలలో ఒకటవడమే గాక, కొన్ని కీలక పరిశ్రమల ద్వారా కేంద్రానికి కుడిభుజంగా తయారు కాగలదనడంలో అనుమాన మేమీ లేదు.

# జలసంపద సద్వినియోగం

[39-వ పేజీ తరువాయి]

కర్నూలు, అనంతపురం, కడప, నెల్లూరు, జిల్లాలకు లాభము కలుగవచ్చు కొంతకాలంవరకూ, అంటే తుంగభద్రలోని నీరు పూర్తిగా తుంగభద్ర లోయక్రింద ఉపయోగించుకొనే పరిస్థితులేర్పడేవరకూ, కృష్ణా, గుంటూరు, జిల్లాలలోని భూమికి రెండవపాటుకు నీరు కూడా దీనివల్ల లభిస్తుంది

తుంగభద్ర నీటిని సంపూర్తిగా ఉపయోగించుకొన్నప్పుడు ఈవిధంగా నీటి వనరులు ఏర్పడతాయి —

| | |
|---|---|
| (1) కర్నూలు కడప కాలువ ప్రస్తుతం సాగు (ఎకరాలలో) | 1,50,000 |
| (2) విస్తరింపువల్ల వచ్చే సాగు " " | 2,00,000 |
| (3) ఆనకట్టకు తూర్పున, పడమరన ప్రత్యే కాల్వలవల్ల ఏర్పడే కొత్తసాగు (ఖోస్లాకమిటీ రిపోర్టు ప్రకారం) | 2,50,000 |
| (4) గండికోట ప్రాజెక్టు క్రింద సాగు (ఎకరాలలో) | 1,50,000 |
| (5) తుంగభద్ర ఎగువ కాలువవల్ల అయ్యే సాగు (ఎకరాలు) | 3,00,000 |
| (6) తుంగభద్ర ప్రస్తుతపు ఆనకట్టక్రింద అయ్యే సాగు (ఎకరాలలో) | 1,60,000 |
| మొత్తం ఆయకట్టు (ఎకరాలు) | 12,10,000 |

లాభము కలుగుతుంది ఈ ప్రాజెక్టుల వల్ల కలిగే ఫలితాలు పరస్పర సంలగ్నములు, సమ్మిళితములు అయినందువల్ల ఇందులో వచ్చే ఆదాయాన్ని బట్టి కొన్ని ఎక్కువ వ్యయసాధ్యమైనవి, కొన్ని తక్కువ వ్యయసాధ్యమైనందువల్ల ఈప్రాజెక్టులనిర్మాణం కార్యక్రమములనుగురించీ, కాలక్రమములనుగురించి వాదోపవాదాలు జరుగుతున్నందువల్లనూ అనుభవము కలిగిన ఇంజనీర్లు, పరిపాలకులు, కార్యదక్షులు, కలిగి నటువంటీ, రాజకీయ ముఠాలకు, రాజకీయాలకు అతీతమైనటువంటి

## ఇరిగేషన డెవలప్‌మెంట్ బోర్డు

సిద్ధేశ్వరం, పోలవరం, నందికొండ, పులిచింతల, రామపాదసాగర్, ఆంధ్రదేశానికి చాల ముఖ్యమైన ప్రాజెక్టులు ఈ ప్రాజెక్టులవల్ల కడప, కర్నూలు, నెల్లూరు, చిత్తూరు, కృష్ణా, గుంటూరు, పశ్చిమగోదావరి, తూర్పుగోదావరి, విశాఖలు అపరిమితమైన సాగుదల సౌకర్యాలు పొందుతాయి సుమారు రెండుకోట్ల, 50 లక్షల ఎకరాలు వంశధారక్రిందకూడ సాగు అవుతుంది ఈ పెద్ద ప్రాజెక్టు లన్నింటికీ కలిపి సుమారు 150 కోట్ల రూపాయల కంటే హెచ్చు వ్యయంకాగు మొదటి పంట, రెండవ పంట మెట్ట పంట మొత్తము కోటి ఎకరాలకు సర్వాధికార, సంయుక్తమైన ఇరిగేషన్ డెవలప్‌మెంటు బోర్డును ఒకదానిని ఏర్పరచాలి పదిసంవత్సరములలో ప్రాజెక్టుల కార్యక్రమం పూర్తయ్యేటట్లు పథకాలు వేయాలి సర్వఫలదాయినియైన నుజల నుఫల నదుల ఉపయోగం వల్ల ఆంధ్రదేశం అచిరకాలంలో ఆర్థికంగా బలవత్తరమైనదే కాకుండా భారతభూమిలో అగ్రగామియైన రాష్ట్రంగా తయారౌతుంది

(ఈ వ్యాసములోని అంకెలకు 1951 సం రం జనాభా లెక్కలు, మదరాసు ప్రభుత్వపు అగ్రికల్చరల్ అండ్ క్రాప్ రిపోర్టు, ప్లానింగ్ కమిషన్ రిపోర్టు, పంచవర్ష ప్రణాళిక ఆధారములు)

# వ్యవసాయం తరువాత అంత ప్రధానమైన పరిశ్రమ చేనేత

★ శ్రీ మాచాని సోమప్ప ★

భారతదేశంలో గ్రామము లెక్కకు ఎక్కువ. కాని గ్రామస్థుల పేరిసంపదలు, అభివృద్ధిచెందిన భారతదేశపు జాతీయత ననుసరించును. గ్రామాలలో అధిక సంఖ్యాకులు మగ్గులైయుండే పరిశ్రమములలో, వ్యవసాయం తరువాతి చేనేత పరిశ్రమ ముఖ్యమైనది. వికేంద్రీకరణపద్ధతి ననుసరించి గ్రామముల ఆర్థిక స్థితిని పెంపొందించుటకు పలు మూలల ప్రాకిన చేనేత పరిశ్రమ చాల ఉపకరించుచున్నది.

మద్రాసురాష్ట్రములో చేనేత పరిశ్రమ సహకార పద్ధతులపై ఒక్కగా నడుచుచున్నది. రెండుకోట్ల జనాభా ఈ పరిశ్రమపై ఆధారపడియున్నది. ఒక్క మద్రాసు రాష్ట్రములో నే తీవిలో ఐదవవంతు అనగా 40 లక్షల మంది చేనేతపరిశ్రమపై జీవించుచున్నారు. మాతృ ఆంధ్రరాష్ట్రములో సహకారసంస్థలో చేరిన చేనేత పనివారిసంఖ్య పరిశిష్టమద్రాసుప్రాంతములో అట్లు చేరినవారిసంఖ్యకన్న ఎక్కువ. పరిశిష్టమద్రాసులో 3·67 లక్షల మగ్గములు, ఆంధ్రరాష్ట్రములో 5.059 లక్షల మగ్గాలే ఉన్నప్పటికిని, ఆంధ్రరాష్ట్రములో ఏర్పడిన చేనేత సహకారములసంఖ్య 626. ఇట్టి సహకారసంఘములు పరిశిష్టమద్రాసులో 328 మాత్రమే కలవు. అవశిష్టమద్రాసు రాష్ట్రంలో సహకారసంస్థలలో నున్న మగ్గములసంఖ్య 1·081 లక్షలే. కాని ఆంధ్రరాష్ట్రములో ఉన్న సహకారోద్యమ మగ్గములసంఖ్య 1·088 లక్షలు. దీనివలన అధునిక సహకారోద్యమము ఆంధ్రరాష్ట్రపు చేనేత పరిశ్రమలో ఎక్కువగా పాదుకొని పోయినదనుట స్పష్టము. ఆంధ్రలో సహకార చేనేత సంఘాల యాజమాన్యమున్న మగ్గాలలో నూటికి 75 వంతులు ఉభయగోదావరిజిల్లాలలో నున్నవి. తదితర ఆంధ్ర జిల్లాలలో సహకార సంఘములలో ఉన్న చేనేత మగ్గములు 100 కి 25 మాత్రమే. మిగిలిన ఆంధ్రజిల్లాలలో కూడ ఉభయ గోదావరి మండలములవలె సహకారోద్యమములోనికి ఎక్కువగా చేనేతమగ్గములు వచ్చునట్లు ఒనరించి, వ్యాపారమే ముఖ్యముగా భావించు మధ్యవర్తుల, మాస్టర్ వీవర్ల అధీనమునుండి చేనేత పనివారలకు విముక్తి కలిగించవలసిన బాధ్యత మనపైనున్నది.

## ఆంధ్ర జిల్లాలలో చేనేత కేంద్రాలు

ఆంధ్రజిల్లాలలో ఉన్న చేనేత కేంద్రములలో కొన్ని చాలాఅభివృద్ధి చెందినవి. మన్నికమైన పుల్లంపేట మాధవరం, వెంకటగిరి, ఉప్పాడ పెడనచీరెలు నారాయణవనం, పాయకరావుపేట, మొదలు కేంద్రములలో నేయబడుచున్న పంచెలు, నెల్లూరు, చిత్తూరు జిల్లాలలోగల నేత కేంద్రములలో తయారయ్యే ఎగుమతికాబడే లుంగీలు, జేబురుమాళ్ళు, అదిగాక, కర్నూలులో తయారయ్యే జంఖానాలు ఎమ్మిగనూరు సహకారసంస్థలో తయారు చేయబడే దోమతెరలు, పలువిధములైన అలంకారవస్త్రములు, చొక్కా గుడ్డలు, ఆంధ్రదేశములో ఉత్పత్తి అయ్యే చేనేతవస్త్రములలో పేరెన్నిక కన్న రకాలు.

విదేశీయులు కూడ అబ్బురపడునట్లు, అందమైన, శ్రేష్ఠమైన నమూనాల చేనేత పరిశ్రమ పూర్వకాలములో మనదేశమునందు ఉత్పత్తి చేసెను. పురాతనయుగములో చేనేత పారిశ్రామికులు మనవారికంతటి వస్త్రాలు సప్లయి చెయ్యడమే కాక విదేశములకు వస్త్రములను ఎగుమతి చేయుచు, జాతీయాదాయము ఎక్కువ చేశారు. కాని, 19 వ శతాబ్దము మధ్యకాలములో విదేశపరిపాలకుల లోపైనాను భారతదేశములో వస్త్రపుమిల్లులు స్థాపించబడినందువలన చేనేతపరిశ్రమ కుంటుపడెను. గొప్ప వరవడి కలిగిన మిల్లుయజమానులు, ప్రభుత్వమునుండి తగినపోషణము రక్షణ పొందుటయే కాక, పన్నుల విధానములో కూడ మార్పులు తెప్పించి, చేనేత పరిశ్రమకు గొడ్డలిపెట్టు పెట్టిరి.



విజయవాడలో క్రిందటినెల 14 వ తేదీన ఆంధ్రరాష్ట్ర చేనేత సహకారసంఘ స్థాపనోత్సవం జరిగింది. అధ్యక్షుడు వుమాకాంతారావుగారు ప్రగడకోటయ్యగారు చిత్రంలో వున్నారు

## మిల్లులతో పోటీ

రెండు ప్రపంచసంగ్రామములలోను మిల్లు పరిశ్రమకే దోహద మొసంగెను. మిల్లులు తమ ఉత్పత్తిని అధికము చేసికొని, చేనేత పరిశ్రమకు దుర్దినములను తెచ్చిపెట్టెను. 1914-20 లో జరిగిన ప్రపంచ సంగ్రామములో చేనేత పరిశ్రమోత్పత్తి 10,000 లక్షల గజములనుండి, 5000 లక్షల గజములకు తగ్గిపోగా, మిలుల ఉత్పత్తిమాత్రము 11000 లక్షల గజములనుండి, 16000 లక్షల గజములవరకు పెరిగెను. మరల 1939-51 కాలములో చేనేత వస్త్రోత్పత్తి 17000 లక్షల గజములనుండి 8000 లక్షల గజములకు తగ్గిపోగా, మిల్లువస్త్రోత్పత్తి 36000 లక్షల గజములనుండి, 40,000 లక్షల గజముల వరకు పెంపొందెను. యుద్ధకాలంలో విదేశపు వస్త్రదిగుమతి ఆగిపోయినప్పుడు, మనదేశపు వస్త్రములకు ఎక్కువ గిరాకి వచ్చెను. ఈ పరిస్థితులను తమకు అనుకూలము గావించుకొని, ఎక్కువ గంటలకాలము పనిచేసి, చేనేతమగ్గములకు చెందవలసిన నూలంతా, స్వాధీనం చేసుకొని మిలులు అంతకుపూర్వము చేనేతవారిచే తయారుచేయబడే చీరలు, ధోవతులు, హెచ్చుగా ఉత్పత్తి చేసెను. మిలులలో తయారయ్యే నూలుపైననే ఆధారపడిన చేనేత పరిశ్రమ మిల్లుల పోటీకి లొంగిపోవలసివచ్చెను. నూలు దొరకక పోవుటచే, చేనేతవారు అంతకుపూర్వము తాము తయారు చేయు చీరెలు, ధోవతులు తయారు చేయలేక పోయిరి. ఇందువలన చిరకాలమునుండి చేనేత చీరెలు ధోవతులకు అలవాటుపడిన ప్రజలు, మిల్లు చీరెల ధోవతులు ఉపయోగించుటకు అలవాటుపడిరి. ప్రభుత్వము వారిచే ప్రవేశపెట్టబడిన కంట్రోలు విధానపు కంట్రోళ్ళకన, మిలు వస్త్రముల ఉపయోగాలలో నున్న పరిమితులు కూడ ప్రాకిపోయెను.

ఈ కాలములో [illegible] యూనిఫారంకుకు తగిన దానికలను, ఎక్కువ ధరలపై చేనేతవస్త్రములు లభ్యమైనందున ప్రజాభిప్రాయములో చేనేతవస్త్రపు ధరలు ఇప్పటికీ హెచ్చుగానే ఉన్నవని ఒక అభిప్రాయము నేటికిని ప్రజలలో పాదుకొనిపోయి ఉన్నది. ఇది యథార్థము కాదు. నిజముగా చేనేతవస్త్రములు మిల్లువస్త్రములకంటే ఎక్కువకాలము మనును. దానికి ముందు 1948-49 వ సంవత్సరములో, మిల్లు గుడ్డకంటే చేనేతవస్త్రపు ధర తక్కువగా కూడా ఉండెను. కొన్ని రకముల నూలుపై 100 కి 20 వంతులు చొప్పున దిగుమతి సుంకము చెల్లించి నప్పటికీ కూడా, చేనేతవస్త్రపు ధర అప్పుడంత ఘరసముగా నుండెను. మరల ఇటీవల చేనేతవస్త్రములు నూటికి 15 వంతులు నూలుపై మిల్లులకన్న ఎక్కువ ఖర్చులు యివ్వవలసివచ్చినప్పటికీ, మిల్లువస్త్రముల ధరల సరాసనముతో తులతూగుచున్నది. సంయుక్త మిల్లులలో కే ఉత్పత్తి అగు నూలుపై, వారింత సుంకము యివ్వవలసిన అగత్యము లేదు. ధరలు ఒకటేఅయిన మిల్లు గుడ్డకంటే చేనేత బట్టలు ఎక్కువకాలం వుండును. నేటికిని చేనేతవస్త్రములు విరివిగా ప్రజాదరణ పొందకుండుటకు ముఖ్యకారణము ప్రజలు ఈ రహస్యమును ఇంతవరకును తెలుసుకొనకుండుటయే.

## చేనేతవారి కడగండ్లు

పూర్వకాలములో అనేక జనముకు ఆహార్యముగా నుండిన, చేనేత పరిశ్రమ నేడు కోటిమంది పరిస్థితికి వచ్చినది. దాదాపు రెండేండ్ల క్రిందట ప్రారంభమైన చేనేతవారి కడగండ్లు నేడు ఇనుమడించినవి. కాపునకే రాజకీయ నేతలయిన పూర్వాధ్యక్షుడు రాజగోపాలాచారిగారు, అంచుల ధోవతుల రంగుచీరెల ఉత్పత్తి చేనేత పరిశ్రమకు ప్రత్యేకించవలెనని ఉద్ఘాటించిరి. కాని ఏ కారణము చేతనో కేంద్రప్రభుత్వము నేటివరకు ఈ సూచనను ఆచరణలో పెట్టలేదు.

## ప్రభుత్వ కర్తవ్యం

పరిశ్రమలకు రక్షణ ఇవ్వడానికి ఇది మొదటిసారి కాదు. వస్త్రపు మిల్లులకు, చక్కెరమిలులకు, జనుము మిలు పరిశ్రమలకు ఇంకా పలువిధములైన పరిశ్రమలకు ప్రభుత్వమువారు రక్షణ యిచ్చుచుండుటలేదా! రెండుకోట్ల చేనేత పారిశ్రామికులకు అట్టి రక్షణ ప్రభుత్వము ఏల యివ్వరాదు? చేనేత వస్త్రములు నిజానికి కలకాలము, అంత మన్నికైనవి కాని కావు మిలు వస్త్రములకంటె చేనేత వస్త్రములు చౌక. రెండుకోట్ల చేనేత పారిశ్రామికులు, తంతె పారంపర్యముగా తమకు జీవనాధారమైన కుటీర పరిశ్రమను వదలుకొని, నిర్వ్యాపారత్వమునకు లోనై క్రుంగి, కృశించి, నశించుచున్నారు. రాజాజీ సలహా ననుసరించి మిగిలిన రాష్ట్రప్రభుత్వము లన్ని "రిజర్వేషన్" ప్రణాళికను అంగీకరించియుండగా, ప్రజానాయకుడైనపండిత నెహ్రూగారు కేంద్రములో ఇంకను మిన్నకుండుట చోద్యముగా నున్నది. ఆంధ్రప్రభుత్వము, కేంద్రప్రభుత్వముపై తగు ఒత్తిడిని తెచ్చి, చేనేతపరిశ్రమకు తగు రక్షణ ఇస్తుందని ఆశిస్తున్నాను.

ఈ పరిశ్రమకు ముఖ్యమైన ముడి వస్తువు నూలు. మిల్లులు తయారుచేసే నూలుపైన ఆధారపడుటను తప్పించుకొనవలెనన్న చేనేత పనివారలే, ప్రత్యేక నూలు మిలును స్థాపించాలి. ప్రప్రథమముగ ఈ దేశములో చేనేత సహకారసంఘ పెట్టుబడితో స్థాపితమైన అట్టి సహకార నూలుమిల్లు ఆంధ్రదేశములో కేంద్రమైన గుంతకల్లులో యిటీవల ప్రారంభించబడినది. ఇంక కొలది వారములలో యీ మిల్లునూలు ఉత్పత్తి చేయుటకు ఉపక్రమించును. ఆంధ్రరాష్ట్రములో చేమగ్గములకు కావలసిన నూలుకు సరిపడునంత ప్రత్తి, ఆంధ్రదేశములో నే పండుచున్నది. గుంతకల్లులో స్థాపితమైన ప్రథమ సహకార నూలుమిల్లు ఆదర్శమును పురస్కరించుకొని, అట్టివే పెక్కు నూలు మిల్లులను తదితర ఆంధ్రజిల్లాలలో కేంద్రప్రభుత్వపు "సెస్" ఫండుతో నెలకొల్పడం కూడ ఆంధ్రప్రభుత్వపు ప్రథమకర్తవ్యములలో ఒకటి. కేంద్రప్రభుత్వమువారు ఇటీవల మిల్లులపై విధించిన "సెస్" వలన దాదాపు 4 కోట్లరూపాయలు వచ్చును. ఈ స్వల్పమొత్తం రెండుకోట్ల చేనేతపనివారల సంరక్షణకు పూనుకొనడానికి చాలదు. చేనేత సహకార సంస్థలు స్థాపించుటకుమాత్రము ఈ 'సెస్' ఫండు ఉపయోగపడవచ్చును కాని, రిజర్వేషన్ మూలకముగా, రక్షణ యిచ్చుటయే దీనికి నిజమైనపోషణము ఒసంగగలదు. నాలుగు కోట్లరూపాయలు 'సెస్ ఫండు' చేనేతపరిశ్రమకు ప్రత్యేకించబడినదని ప్రకటించి, నేటికి దాదాపు ఒక సంవత్సరమైనను ఇంతవరకు ఇది కార్యరూపము దాల్చలేదు.

## ఎమ్మిగనూరు చేనేత సహకార సంఘం

చేనేతపనివారలు సహకారోద్యమములో చేరుటవలన పెక్కులాభములను పొందవచ్చును. దీనికి ఉదాహరణగా, ఆదర్శవంతముగా నడుచుచున్న ఎమ్మిగనూరు సహకార సంఘమునుగురించి కొంత వివరిస్తాను.

1938 వ సంవత్సరంలో 21 సభ్యులతో 170 రూపాయల పెట్టుబడితో ప్రారంభమై, దినదినప్రవర్ధమానమై, నేడు 1718 సభ్యత్వముకలిగి దాదాపు లక్ష రూపాయల వాటా పెట్టుబడి, 1918 మగ్గములతో రక్షణఫండు రూ 9½ లక్షల పైగా కలిగి సాలీనా 18 లక్షల రూపాయల వస్త్రాల ఉత్పత్తి చేయుచూ, గొప్పదనకు ఈ చిన్న సహకారసంఘము వ్యాపించిన [illegible]

(44-వ పేజీ చూడుడు)



అనంతపురంజిల్లా కదిరిలోని లక్ష్మీనరసింహస్వామి దేవళం రంగమండపం





ఆంధ్రజాతీయ కళలలో ఒక విశిష్టస్థానాన్ని గణించిన

# ★ కొండపల్లి కొయ్యబొమ్మలు ★

రచన: శ్రీ కామఋషి సత్యనారాయణవర్మ

పెద్దలకు తమ బిడ్డలనిచూస్తే ఎంత ఆనందమో పిల్లలకు ఆటవస్తువులంటే అంత సంతోషంగదా! అమ్మ తరువాత ఆటవస్తువేననే భావన అందరికిగున్నదే. ఈ బొమ్మలు తల్లులను మించి పిల్లల కూరటగొలిపి వారి ఆనందాబ్ధి నోలలాడించును. పిల్లలు పసితనంలో ముందుగా ధ్వనికి తరవాత రంగులకు ఆకర్షింపబడుదురు. క్రమక్రమంగా ఎదిగినకొలది వింత గొలుపు బొమ్మలను చూచి ముచ్చట పడుదురు. సాధారణముగా మగబిడ్డల కన్న ఆడపిల్లలకే ఈ బొమ్మలతో అనుబంధమెక్కువ. సంబంధ బాంధవ్యములు, ఆచారవ్యవహారములు, గుణసంపత్తి, అభిరుచులు మున్నగునవి యలవడుటకు ఆడపిల్లలకు బొమ్మలే మొదటి గురువులు. వినోదము కల్పించిన బొమ్మలే విజ్ఞానప్రబోధకములు గూడ నగును. బొమ్మల పెండ్లిలో



తెనుగుపడుచు తన బొమ్మను అత్తవారింటికంపు సమయంలో ఈవిధంగా నీతులు గరపును.

"వీధిలో తలదిప్పి ముడువకే బొమ్మ
పల్లెత్తి గట్టిగా పలుకకే బొమ్మ
పొరుగిల్లు కెప్పుడూ పోవకే బొమ్మ
పలుకరి నోళ్లలో నానకే బొమ్మ"

అక్కడీజీవితమున్న గు పురాణవ్యక్తుల కైలాసక్రీడలు బొమ్మలతోనే గడిపినట్లుగా మన పురాణములందు వ్రాయబడియున్నది. సంక్రాంతికి గృహాంగణములు రంగవల్లులతోను, గృహములు బొమ్మల కొలువులతోను అలంకరించి కళామయుడగు పరమేశ్వరుని పూజించి ఆనందోత్సాహముల నోలలాడుట అందరకు అనుభవమేగదా! కోటీశ్వరునిమొదలు కూటికి పేదవరకు ఈ బొమ్మలతో ఆనందానుభూతిని పొందనివారుండరు. ఇన్ని విధముల మన నిత్యజీవనవిధానముతో అల్లుకు పోయిన ఈ కళను కులవిద్యగా స్వీకరించిన పారిశ్రామికులలో కొండపల్లి శిల్పులు అగ్రగణ్యులని చెప్పవచ్చును. ఈ పరిశ్రమయొక్క ఈనాటి పరిస్థితిని పర్యాలోకించుట ఎంతయు ముఖ్యము గదా!

## కొండపల్లి

కొండపల్లి విజయవాడకు 12 మైళ్ల దూరమున గలదు. ఈ గ్రామమందలి "కిల్లా" శ్రీ కృష్ణదేవరాయలనాటి నుండి అనేక చారిత్రక సంఘటనలకు రంగమై చరిత్ర విఖ్యాతిపొందినది. ఈ కిల్లా ప్రాంతమందలి అడవులలో "పొనికికఱ్ఱ" విస్తారముగా దొరకును. ఇది బాడిదకఱ్ఱవలె తేలికగాను, అంతకన్నా బిగిగాను యుండును. ఈ కఱ్ఱ మ్రానులను ఎండించి వాటిని చిన్నచిన్న ముక్కలుగా కోసి రూపములను చెక్కుదురు. తయారైన బొమ్మలకు సుద్దపూసి దానిపైన ఆ బొమ్మకు తగిన రంగులు వేయుదురు. చేతితో స్వయముగా కట్టుకొన్న సన్నని కలముతో బొమ్మల రూపురేఖలను బహుసున్నితముగా వేయుదురు. ఈ బొమ్మలలో జంతువులు, పౌరాణిక విగ్రహములు సామాజిక దృశ్యములు, గ్రామీణ వృత్తులు, భవనములు మున్నగునవి గలవు. పల్లె జీవితమునందలి వివిధవృత్తులకు సంబంధించిన బొమ్మలు సజీవకళ ఉట్టిపడుచుండును. రామపంచాయతనము, దశావతారములు, గోపికాకృష్ణుడు, కమలసుందరి లక్ష్మి, సరస్వతులు, పాండురంగడు రాసక్రీడలు, కోలాటము మున్నగు పౌరాణిక విగ్రహములలో హైందవకళలయందుండదగిన ఆదర్శభావము స్ఫురించుచుండును. జంతువులలో ఏనుగంబారీ పూర్వకాలపు

(44-వ పేజీ చూడుడు)

# "కృష్ణవేణీ హరిత సస్య సీమలందు, గౌతమీ పుణ్యకళ్యాణ కంఠసీమ, తుంగభద్రా శుభోపాంతరంగములను అందికొనుము 'పుత్రులపూజ' ఆంధ్రలక్ష్మి"



రాజమహేంద్రవరంవద్ద గోదావరీనదీమతల్లి



విజయవాడవద్ద కృష్ణవేణీనది





తుంగభద్ర - ప్రాజెక్టు ప్రాంతంలో

ఏనుగుల సెలయేరు నందికొండ ప్రాజెక్టు (నిర్మాణప్రాంతం)

★

మదనాపురంవద్ద రెండు కొండలనడుమ ప్రవహించే వంశధార వంశధారా ప్రాజెక్టు డాము నిర్మాణానికి నిర్ణయించిన స్థలం ఇదే









గుంటూరు జిల్లాలోని ఎత్తిపోతల జలప్రపాతం





కర్నూలువద్ద తుంగభద్రానదీ-యానపాత్రలుగా ఉపయోగపడుతూ అరిగోళ్లనబడే పుట్లు

మాచ్‌ఖండ్ విద్యుచ్ఛక్తి ప్రాజెక్టుకు ఆధారమైన ఒరిస్సా రాష్ట్రములోని సుప్రసిద్ధ డుడుమా జలపాతం ప్రపంచంలోని జలపాతల్లో రెండవదని ప్రసిద్ధికెక్కింది

ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘము సాధారణ సభ్యులు-ఫిబ్రవరి 1953

# ఆంధ్రలో హిందీప్రచార ఉద్యమ లక్ష్యం

లను, వ్యాసములను, దేవనాగరి, తెలుగు లిపులలో గూడ ప్రచురించి ప్రచారాభివృద్ధికి తోడ్పడినవి

ప్రస్తుతకాలములో రేడియోల ద్వారా హిందీపాఠములు, ఉపన్యాసములు, నాటికలు ప్రసారము చేయబడుచుండుటవలన అధి హిందీ ప్రచారమునకు దోహద మొసగుచున్నవి

## శ్రీ నాగేశ్వరరాయ హిందీ భవనము

శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్ర దేశాభ్యుదయమునకు చేసిన సేవ, వారు చేసిన వితరణములు, ఆంధ్రదేశము మరువజాలదు మనదేశములో వారి సహాయము పొందని జాతీయసంస్థ లేదనియే చెప్పవచ్చును అటివారికి తగినస్మారక చిహ్నము ఆంధ్రదేశములో నెలకొల్పజాలకపోవుట విచారకరము హిందీ ప్రచారోద్యమమునకువారు చేసిన సహా

ఆయుర్వేద వైద్యప్రచారానికి విశేష కృషిచేసిన డా॥ ఆచంట లక్ష్మీపతిగారు

యము హిందీ ప్రచారకులు, భాషాభిమానులు ఎట్లు మరవగలరు? వారి స్మారక చిహ్నముగ ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారకసంఘము 25 వేలు రూప్యముల నిధి వసూలుచేసి నిర్ణయించినది కాని 8 వేల రూపాయలు మాత్రమే వసూలు చేయగలిగినది ఆ ధనంతో విజయవాడలో ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘమునకు భవనము నిర్మించి, అందు

ఆంధ్ర జాతీయ కాంగ్రెసు కార్యదర్శి పనిచేసిన శ్రీ శే. వారు రాజారావుగారు

1948 సం॥ లో కార్యాలయము నెలకొల్పబడినది ఆ నిర్మాణమునకు శ్రీ నాగేశ్వరరాయ హిందీభవనమని పేరు పెట్టబడినది ఈ మాత్రమైనా, శ్రీ నాగేశ్వరరాయ స్మృతి చిహ్నమును నెలకొల్పగలిగిన ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘము, మిగిలిన ప్రాంతీయ సభలకంటె, ముందుగనే భవన నిర్మాణము గావించుకొని, వాటికి మార్గదర్శకమయ్యెను.

## హిందీ ప్రచారక విద్యాలయము విజయవాడ

హైస్కూళ్లలో బోధించు హిందీ పండితులు ట్రెయినింగు శిక్షణ పొంది యుండవలెనని మదరాసు ప్రభుత్వము వారు నిర్ణయించినందువలన ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘమువారు విజయవాడలో మాచవరమునకు సమీపమున, పై విద్యాలయమునకై 8500 చ॥ గజముల స్థలముకొని అందు పర్ణశాలలు నిర్మించిరి వానియందు విద్యార్థులకు హాస్టలు, విద్యాలయము, వసతులు ఏర్పాటు చేయబడినవి ఉపాధ్యాయులకుగాను ఒక చిన్న భవనముకూడా నిర్మింపబడియున్నది

ఇటువంటి ప్రచారక విద్యాలయము, శ్రీ యలమంచిలి వెంకటేశ్వరరావు గారి అధ్వర్యమున విద్యావనములో నడుపబడుచున్నది. ఆంధ్రదేశమునందంతకును, ప్రచారక శిక్షణ ఇచ్చునట్టి విద్యాలయములు ఈ రెండు మాత్రమే

1946 సంవత్సరం జనవరి ఫిబ్రవరి నెలలలో శ్రీ మహాత్మాగాంధీగారి అధ్యక్షతను హిందీ ప్రచార రజత జయంతి మహోత్సవములు అతి వైభవముగా జరిగినవి

## ఆంధ్రలోని హిందీ రచయితలు

ఆంధ్రదేశమందలి హిందీ ప్రచారకులలో గద్య పద్య రచయితలుగూడ బయలుదేరుట ముదావహము ప్రప్రథమమున 1922 28 వ సంవత్సరంలోనే శ్రీ శే అంధ్యాల శివన్నశాస్త్రిగారు హిందీ తెలుగు కోశమును, హిందీ తెలుగు వ్యాకరణమును రచించి పలువుర మెప్పువడసిరి శ్రీ హృషీకేశశర్మ గారు హిందీ-తెలుగు స్వబోధిని రచించిరి తదుపరి ఆ స్వబోధినిని శ్రీ మోటూరి సత్యనారాయణ గారు బాగుగా సంస్కరించి హిందీ-తెలుగు, హిందీ ఇంగ్లీషులలో రచించిరి. హిందీని స్వయం కృషిచేసి కొంతవరకు నేర్చుకొనుటకు యీ పుస్తకము ఎంతియు ఉపయోగపడుచున్నది శ్రీ పింగళి లక్ష్మీపతి రాయి, శ్రీ చోడవరపు రామశేషయ్య, శ్రీ వారణాసి రామమూర్తి 'రేణు', శ్రీ కర్ణ వీరనాగేశ్వరరావు, శ్రీ యలమంచిలి వెంకటేశ్వరరావు, శ్రీ యలమంచిలి వెంకటప్పయ్య, శ్రీ కంచెర్ల వెంకట కృష్ణయ్య, శ్రీ కస్తూరి సుబ్బారావు, శ్రీ జి సుందరరెడ్డి, శ్రీ వేమూరి ఆంజనేయశర్మ, శ్రీ పి గురునాథశర్మ, శ్రీ అయాచితుల హనుమచ్ఛాస్త్రి, శ్రీ కర్రిపత్తి చలపతిరావు, శ్రీ వల్లూరి సుబ్రహ్మణ్యం, శ్రీ దుర్గానంద్, శ్రీ ఆలూరి బైరాగి, శ్రీ కోట సుందరరామశర్మ, శ్రీ కామాక్షిరావు, శ్రీ దండమూడి వెంకట కృష్ణారావు,

శ్రీ తంకొాయల పాటి శేషగిరిరావు శ్రీబూదరాజు వెంకట సుబ్బారావు, శ్రీ వైసాని శ్రీరాములు గుప్త మొదలగువారు హిందీలో కథలు, విమర్శలు, గద్యపద్య రచనలుచేయుచు హిందీ ప్రచారాభివృద్ధికి అమితముగ తోడ్పడుచున్నారు వీరుగాక శ్రీ దోనేపూడి రాజారావుగారు "శిక్షక" అను హిందీ మాసపత్రికను కొంతకాలము జయప్రదముగా నడిపియుండిరి.

## హైదరాబాదు హిందీ ప్రచార సంఘము

ఆంధ్రదేశములోని హిందీ ప్రచారముతోబాటు, హైదరాబాదు రాజ్యములోగూడ హిందీ ప్రచారము ఉత్సాహముతో నడపబడుచున్నది స్వరాజ్యము వచ్చిన వెనుక హైదరాబాదు ప్రత్యేక రాష్ట్రముగా చేయబడుటవలన, అక్కడ ఆంధ్ర రాష్ట్ర హిందీ ప్రచార సంఘమువారు 1951 లో ఒక శాఖా కార్యాలయ

ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య

మును స్థాపించి శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారిని కార్యదర్శిగా నియమించిరి అప్పటినుండి హైదరాబాదు రాజ్యంలోని ప్రముఖులు శ్రీ బూరుగుల రామకృష్ణరావు, మేల్కొటే, రంగారెడ్డి, మాడపాటి హనుమంతరావు, జనార్దనరావు దేశాయి, 'బిందు' రామానందతీర్థ, శ్రీ శే సురవరం ప్రతాపరెడ్డి, వల్లూరి బసవరాజు, మున్నగువారు భాషా భేదములు పాటింపక సర్వవిధముల సహాయము చేయుచున్నారు హైదరాబాదు ప్రభుత్వము వారు సభవారి పరీక్షలను ఆమోదించుటయేగాక ఆర్థిక సహాయమును చేయుచు నిండుగా తోడ్పడుచున్నారు

ఆంధ్రదేశములోని హిందీ ప్రచారోద్యమము కేవలము హిందీ భాషా వ్యాప్తితో సంతృప్తిపొందక భారతీయ సంస్కృతి సమన్వయమునకును, ప్రాంతీయ భాషాభివృద్ధికిని, తద్వారా జాతీయైక్యతకు మిక్కిలి పాటుపడుచున్నది ఈ లక్ష్యసిద్ధికై ఈ సంవత్సరము జనవరినెలలో విద్యావనములో శ్రీ సురవరము ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతను భారతీయ సంస్కృతి మొదటి మహాసభ జరుపబడినది. మదరాసు విద్యామాత్యులగు శ్రీ మల్లవరపు వెంకట కృష్ణరావుగారు సభకు ప్రారంభోత్సవం జరిపిరి ఈ ఉద్యమమునకంగు మిగుల ఆసక్తి గలిగిన శ్రీ సు॥ ప్రతాపరెడ్డిగారు, ఈ మహాసభాలక్ష్యములు సాధింపబడక పూర్వమే అకాలములో దివంగతులగుట మిగుల విచారకరము.

## ప్రస్తుతస్థితి - భావిఆశయము

ప్రస్తుతము ప్రభుత్వమువారు పాఠశాలలలో హిందీకి కల్పించిన స్థానము ఏమియు సంతోషజనకముగా లేదు హిందీ భాషను ఐచ్ఛిక విషయముగ ఏర్పాటు చేసినందువలనను, ఐచ్ఛిక విషయము చదివెడి వారికికూడ అందు పరీక్ష లేకుండుటవలనను అందరకును చాలా అసంతృప్తి కలిగియున్నది ఆంధ్రరాష్ట్రము ఏర్పడనున్నది గాన, అయ్యది ఏర్పడిన తర్వాత నయినను మాతృభాషకును, హిందీకిని, ఇంగ్లీషుకును సముచితస్థానను లభించుననియు, ఆంధ్ర రాష్ట్రములో పరిపాలనా భాషగా తెలుగే వ్యవహరింపబడుననియు, హిందీ అంతఃప్రాంతీయ భాషగాను, ఇంగ్లీషు అంతర్దేశీయ భాషగాను ఉపయోగింపబడుననియు

శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు

భావించుచున్నాము

చిరకాలమునుండి వాంఛించుచున్న ఆంధ్రరాష్ట్రము అక్టోబరు 1 వ తేదీన కర్నూలు తాత్కాలిక రాజధానిగా స్థాపింపబడనున్నది అయ్యది ఆంధ్రుల రాజకీయ, ఆర్థిక సాంఘిక, సాంస్కృతిక సాహిత్య రంగాలలో పూర్ణవికాసమును పొంది, ఆ చిరకాలములోనే సర్వతోభాభివృద్ధి పొందవలెనని దయామయుడగు సర్వేశ్వరుని వేడుకొనుచున్నాము

ఓమ్ శాన్తిః శాన్తిః శాన్తిః

అసలో మాసద్గమయ

దక్షిణ భారత్ హిందీ ప్రచారసభ అయిదవ స్నాతకోత్సవ ఉత్సవములు సంగమమున జరిగెను. అలహాబాద్ హిందీ పండితులు పండిత సుందరలాల్ గారు సభకు అధ్యక్షత వహించారు. శ్రీయుతులు సి రాజగోపాలాచారి, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరపంతులు, హరిహర శర్మ ప్రభృతులు ఈ చిత్రంలో పాల్గొన్నారు

# హిందీ ఉద్యమం

1918 సం॥రమున ఇందూరులో గాంధి మహాత్ముని అధ్యక్షతన జరిగిన హిందీ సాహిత్య సమ్మేళనములో దక్షిణ భారత దేశమున హిందీభాషా ప్రచారము చేయవలెనని తీర్మానింపబడెను. ఆ తీర్మానము అమలుజరుపుటకు గాంధి మహాత్ముడు తన కుమారుడైన దేవదాసు గాంధిని పంపించి, హిందీప్రచారము ప్రారంభింపజేసెను. తరువాత పరివ్రాజక స్వామి సత్యదేవుగారిని పంపగా వారు మద్రాసులో హిందీతరగతులు ప్రారంభించి హిందీ ప్రచారమునకు అంకురార్పణ చేసిరి

ఆంధ్రదేశములో హిందీప్రచారము చేయుటకు 1919 20 లో శ్రీయుతులు అవధానందన్ రామానందశర్మ హృషీకేశశర్మ, రాంభరోసా, రఘువరదయాళు మిశ్ర, రామగోపాలశర్మ మున్నగు ఉత్తర భారతీయులు పంపబడిరి. ఆకాలముననే, దేశాభిమానము, భాషాభిమానముగల యువకులు శ్రీ హరిహరశర్మ, శ్రీ మ శివరామశర్మ, శ్రీ శ్రీ జంధ్యాల శివన్నశాస్త్రి, శ్రీ శ్రీ పిసపాటి వెంకట సుబ్బారావు మల్లాదివెంకటసీతారామాంజనేయులు, శ్రీ నరసింహాచార్యులు, శ్రీ దమ్మాలపాటి రామకృష్ణశాస్త్రి, మేడిచర్ల వెంకటేశ్వరరావు, మిలుదొడ్డి రాజా నరసింహారావు మున్నగు యువకులనేకులు, ప్రయాగకు, హిందీ శిక్షణ పొందుటకు పంపబడిరి వారు అక్కడ హిందీని అభ్యసించి వచ్చి తమ తమ ప్రాంతములలో హిందీప్రచారము ప్రారంభించిరి. అనేకచోట్ల జాతీయ కళాశాలలు ప్రారంభింపబడెను ఆంధ్ర కాంగ్రెసు నాయకులు, శ్రీ శ్రీ కొపల్లి హనుమంతరావు, శ్రీ శ్రీ ముట్నూరి కృష్ణరావు, శ్రీ శ్రీ దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు వారి సతీమణి శ్రీ శ్రీ లక్ష్మీబాయమ్మగారు, శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు మొదలైన పలువురు ప్రముఖులు హిందీ ప్రచారోద్యమమునకు ఎంతో తోడ్పడిరి 1920 లో రాంభరోసాగారు ఆంధ్రదేశమున సంచాలకులుగ నియమింపబడిరి. తరువాత, రాంభరోసాగారి వద్ద హిందీ నభ్యసించి వారి మన్ననలకు పాత్రులై, శ్రీ మోటూరు సత్యనారాయణగారు సంచాలకులైనారు

1920 ప్రాంతమున, గుంటూరులో శ్రీ పండిత రామానందశర్మగారు తమ యింట్లోనే, ఆనందాశ్రమము పేరిట హిందీ పాఠశాల ప్రారంభించిరి అది ఆశ్రమయుగము ప్రతిచోటా ఆశ్రమములు, జాతీయ కళాశాలలు విరివిగా స్థాపింపబడుచుండెడివి. 1921-22 లో రాజమహేంద్రవరమున ప్రథమంగా హిందీప్రచారక విద్యాలయము, హిందీ ప్రచారక ఆశ్రమము అనుపేరుతో శ్రీ. శ్రీ. కుప్పేశ్వర రావుగారి తోటలోని బంగళాలో నెలకొల్పబడినది. కాంగ్రెసు కమిటీవారు యీ విద్యాలయమునకు వెయ్యి రూ॥లు విరాళమిచ్చారు. శ్రీ. శ్రీ. నాగేశ్వరరావు ఆర్థికంగా ఎంతో సహాయం చేస్తుండేవారు. ఈ విద్యాలయంలో శిక్షణ పొందిన ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, శ్రీ సోమయాజులు, భట్టారం వెంకటసుబ్బారావు ప్రభృతులు యీ సం॥ రాలుగా హిందీ ప్రచార క్షేత్రంలోనే పనిచేస్తున్నారు.

## కాకినాడ కాంగ్రెసు

1923 డిసెంబరులో కాంగ్రెసు మహాసభతోపాటు శ్రీ. శ్రీ. శ్రీ మాలానా మహమ్మదలీ అధ్యక్షతన కాకినాడలో హిందీ మహాసభ జరుపబడెను. ఆహ్వాన సంఘాధ్యక్షులు శ్రీ. శ్రీ. కొండా వెంకటప్పయ్య పంతులుగారు హిందీలోనే స్వాగతోపన్యాసం చదివారు.

1924 సం॥న కాంగ్రెసువారి యాజమాన్యమునగల గుంటూరు, నెల్లూరు, రాజమండ్రి మున్నగు మునిసిపాలిటీలలో పాఠశాలలలో హిందీబోధనకు అవకాశములు కల్పింపబడెను. నరసింహారావుగారు చైర్మన్‌గా ఉన్న గుంటూరు మున్సిపాలిటీలో 1925 లో 38 పాఠశాలలలో హిందీ రాట్నము నడుపుట యేర్పాటు చేయబడెను. తరువాత జిల్లాబోర్డు పాఠశాలలలోగూడా హిందీకి ప్రవేశము కలిగెను

> శ్రీ ఉన్నవ
> రాజగోపాలకృష్ణయ్య

## దక్షిణ భారత హిందీ ప్రచార సభ

1918 లో ప్రారంభమైన హిందీ ప్రచారోద్యమం 1927వరకూ ప్రయాగలోని హిందీ సాహిత్య సమ్మేళనము వారి అధిపత్యమున సాగినది నేటి దక్షిణ హిందీప్రచారసభ అంతవరకూ, హిందీ సాహిత్య సమ్మేళనము మద్రాసుశాఖగా వ్యవహరించుచుండెడిది 1927లో మహాత్మ గాంధిగారు, యీ ఉద్యమాన్ని దక్షిణాది స్వయం పోషకంగా నడుపవలెనని దక్షిణ భారత హిందీ ప్రచార సభ అను పేరుతో మద్రాసులో రిజస్టరు చేయించిరి ఈ సంస్థ ప్రత్యక్ష యాజమాన్యమున దక్షిణదేశములోని నాలుగు ఆంధ్ర, తమిళ, కేరళ, కర్ణాటక ప్రాంతాలలో హిందీ ప్రచారము సాగెను.

## హిందీ ప్రచారము 1936-53

ఆంధ్రరాష్ట్రములో శ్రీ గాంధిమహాత్ముని ప్రేరణచే ప్రారంభింపబడి నేటివరకు నిర్విఘ్నముగా కొనసాగింపబడుచున్న యీ 34 సంవత్సరముల హిందీ ప్రచారోద్యమ చరిత్రను రెండు అధ్యాయములుగ విభజింపవచ్చును

1936 సం॥నకు పూర్వము దక్షిణ ప్రాంతములోని అన్ని ప్రాంతముల నుండి ధనము సేకరించుటయు, ధనము విరివిగా వసూలు కాని ప్రాంతములలో దానిని వెచ్చించుటయు జరుగుచుండెడిది అందుపై, మన ఆంధ్ర నాయకులగు శ్రీ శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు, శ్రీ శ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారు, శ్రీమతి దుర్గాబాయమ్మ, శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య, శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు, శ్రీ గొల్లపూడి సీతారామశాస్త్రి (స్వామిసీతారాం) గార్లు మొదలగు ప్రముఖులును శ్రీ భాలచంద్ర ఆప్టే, శ్రీ శ్రీ పిసపాటి వెంకటసుబ్బారావు, శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, ముక్తినూతులపాటి హనుమంతరావు, శ్రీ శ్రీ ఓరుగంటి వెంకటేశ్వరశర్మ, శ్రీ శ్రీ కోటంరాజు సీతాపతిశర్మ మొదలగు హిందీ ప్రచారకులును, దక్షిణభారత దేశములోని నాలుగు ప్రాంతములను భాషాయుక్త రాష్ట్రములుగ విభజించి హిందీ ప్రచార సంఘములు స్థాపించినగాని ఆయాప్రాంతములలో విరివిగా ధన సహాయము లభింపదనియు, మరియు హిందీ ప్రచారోద్యమము బలపడదనియు దక్షిణభారత హిందీ ప్రచార సభకు అధ్యక్షులగు శ్రీ గాంధీ మహాత్మునకు విన్నవించిరి అందుపై మహాత్ముడు శ్రీ కాకా సాహెబు కలేల్కరు గారిని పంపి, ఇక్కడి నాయకులతో సంప్రదించి వేరువేరు రాష్ట్ర ప్రచార సంఘములను స్థాపించుటకు స్కీములు తయారుచేయవలసినదిగా ఆదేశించిరి ఏ తత్ఫలితముగా 1936వ సం॥న బెజవాడలో ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘము, తిరుచినాపల్లి తమిళప్రాంతీయ హిందీ ప్రచార సభ, దార్వార్‌లో కర్ణాటక ప్రాంతీయ హిందీ ప్రచారసభ, ఎర్నాకులంలో కేరళప్రాంతీయ హిందీ ప్రచారసభ స్థాపింపబడెను.

1936 సం॥న స్థాపింపబడిన ఆంధ్ర సంఘమునకూ శ్రీ శ్రీ శ్రీ దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులుగారు తమ జీవితపర్యంతము అధ్యక్షులుగా నుండి సంఘాభివృద్ధికి విశేషముగా కృషిచేసిరి వారిఅనంతరము శ్రీ ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారు సంఘాధ్యక్షులుగా ఎన్నుకొనబడిరి హిందీ ప్రచారోద్యమ ప్రారంభదశనుండి హిందీప్రచారమే తమ జీవితలక్ష్యముగా నిర్ణయించుకొని హిందీ ప్రచారము చేసిన శ్రీ శ్రీ శ్రీ పిసపాటి వెంకటసుబ్బారావుగారు సంఘ కార్యదర్శిగా 1936 సం॥న నియమింపబడి 1941 వరకు తమ జీవితపర్యంతము కార్యదర్శిగా పనిచేసి సంఘాభివృద్ధికి తోడ్పడిరి వారి అనంతరము ఉన్నవ రాజగోపాలకృష్ణయ్యగారు కార్యదర్శిగా పనిచేయుచున్నారు శ్రీ ఎర్నేని లక్ష్మీనారాయణ చౌదరిగారు ప్రారంభమునుండియు నేటివరకు సంఘమునకు కోశాధ్యక్షులుగా నుండి ఆర్థికముగా సంఘమున కట్టి ఒడుదుడుకులు లేకుండా దానిని నడుపుచున్నారు మహాసభలు, ప్రచారక సమ్మేళనములు, నాటక సమాజములు హిందీ ప్రేమీమండలులు, హిందీ పుస్తక ప్రదర్శనలు మున్నగు సాధనముల ద్వారా హిందీ ప్రచారము సాగింపబడుచున్నది

శ్రీ నాగేశ్వరరాయ హిందీ భవనము - విజయవాడలో ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘ కార్యాలయము.

## ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారక మండలి

జాతీయ భావపూరితులగు ప్రచారకులలో ఐకమత్యమును నెలకొల్పుటకును, సాహిత్యమందలి అభిరుచిని పెంపొందించుటకును, హిందీ ప్రచారాభివృద్ధికిగల సాధక బాధకములను విచారించి వీలయినంతవరకు తన్నివారణకు కృషిచేయుటకును ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారక మండలి స్థాపింపబడినది. ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసంఘమువారు ఈ మండలికి సహాయపడుచు ప్రతిసంవత్సరము జరుగు హిందీ మహాసభలతోపాటు ప్రచారక సమ్మేళనమును సైతము ఏర్పాటు చేయుచున్నారు ఇంతవరకును అనుభవముగల హిందీ ప్రచారకులు, భాషాభిమానుల అధ్యక్షతను వేరువేరు పట్టణములలో 17 హిందీ ప్రచారక సమ్మేళనములు జరిగినవి.

## హిందీ నాటక సమాజములు

వివిధ పట్టణములలో హిందీ నాటక సమాజములు స్థాపించి నాటక ప్రదర్శనముల ద్వారా జనసామాన్యమందు గూడ హిందీ భాషాభిరుచిని కలిగించుచున్నారు బందరులోని బృందావన నాట్యమండలి, ఏలూరులోని హిందీ ప్రేమీమండలి నాటక సమాజము, చిత్తూరులోని హిందీ నాటకమండలి, రాజమండ్రి, భీమవరములలోని హిందీ నాటక సమాజములు, ఆంధ్రరాష్ట్ర హిందీప్రచార సంఘము వారిచే స్థాపింపబడిన ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార నాట్యమండలి పేర్కొనదగినవి ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార నాట్యమండలివారు దక్షిణ భారత హిందీ ప్రచార సభవారు జరిపిన అంతర్ప్రాంతీయ హిందీ నాటకపోటీ పరీక్షలో 1938, 39, 40 సంవత్సరములలో వరుసగా మూడు పర్యాయములు పోటీలో ప్రథమ తాంబూలము పుచ్చుకొని మూడవపర్యాయము పోటీకి ఏర్పరచిన షీల్డును బహుమతి గొనిరి

## హిందీవిద్యాలయములు

ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచార సంఘ పక్షమున కడప, కవనూరు, చిత్తూరు, వినయాశ్రమము, గాంధి ఆశ్రమము (కొమరవోలు) విజయవాడ, రాజమండ్రి, అనకాపల్లి, అనంతపురం మొదలగు పట్టణములలో హిందీ విశారద ప్రచారక విద్యాలయములు నడుపబడినవి శ్రీ రామానందశర్మ, భాలచంద్ర ఆప్టే, వేమూరి ఆంజనేయశర్మ, దశిక సూర్యప్రకాశరావు, చిట్టూరి లక్ష్మీనారాయణశర్మ, కొత్తపల్లి వెంకటకృష్ణశర్మ, అరికపూడి రాఘవేంద్రరావు, వద్దిపర్తి చలపతిరావు, దుర్గానంద్, దువ్వూరి కామేశ్వరరావు, శ్రీ మ. శివరామశర్మ, సోమనాథ్, వండూరు శ్రీధరాచార్యులు, చంద్రభట్ల అప్పన్న శాస్త్రి గార్లు మున్నగువారు అధ్యాపకులుగా నుండి పై విద్యాలయములను నిర్వహించిరి రాజమహేంద్రవరములో మహిళలకు ప్రత్యేకము హిందీ విశారద విద్యాలయము నడుపబడుచున్నది.

స్వతంత్రముగ శ్రీ యాలమంచిలి వెంకటప్పయ్యగారు ఏలూరు నగరప్రాంతములోను, శ్రీ బోయపాటి నాగేశ్వరరావుగారు తెనాలిలోను, శ్రీ యలమంచిలి వెంకటేశ్వరరావుగారు విద్యావనములోను హిందీ విద్యాలయములు నెలకొల్పి ప్రశంసనీయముగ ప్రచారము చేయుచున్నారు

## హిందీ ప్రచారక శిబిరములు

అనంతపురము, నెల్లూరు, రాజానగరము మొదలగు కేంద్రములలో హిందీ ప్రచార శిబిరములు 5, 6 వారములు నడపి అందు పెద్దలచే వివిధ విషయములను గురించి ఉపన్యాసములు ఇప్పించుటచే హిందీ ప్రచారకులు కేవలము హిందీ భాషాజ్ఞానముతో మాత్రమే తృప్తిచెందక - దేశాభ్యుదయమునకు సంబంధించిన అనేక విషయములను గురించి తెలిసికొని వివిధ కార్యకలాపములలో పాల్గొనుటకు తగిన జ్ఞానోపార్జనకై వీని అలవరచుకొనుటకు అవకాశము కలుగుచున్నది.

1944 వ సంవత్సరములో కృష్ణాజిల్లా హిందీప్రచారక మండలివారు ప్రత్యేకముగా ఒక శిబిరమును, కొమరవోలు గాంధి ఆశ్రమములో నడపియుండిరి. ఢిల్లీలోని సుప్రసిద్ధ రచయితలగు శ్రీ జైనేంద్రకుమార్ గారిని ఢిల్లీ నుండి రప్పించి వారిచేత సాహిత్య గోష్ఠిని జరిపించిరి. అప్పుడు రాజమండ్రి, ఏలూరు, బెజవాడలలోగల సాహిత్యపరులు అక్కడకు విచ్చేయుటచేత ఆంధ్రసాహిత్య వేత్తలగోష్ఠి గూడ జరుపబడెను.

## పత్రికలు-హిందీప్రచారము

ఆంధ్ర దినపత్రిక లేమి, వారపత్రికలేమి, హిందీ ప్రచారోద్యమమునకు మొదటనుండియు తోడ్పడుచు న్నయున్నవి. హిందీ భాషా విషయమయిన సమాచారములు ప్రచురించుచు ప్రబోధము చేయుటయే గాక ముఖ్యముగా ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, కాంగ్రెసుపత్రిక మొదలగు నవి తమ పత్రికలలో స్వయముగా హిందీ నేర్చుకొనుటకు తగిన పాఠము

# నలభైసంవత్సరాల నిరంతర కృషి: 'గిడుగు' విజయం

56 వ పేజీ తరువాయి

కులోనికి అనుమతించబడెనుగాని గ్రాంథిక భాషలోగాని విద్యార్థుల వాడుక భాషలోగాని వ్రాయించవచ్చునన్న స్వేచ్ఛ విద్యార్థులకు కలిగించారు అందుకు ఆదర్శప్రాయముగా ఉండదగిన వచన గ్రంథము-గ్రీకు పురాణ కథలు అనేది పుట్టి లక్ష్మీనరసింహము గారిచేత వ్రాయించి అది పాఠ్యగ్రంథముగా పెట్టించారు అది వాస్తవముగా కేవలము వాడుకభాషలో రచితము కాలేదు అందులో అర్ధానుస్వారములు, శకటరేఫలు అవుడు వావుడు మొదలయిన ప్రాచీన గ్రాంథిక రూపాలు మాత్రమే లేవు అయినా ఆ గ్రంథమునకు శ్రీనివాస అయ్యంగారు వ్రాసిన ఉపోద్ఘాతములో వ్యావహారిక భాషను ప్రోత్సహించే వాక్యము లుండుటచేత తెలుగుదేశమంతటను ఈ నూతనోద్యమమునకు విరుద్ధమైన సంరంభము చెలరేగినది ప్రతి పట్టణమందు ప్రతి పెద్ద పల్లెలోను గ్రామ్యభాషను తొలగించవలెను; గ్రాంథిక భాషను నిలబెట్టవలెను. అనే ఘోష ఎక్కువయినది



## ఆంధ్ర సాహిత్యపరిషత్తు అవతరణ

ఆంధ్ర సాహిత్య పరిషత్తు ఆటి వాతావరణములో 1911 సం॥న పుట్టినది. గ్రాంథిక భాషా సంరక్షక సమాజములు లేచినవి ఈ పరిషత్తుకు రాజపోషకులు శ్రీ పిఠాపురము మహారాజులు, పడుముకట్టుకొని పనిచేసిన వారిలో ప్రధానులు జయంతి రామయ్య పంతులుగారు వారికి అండగా నిలిచిన పండితులలో ముఖ్యులు వేదము వేంకటరాయ శాస్త్రిగారు గ్రామ్య భాషానిరసనము, గ్రాంథికభాషా సంరక్షణము కావించడానికి ఎక్కువగా ప్రచారము చేసినవారు కూచి నరసింహము గారు, చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు సమావేశములను జరిపించడములో ఉత్సాహము మిక్కుటముగా చూపించినవారు వ్యాపతి సుబ్బారావు గారు రాజకీయముగా శాసనసభలలో ఈ నూతనోద్యమమునకు విఘాతము కలిగించడానికి పూనుకొన్నవారు బయ్యా నరసింహేశ్వరశర్మగారు, మోచర్ల రామచంద్రరావుగారు, కేసుపల్లి రామదాసుపంతులుగారు మొదలయిన వారు వీరూవారూ అని పేర్కొనడమెందుకు? ఎవరో పదిమంది విద్యాధికులు తప్ప తక్కిన వారందరున్ను పెద్దలు, పిన్నలు, పురుషులు, స్త్రీలు అందరున్ను ప్రతిఘటికాపంరంభములో చేలొన్నవారే

## మద్రాసు విశ్వవిద్యాలయ విచారణసంఘం

అందుచేత ఏకోపలక్షణపడి ప్రభుత్వము వారు స్కూల్ ఫైనల్ విద్యాప్రణాళికలో మూడు నాలుగేండపాటు వ్యావహారిక భాషలో వ్యాసరచన సాగించే ఏర్పాటు జరిగినా తుదకు విశ్వవిద్యాలయము వారు ఇంటర్ మీడియేట్ వ్యాసరచన విషయములో ఎట్టిభాష వుండవలెను అనే విషయము నిర్ణయించడానికి ఒక సలహాసంఘాన్ని నియమించారు. అందులో ఉభయపక్షాల ప్రతినిధులను అటు వేదము వేంకటరాయశాస్త్రి జయంతి రామయ్యపంతులు కొమర్రాజు లక్ష్మణరావుగార్లను ఇటు గురజాడ అప్పారావు బుర్రా శేషగిరిరావుగార్లను మ తిమ్మడిగారిని, శామ్యన్ దొరగారిని చేర్చుకున్నారు సమావేశకర్తగాను సంఘాధ్యక్షులుగాను ప్రొఫెసర్ రంగాచారిగారిని నియమించారు. చర్చలు తీవ్రముగా జరిగినవి గ్రాంథిక భాషారూపాలతోపాటు వ్యావహారిక భాషారూపాలను కూడా వ్యాసరచనలో వాడవచ్చును అనే తీర్మానము అధ్యక్షుల కాస్టింగ్ వోటుతో నెగ్గినది

## రాయలసీమవారి ఆక్షేపణలు: గ్రాంథిక భాషావాదుల తొలి విజయం

అది తమకు అనిష్టముగుటచేత గ్రాంథిక భాషావాదులలో పలుకుబడి గలవారు రాయలసీమవారిచేత ఉద్యమాన్ని పెట్టించారు వ్యావహారిక భాషారూపాలు మా రాయలసీమలో లేక సర్కారు జిల్లాలలో ఉన్నవే మీరు అనుశాసిస్తే మా జిల్లాల విద్యార్థులకు అన్యాయం జరుగుతుంది కనుక, ఈ సలహాసంఘములో మా ప్రతినిధులను కూడా చేర్చుకొని ఆ రూపాలను నిర్ణయించవలెను అని రాయలసీమవారు కోరినారు అప్పటికింకా వ్యావహారిక భాషావాదము రాయలసీమకు ప్రాకనందున వారిలో ఈ నూతనోద్యమమును వార్షించినవారొక్కరును లేరు అందుచేత వారి కోరికను మన్నించి రాయలసీమ ప్రతినిధులను చేర్చుకొన్నప్పుడు ఆ సలహా సంఘములో గ్రాంథిక భాషావాదుల సంఖ్య అత్యధికమయినది అయినా, వ్యావహారిక భాషారూపములను నిర్ణయించుటకే కదా అని వ్యావహారిక భాషావాదు లనుకొంటూ ఉండగా జరిగిపోయిన తీర్మానమును చమత్కారముతో విపరీతముగా వ్యాఖ్యానించి గ్రాంథిక భాషావాదులయిన సభ్యులు తమ పంతము నెగ్గించుకున్నారు ఆ తీర్మానము "Classical Telugu forms as well as modern Telugu formes" అని అంటే అందులోని 'as well as' అనే మాటలవలన రెండువిధములయిన రూపములున్ను అని అర్థముకాదు, ఏ రూపములయితే గ్రాంథికభాషలోను వ్యవహారములోను (రెంటను) ఉంటవో అవి అని అర్థమని వ్యావహారిక భాషావాదమును పడగొట్టినారు యూనివర్సిటి సిండికేటువారు దీనిని అనుసరించి "ఇప్పట్లో మద్రాసు యూనివర్సిటీ వ్యావహారిక భాషను అంగీకరింపలేదు" అని తీర్పుచెప్పినారు ఆ సలహాసంఘము వారు వ్యాసరచనకు కావలసిన భాషాస్వరూపము తెలియజేయుగల వచన గ్రంథముల పట్టికకూడా తమ తీర్మానమునకు జోడించినారు అది సిండికేటువారు ఆమోదించినారు ఆ గ్రంథములలో గ్రాంథికభాషా లక్షణమునకు విరుద్ధమయిన వ్యావహారిక భాషా రూపాలు కొన్నింటిలో తక్కువగాను మరికొన్నిటిలో ఎక్కువగాను మెండుమీద ఇంచుమించు అన్నిటిలోను ఉన్నది కానీ ఆ విషయము అప్పట్లో ఎవ్వరును గుర్తించలేదు ఆ తర్వాత మా తండ్రిగారు ఆ గ్రంథములలోగల వ్యావహారిక భాషా రూపాలే కాక 'మీరు వచ్చిరి', 'ఆ పోయినారు', 'ఐక్యత' వంటి కృతక భాషారూపాలు కూడా ఏర్చి పట్టికలు తయారుచేశారు

విశ్వవిద్యాలయమువారి తీర్మానాన్ని అనుసరించి ప్రభుత్వ విద్యాశాఖ వారుకూడా వ్యావహారిక భాషను అంగీకరించ లేకున్నారు

## వ్యావహారిక భాషాఉద్యమం ప్రారంభం

ఇక కర్తవ్యమేమని ఆలోచించి మరల ప్రచారముల దీక్షవంటి దీక్షపూని తమ ఉద్యమము దేశములో వ్యాపింప జేయుటకు సంకల్పించారు అందుకు తగిన పరికరములను శిష్యులను జతపరచుకొన్నారు 1911 మొదలుకొని తెలుగు వ్యాకరణములు, అప్పకవీయము సర్వలక్షణ సంగ్రహమువంటి లక్షణ గ్రంథాలు, నన్నయనాటినుండి గల పద్య కావ్యాలు, ఆధునిక వచన రచనలు-కనబడ్డ పుస్తకాలన్నీ ఒకే దీక్షగా చదువుతూ అందులో పూర్వవ్యాకరణ సూత్రాలకు విరుద్ధముగా ఆయా కాలములందలి వ్యావహారిక భాషా రూపాలు ఎట్లు గ్రంథములలోనికి ఎక్కుతూ వచ్చినవో గుర్తించుకొంటూ వచ్చారు. ఆపనిలో నేను మొదటనుండిన్నీ వారికి సహాయుడుగా ఉన్నాను 1915 నుండిన్నీ చిలుకూరి నారాయణరావు తోడయినాడు. ఆ తర్వాత అతడు ఎమ్ ఏ అయి తెలుగు లెక్చరరు కావడముచేత అతని తోడ్పాటు ఎక్కువగుటకు అవకాశము కలిగినది వ్యాకరణములు అనుశాసించిన రూపాలకు భిన్నమయిన వ్యావహారిక భాషా రూపాలు ఏయేకావ్యమందు ఏవేవి గలవో పట్టికలు తయారుచేసినాము 1934 లో ప్రకటితమయిన 'బాలకవి శరణ్యము' అనే గ్రంథమందలి రూపములు, ప్రయోగములు, పద్యములు అన్నీ 1914 నుండిన్నీ సేకరించినవి ఇవన్నీ చిన్నయసూరి నీతిచంద్రికలో ప్రాచీనభాషా లక్షణమునకు విరుద్ధమయిన ప్రయోగములున్నూ అతని వ్యాకరణములో ప్రౌఢ వ్యాకరణము సూచించిన లోపములే కాక తక్కిన లోపములున్ను, చిన్నయసూరికి పూర్వమున్ను చిన్నయసూరి కాలమందున్ను వచనరచన కావ్యరచన వలెగాక ఆయా కాలముల వ్యావహారిక భాషలోనే సాగినదనుటకు తగిన ప్రమాణములున్ను ఆధునిక రచయితలు గ్రాంథిక భాషలోనే రచిస్తు

(59 వ పేజీ చూడుడు)

తెనాలి కళాశాలలో తెలుగు ఉపన్యాసకులు "వేమనయోగి" వ్రాసిన రచయిత కొండూరు వీరరాఘవాచార్యులుగారు ఆ పరమ యోగిని గురించిన విశేషాలన్నీ వీరు ఆ వ్యాసంలో (పుట 6) చెప్పగా వివరించారు.

# విశిష్ట చారిత్రిక సంపదతో విలసిల్లే విశాలాంధ్ర చిత్రాలు



చంద్రగిరి దుర్గంలోని రాజమందిరం



నిజాం రాష్ట్రంలో గోల్కొండకోట



లేపాక్షి కుడ్యచిత్రాలలో పర్వరతునకు కుబేరినృత్త చిత్రానికి అనుకృతి.



తిరుమలై వేంకటేశ్వర స్వామి ఆలయ ప్రాకారంలోవున్న శ్రీ కృష్ణదేవరాయల విగ్రహం



శ్రీ కృష్ణదేవరాయలు వేసవిలో విశ్రాంతికై అనంతపురంజిల్లా పెనుకొండలో నిర్మించుకున్న "రాజమందిరం".



కల్నాటి వీర చరిత్రలో వీను మిగిలిం బాలుడు-మాంచాల (గుజ్జం మల్లయ్యగారి త్రివర్ణ చిత్రానికి నకలు) ఉగాదిసంచిక



లేపాక్షి కుడ్యచిత్రాలలో పార్వతీపరమేశ్వరుల పరిణయోత్సవ సమయాన డోలువాయిస్తున్న గంధర్వచిత్రానికి అనుకృతి





రాయలనాటి వైభవాన్ని చాటుతూ హంపీ శిథిలాలమధ్య నున్న అచ్యుతరాయ దేవాలయం-కొండమీది నుంచి కనిపించే దృశ్యం



బొబ్బిలిపులి (సుంకర వెంకటరామయ్యగారి త్రివర్ణచిత్రము నకలు) ఉగాదిసంచిక



కంచి సొరపోలి శ్రీ సుబ్రహ్మణ్యస్వామి దేవాలయంలోని ప్రాచీన శిల్పసంపద.



విజయవాడవద్దనున్న అక్కన్న, మాదన్న గుహాలయం



మదనపల్లి తాలూకా సొంపల్లి చెన్నకేశవ స్వామి ఆలయం ముందరి ధ్వజస్తంభం

వీరరక్తపుధార
వారబోసినసీమ
పలనాడు నీదిరా
వెలనాడు నీదిరా
బాలచంద్రుడుమాడ
ఎవరోడో యా
తాంధ్రసౌపయమాడ నీవోయి

వాయికి నాగమ్మ
మల్లమాంబ, మొల్ల
మగువమాంచాల నీ
తోడబుట్టినవోళ్లె
వీరవనితలగన్న తల్లిరా
ధీరమాతిలజన్మ
భూమిరా

—శ్రీ కృష్ణ

ఆంధ్రరాష్ట్రావతరణ సంచిక

76 పేజీలు : 8 అణాలు

# ఆంధ్రపత్రిక

Regd No M 1118 సంపుటం 40. సంచిక 181.

గురువారం, అక్టోబరు 1, 1953.

THE ANDHRA PATRIKA - MADRAS.

Founder : Desodharaka K. Nageswara Rao.

# ☆ అందరి ఆశీర్వాద బలంతో ఆంధ్రరాష్ట్రం వర్ధిల్లాలి ★

## ప్రధాని నెహ్రూ శుభాకాంక్ష

### సర్వాంధ్ర పరంపరాభ్యుదయానికి అంత సహాయపడాలని విజ్ఞప్తి

"ఎంతోకాలం వేచివున్న మీదట, ఎంతోకాలం వాక్ ఘర్షణలు జరిగిన పిమ్మట ఎట్టకేలకు ఆంధ్రరాష్ట్రం అవతరించింది. ఇప్పుడు మనం అంతా ఆ వాక్ ఘర్షణల నన్నింటిని మరిచిపోయి, భారత రాష్ట్ర మండలిలో క్రొత్తగా అవతరించిన ఈ నూత్న రాష్ట్రానికి శుభాకాంక్షలను అందజేయాలి. అంతేకాదు, ఈ రాష్ట్రం అభ్యుదయ పరంపరాభివృద్ధిగా అభ్యున్నతిని చెందేందుకు వీలుగా మనం అంతాగూడా సహాయం చెయ్యాలి", అని ప్రధాని నెహ్రూ సర్వాంధ్రకు ప్రత్యేక సందేశంద్వారా తమ శుభాకాంక్షలను అందజేస్తున్నారు.



"ఈ రాష్ట్రం అవతరించడమన్న విధిరదల్లో ఆరవలకు, ఆంధ్రులకు మధ్య సమిష్టి మద్రాసు రాష్ట్రం పంపిణీ వ్యవహారాలలో కొంతగా ... [illegible]

## సర్వాంధ్రభారతరిపబ్లిక్‌లో ప్రముఖ రాష్ట్రం కావాలి

—శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి శుభాకాంక్ష

[illegible]

### ఆంధ్ర సంస్కృతి: సర్దార్ పటేల్ ప్రశంస

"విశాలమైన శ్రీ డీలొ [illegible] ... ప్రధాని, పరూవార ప్రాడే కాన్ఫరెన్స్ కార్యాలయంలో ప్రసంగిస్తూ సర్దార్ పటేల్ 1948, నవంబరు 27 న ఒక సదస్సులో ప్రశంసించారు.

## 'అవిరళ కృషితో ఆంధ్రరాష్ట్ర అభ్యున్నతి సాధించండి'

### ఆంధ్రనాయకులు, ప్రజలు ధైర్యస్థైర్యాలను త్యాగనిరతిని ప్రదర్శించాలని రాజేన్‌బాబు శుభాశీస్సు

"అక్టోబరు 1 వ తేదీన ఆంధ్రరాష్ట్ర అవతరణ జరగటం సంతృప్తిని కలిగిస్తోంది. ఆంధ్రులు రాష్ట్రంకోసం ఎంతోకాలంగా ఆందోళన చేస్తున్నారు. వారికోరిక ఫలిస్తున్న ఈ శుభదినంలో వారిని అభినందిస్తూ శుభాశీస్సులు అందజేస్తున్నాను.

[illegible]

సమైక్యంగా రాష్ట్రాభివృద్ధికి అవిరళ కృషి చేస్తూ, ఆంధ్ర ప్రజాభ్యున్నతికి దోహద మివ్వమని కోరుతున్నాను. రాష్ట్రానికి సంబంధించి వివిధ రంగాల అభివృద్ధికి విస్తృత కార్యక్రమాలను నిర్ణయించుకోవటంతో పా

(73-వ పేజీ చూడుడు)



## 'ఆంధ్రులకు పర్వదినం'

### కట్జూ శుభాకాంక్ష

1953 అక్టోబరు 1 వ తేది ఆంధ్ర ప్రజల చరిత్రలో ఒక పర్వదినం కాగలదు.



మూడు తరాలుగా ఆంధ్ర ప్రజలు తీరనివాంఛగా కలలు గంటున్న కోర్కె ఈనాడు ఫలితానికి వచ్చింది. తమ ఇల్లు తాము చక్క దిద్దుకొంటానికి తమ జాతిని తాము అభివృద్ధికి తెచ్చుకోవటానికి అవకాశం లభించింది. ఈ సుదినాన్ని రానున్న తరాల ఆంధ్రులు మహాపర్వదినంగా జ్ఞాపకం పెట్టుకుంటారు. ఆంధ్రుల ప్రతిభాసంపత్తులకు పరీక్షా సమయం గూడా నేటి

(75-వ పేజీ చూడుడు)

## 'ఆంధ్రప్రజల సముద్ధరణే ఆంధ్రపత్రిక లక్ష్యం'

— భారత వాణిజ్యమంత్రి

[illegible]

—టి. టి. కృష్ణమాచారిగారు

ఆంధ్రపత్రిక

శ్రీ విజయ సం॥ భాద్రపద బ॥ నవమి గురువారము

# మాతృదేశ రూప సందర్శనము

శ్లో॥ భక్త్యాత్వనన్యయా శక్య అహ మేవంవిధో ర్జున
జ్ఞాతుంద్రష్టుంచ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప.

శ్రీ కృష్ణుడు విశ్వరూప సందర్శనము అనన్యమైన భక్తిసాధన మని యుపదేశించెను విశ్వజననీ రూపమునకు వలె మాతృదేశ రూపసందర్శనకును, పరిజ్ఞానమునకును, ప్రకాశమునకును అనన్యమైన భక్తియె సాధనము, అనన్యమనస్కులైన దేశభక్తులు, దేశోద్ధారకులు, పూతచరితులు, కృతార్థులు, పూజ్యులు దేశభక్తులు మాతృదేశ పూజానిరతులు దేశభక్తులు దేశోద్ధరణము నకై ధనమును ప్రాణమును సర్వస్వమును సమర్పించిన యుతివానములు సుప్రసిద్ధములు భక్తిప్రదర్శనమునకు సేవ ప్రేమ త్యాగము సాధనములు దేశసేవ మానవధర్మము లలో నుత్కృష్టమైన ధర్మము తల్లినివలె జన్మభూమిని సేవించుట ప్రేమించుట మానవులకు సహజధర్మము మాతా శిశువులకు బోలె ప్రజా దేశములకు గల సంబంధ బాంధవ్యము లవిచ్ఛిన్నములు దేశమాతతల్లుల పరంపరలకు తల్లి, తండ్రుల పరంపరలకు తండ్రి సంపదల పరంపరలకు నిధి సుఖపరంపరలకు నిలయము, కళ్యాణ పరంపరల కాకరము ప్రజాక్షేమము దేశక్షేమా యత్తము, దేశక్షేమము ప్రజాక్షేమమాయత్తము ప్రజాదేశ క్షేమములకు గల యవ్యవహిత సంబంధమును సంయోగ సాహచర్యములు బలపరచుచున్నవి. అన్నిటికి సాహచర్యమేక దేశభావమునకును ఏకజాతీయభావమునకును దోహదము

వర్తమానకాలమునం దీ రెండు భావములును సకల దేశవాసుల నాకర్షించుచున్నవి. హిందూ దేశమునం దీభావముల వ్యాపనమునకు శాంతిప్రదమైన బ్రిటిషు పరిపాలనమును పాశ్చాత్య రాజ్యాంగ విజ్ఞానమును తోడ్పడినవి ఆ కారణంబులె యాంధ్రప్రబోధంబునకును గారణంబులు. అప్రబోధమునంత రూపములను దాల్చి యాంధ్ర దేశమునం దంతటను విహరించుచున్నది ప్రజలుత్సాహమును బూనిరి సేవావ్రతమును స్వీకరించిరి ప్రేమబంధమును దాల్చిరి. త్యాగశీలమును గ్రహించిరి ప్రజల యుత్సాహ పరత్వము, సేవానిరతి ప్రేమ ప్రదర్శనము, త్యాగశీలము ఆంధ్రమహాసభా రూపమున విజయవాడయందు మూర్తిభవించినది మాతృరూప సందర్శన సంజాతమైన యానందమును గ్రహించుట యసాధ్యము మధురగీతంబులు హృదయానందకరంబులు. ఉపనిషద్ఘోషంబులు, ధర్మార్థవర్ణంబులు, జయజయ ధ్వనులు విజయఘోషంబులు మాతృస్తవంబులు, మంగళాశీర్వాదంబులు, పుష్పాంజలులు సుహృత్సల్లాపములు సభానదులు ప్రజాప్రతినిధులు, ఆంధ్రదేశమునందు విహరించుచున్న యాంధ్రమాత విజయవాడయం దవతరించినది ఆ జననీరూప సందర్శనము జన్మపావనము ఆ జననీసేవ సార్థకము ఆజననీ సమారాధనము హృద్యము

సంభావ్యమయిన మాతృరూప సందర్శనమునం దొకయంశ మాత్రము సభామంటపమున వ్యక్తమయినది ఆయంశ శోభయె ఆంధ్ర ప్రపంచమునకు సంపూర్ణానందమును గలిగించుచున్నది సంపూర్ణ మాతృసందర్శన మెంతటి యానందమును గలిగింపనున్నది ఊహయూహింప నోపుదురు! సంభావ్యమయిన స్థితి సభామంటపమున విదితము కాని యథార్థమైన మాతృదేశ రూపమును దేశాభిమానులు పరికించిన విచారము గలుగుట సహజము దేశమాతయొక్క సర్వాంగములు దుర్బలయుతములయియున్నవి విద్య వ్యాపింపవలయును పరిశ్రమలు వర్ధిల్లవలయును సంపద లభివృద్ధిని చెందవలయును, ప్రజలు వర్ధిల్లవలయును, ప్రజలు ప్రేమపాశబద్ధులు గావలయును వైషమ్యము లంతరించవలయును ప్రజలు సేవాపరాయణులు గావలయును సకలాభీష్టములును ప్రత్యేకరాష్ట్రదర్శనమువలన సిద్ధింపవలయును... ..."

విజ్ఞప్తి

# "రాష్ట్రగానం"

## ఆంధ్రాభిషేకమ్

### సప్తపది

మహాకవి శ్రీ రాయప్రోలు సుబ్బారావు

జయస్తే, విశాలాంధ్ర జననీమతల్లికా
శ్రియాస్తే, తెలంగాణ చికురనవమల్లికా

౧

ముక్కోటి కలదీవ ముఖముల్ నివాళింప,
అభిజన శ్రీచక్ర మభయముద్ర వహింప,
భాద్రపద పుణ్యాహవాచనము శ్రుతినింప,
జరిగవిల్లినది నీ పట్టాభిషేకంబు
జయస్తే, విశాలాంధ్ర జననీమతల్లికా
శ్రియస్తే, తెలంగాణ చికురనవమల్లికా

౨

గౌతమీకరపీఠికలు పతాకల నెత్త,
పనుపురాసులు, చెఱకుపాలు పందగ కృష్ణ,
తుంగభద్రా పూర్ణ మంగళోదకముతో
సాగినది నీరాష్ట్ర సంప్రతిష్ఠాపనము
జయస్తే, విశాలాంధ్ర.. ..
శ్రియస్తే, తెలంగాణ

3

శాతవాహనుల శాసనశిలల్ పలుకంగ,
కాకతీయరథాల గణగణల్ వినబడగ,
చాళుక్యపర్వంబు దవిచాయలను చిల్క,
సమకొన్న దాంధ్రభాషారాష్ట్ర కల్పంబు
జయస్తే, విశాలాంధ్ర.... ......
శ్రియస్తే, తెలంగాణ ........ ..

౪

కవుల వాగమృతంబు, గాయకుల స్వరమధువు,
చిత్రరంజనరక్తి, శిల్పరూపణశక్తి,
మిళితమై స్మృతిలోన పులకించి వలపింప,
జరిగినది నీరాష్ట్ర జన్మోత్సవ శుభంబు
జయస్తే, విశాలాంధ్ర . ....
శ్రియస్తే, తెలంగాణ.. .... ..

౫

నాగార్జున రసాయన రహస్యములు తెల్పగ,
హాలకవి శృంగారమాలికలు సిగ దాల్ప,
రుద్రమ్మ, పౌరుషారుణసూక్తము రచించి,
రాణించె నీ తెనుగు రతనాల నడిగడ్డ
జయస్తే, విశాలాంధ్ర జననీమతల్లికా
శ్రియస్తే, తెలంగాణ చికురనవమల్లికా

౬

నాల్గుకోట్ల మహాంధ్ర నాగరక జనకాంక్ష,
నలుబదేండ్ల నిరంత బలవదుద్యమదీక్ష,
ఈడేరినది ఆంధ్రు లేకీభవించండి,
ఇరుగు పొరుగులు నవ్వ హితులునహితులు మెచ్చ
ఈడేరినది ఆంధ్రు లేకీభవించండి

౭

వేయేండ్ల కావ్య మిది పూయవలె, పండవలె,
ప్రజల క్షేమము పెంచి, పతుకతులు దించి,
నడవండి రాష్ట్రతంత్రము ముళ్లు పడకుండ,
దేశప్రతిష్ఠల్ ప్రకాశంబు కావాలె,
నడవండి రాష్ట్రతంత్రము ముళ్లు పడకుండ.
జయస్తే, విశాలాంధ్ర జననీమతల్లికా
శ్రియస్తె, తెలంగాణ చికురనవమల్లికా

# పదమ్ములు

విద్వాన్ శ్రీ బత్తులపల్లి నరసింగరావు

శ్రీలను కొల్లలాడి, పరసీమల దిగ్విజయంబు గాంచి ప
చ్చలకు కీర్తిచంద్రికలఁ జెల్వ వహించిన యాంధ్రరాజ్య మే
కాలమునందుఁ గాంచుమను కాంక్షను దిక్కులు చూచుచుండ, న
క్కాలము వచ్చె నేడు చిరకాలము రాజిలు మాంధ్రరాష్ట్రమా!

౨

[illegible]

3

[illegible]

౪

సాహిత్యాంభోధిని తరలుచు పాడుకొంచు
సాంధ్రభారతి కౌశల్య ములరఁగాంచె
సంగీతాబ్ధంబు సారస్యమును జాటి
త్యాగయ్య ప్రభవించి, తాండవించె
చిత్రశిల్పరుచుల్ చిద్విలాసంబు తనరు
సమరాజకీర్తులం బమరఁగాంచె,
సస్య సమృద్ధితో సకలభూములు సొంపు
ఖనిజ ప్రసవంబుల పొలుపుగాంచె,
సర్వవిధముల సొంపైన సౌఖ్యములను,
గూడి చెలువొందె, నాంధ్రమే కుడలయము
నాంధ్రుఁ డుదయుట్టు పుణ్యంబు నరయగంటి
నమ్మ యాంధ్రావనీ! నీదు మందుమమ్మ!

# ఆంధ్రరాష్ట్రావతరణము

శ్రీ చల్లా పిచ్చయ్యశాస్త్రి శతావధాని.

ఉ॥ శ్రీ విఖ్యాత కళాప్రపూర్ణ మదియు శ్రీ "కాకతీయాదిపా
ఈ రత్నప్రసవ సంస్కృతాద్య కవితా" శ్రీ ముక్కు తూమాదయు
శ్రీకీర్తిం, బవిరాకరేందుముదిరాం సంవర్ధయుతా కాశ్వతి
మైత్రీకృత్యం వయ, రాయనీమ్ము సుకళా కాలాంధ్రరాష్ట్రేందిరే!

౨॥ నవరసప్రిత నవరసమ్ము శౌర్యమ్ము "తోక" రాజాస్థాని తొగయఁజేసె
నందు పెన్నెలగాయ వింపకీరతిపద్య "రాజరాజా"స్థాని రమణఁగూర్చె
గమగమవాసించు కస్తూరిమదుటను "సాంబరాయా"స్థాని పవదరించె
తొగమువిటారించు నగలనలంకృతుల్ "వేమభూపా"స్థాని ఓరివిజేసె

౩॥ కోటప్పేరిటి తూగు టుయ్యాలలందు
"రాయలాస్థా"ని యెంతయు రాణకెక్కె
మున్ను, నడుమునుబడలిక, వన్నెగొంటి
"యాంధ్రరాష్ట్ర మహాలక్ష్మి!" యమరినేఁడు

౪॥ లలితకళా విశాలత కళానిలయంబులతోఁ బ్రమోదమున్
గొలుపురస ప్రసిద్ధ కవికోటులలో విదుపేద యుక్కటుల్
తెలిసి సహాయమున్నె యపుడీగల శ్రీవిభకోటితో సదా
కలశ "యాంధ్రరాష్ట్రరమ" కమ్మల పండువగూర్పు మెల్లెడన్॥

# తెలుఁగు తల్లి

శ్రీ కన్నెకంటి వీరభద్రాచార్యులు

౧

ఇదిగో గద్దియ స్వీకరింపుము తవి
శ్రీ! స్వాగతంబియ మా
హృదయంబుల్ చలరేగుచున్నయవి నా
యం గొల్పు నీ భావ సం
పదలన్ గూర్పుము ముద్దు బిడ్డలకు-సా
మ్య స్వామ్య సిద్ధాంతముల్
చెదరంబోవక నీడశైనిలువ-ఆ
శీర్వాదముల్ చేయుమా

౨

ఎన్నాళ్లైనది నీవు కన్పడక త
ల్లీ! సేమమా! నేడు మా
కన్నుల్ పున్నెము లాదరించినవి నం
కల్పమ్ము లీడేర-ఎం
దున్నా విప్పటిదాక నుంతె దయ లే
దో! గద్దె పైకెక్కి యా
బన్నంబుల్ తొలఁగింపఁ బూనికొను మం
బా! ఆంధ్ర రాజ్యేందిరా!

3

కలవమ్మా! మనగడ్డపై మధుర గం
గా వాహినుల్ కిందిరం
బులతో నిండిన పండు లేగడి పొలం
బుల్-మూఁడు పూలాఱు కా
యల కాయించుము! గద్దెనెక్కి నిజ స
స్య శ్యామలా కారవై
చెలువుం గుల్కుచు పెల్లుచున్ దెలుఁగు ల
క్ష్మీ సర్వకాలంబులన్

౪

అల్లల్లాడుచు నున్నవార లరుగో
అందందుఁ దారాడుచున్
"బిల్లల్ జెల్లలు" పేదలై యనదలై
భిక్షాకరవ్యాంతులై
యుల్లాసంబులఁ గోలుపోయి తుదక
య్యో! నీవు లేకుంటచే
ఇల్లిట్లయినది-దిద్దికోవలయుఁ ద
ల్లీ! ఒర్పుతోఁ గూర్పుతో!

౫

పేరుఁ బోనీక చెప్పించుకోవమ్మ నీ
తెలుఁగుఁ జాటింప బిడ్డలకు దనువు
బీరు పోనీక చేర్పించుకోవమ్మ! నీ
విలువఁ జాటింప బిడ్డలకుఁ జెలిమి
పొరుఁ బోనీక యేర్పరచుకోవమ్మ నీ
వెలలఁ జాటింప బిడ్డలకు కలిమి
జారి పోనీక యార్జన చేయుమమ్మ నీ
బలముఁ జాటింప బిడ్డలకు బలము

నిలువుకోవమ్మ! చలువ నీడలనుర్చి
బిడ్డలకు గూర్చి చేర్చి నీ పేర్మికూర్మి
తెలిసి తెడజల్లి నీయశోల్ దేజరిల్లి
దీనజన కల్పవల్లి! ఓ తెలుగు తల్లి!

# జేజేలు

శ్రీ బాదూరు రామానుజులు రెడ్డి

చిరకాలంబున నుండి-ఆంధ్రుల యశశ్రీ రంజిలంగాని, యు
ద్ధరణిన్ తెల్గుల కేది రాష్ట్ర మది రావా! రమ్ము! యంత చెన్నుగా
రసవత్ప్రాణము లొడ్డినారుగద! అహా! ఆంధ్రరాష్ట్రం బిదె
మరి సాక్షాత్కృతి నందె నింక, తెలుగమ్మా! నీకు జేజే లివె!

ఒకనా డాంధ్రుల రాజ్య మేలి రచటే, యుత్తుంగరంగత్తరం
గ కథాఘట్టము లాపదీతయుల విక్రాంతిం గనెంగాదె, నా
టి నీరోత్తము లాత్మవిక్రమములం భావించి రాజాడు, నే
డిక కన్నులపూరాన తెల్గుజననీ! శిరిన్ ప్రతిష్ఠింపుమా!

మాతృసేవాపరాయత్త మహితబుద్ధి
గల కవిపండితాళి పసాక్కువ్యరచన
జేసి, యాంధ్రావనీదివి చిద్విలాస
సంపదను పెంపుఁగాఁ గూర్పఁజాలుఁగాత!

# మేలుకొల్పు

రచన: శ్రీ జి. సి. తిమ్మారెడ్డి.

తే గీ॥ 1 ఆంధ్రభూమికి ముఖ్యమా కందనూలు
పురము, అంద్రియు, తుంగభద్రాప్రవంతు
లల్ల కోభిల సీ దాంధ్రు లెల్ల ముదము
నంద, అంధ్రాక్కు దుదియించె నాంధ్రసీమ.

2 ఎంతకాలము నుంటివో నిద్రలోన
ఆంధ్రపుత్రుడ! మేల్కొనవయ్య! యింక
అదను అలుదించె నీదగు ఆంధ్రమాతృ
చరణరాజీవసేవల నలుపుటకును

3 శేవభావల జాతీయవిధము కొరగి
పదులభావానుకృతి దాస్యపరత మీతి
ఆంధ్రతేజము తెంట్టి అంధుడవయి
మంతలాంతివో పుత్ర! ఇంతవరకు?

4 ఆంధ్రు లైక్యము లేనివా రంచు దెగడ
సాహసించిరి కొందరు స్వల్పబుద్ధి
తాదృశుల బాద ముడపగా తరుణమయ్యె
లేగ లెమ్మింక యుక్తమైన నిద్రమండి

5 వాదుపిరచు భేదభావంబుతో డ
సోదరాంధ్రుల విడియు పోమరిపయి
స్వార్థముగ కాలమును వ్యయపలచినాత్మ
నీడుమిక నిద్ర కన్నుల విప్పిచూడు

6 పరపరాధీనురాలయి వనటలెందు
నాంధ్రమాతకు చెరవప్ప నయ్య! నేడు
నీదు పూర్వాంధ్రవైభవం బెన్నుకొనుచు
తెలుగుతల్లి ఋణంబును దీర్పుకొనుము.

7 అహవశోడి క్షాత్రవదానిమలను
బాహుబలమున పరిమార్చి ప్రాభవముతో
ఆంధ్రసామ్రాజ్యమున్నిల్పి నట్టి పూర్వ
పురుషుల స్మరింపు మోఆంధ్ర పుత్ర! నేడు

8 పరవ సంగీత సాహిత్య సకలకళల
పారముం జూచి జాతీయపార మలయు
చిత్రకవితల వాఙ్మయ సేవజేసి
ధన్యులైనట్టి యాంధ్రకవుల నెంచి.

9 సాగరాంతర్గతద్వీపవరణి గెలిచి,
వివిధవాణిజ్యకళలచే విస్తరిల్లి,
విమలకన్నటి పూర్వాంధ్రవీరవరుల
దివ్య చరితల స్మరియింపుమా కుమార!

తెలుగువీరుల గాథల తేటపరిచి,
తెలుగుజాతుల ప్రాభవదీప్తి దెలిపి
తెలుగుజాతి స్వతంత్రత తేజరిల్లు
తెలుగుతలిని గొల్వుమా తెలుగుబిడ్డ!

ఆంధ్రజాతిస్వతంత్రమై యలరుకొఱకు,
ఆంధ్రభాష మహోన్నతి నందుకొఱకు,
ఆంధ్రభూమి సుభిక్షమై యలరుకొఱకు,
ఆంధ్రసీమను సేవింపు మాంధ్రపుత్ర!

తెలుగుసీమకు నెప్పుడు గలుగ శుభము
తెలుగుప్రజలకు నెవ్వేళ గలుగ సుఖము
తెలుగుప్రభుతకు నధికంబు గలుగ స్థిరత
పాయని స్మరియింపుమా మాతృపుత్ర!

కలము ఖడ్గము పట్టఁగలనేర్పు వడసినవ
రెడ్డినాగమ్మ నీ బిడ్డయఁట వె?
జగమునగంటిది నాంధ్రజగతిఁ బాలించి
గరిత రుద్రమ్మ నీ కన్నెయఁట వె?
గండికోటను మల్కుదండుపై దూఁకిన
గోవిందమాంబ నీ కూఁతురట వె?
మానంబుకై నిజప్రాణంబు బలియిచ్చు
మల్లమాంబ నీదు కొమార్తయఁట వె?
పీఁగివచ్చిన హృదయేశు నెక్కిరించి
బోరికంపిన తరుణి నీ పుత్రియఁట వె?
ఎంత తేజస్వినివితల్లి! ఊరుక లేక
నీ మహాత్మ్యంబు తెలియంగ లేము గాని,
—తుమ్మల సీతారామమూర్తి చౌదరి

4 ఆంధ్రపత్రిక. 1913 వ సం॥ మే నెల 28 వ తేదీ

## ఆంధ్రమహాజనసభ

### మొదటిసమావేశము

(స్వంతవిలేఖరులు)

బాపట్ల మే 26

### గుంటూరు మండల మహిళాసభ

→ ప్రథమ ఆంధ్ర మహాసభ 1913 మే 26 వ తేదీన బాపట్లలో సమావేశమైంది. బి. యన్ శర్మగారధ్యక్షత వహించారు. ఈ సమావేశం గురించి అప్పట్లో బొంబాయినుంచి వెలువడుతున్న ఆంధ్ర వారపత్రికలో ప్రకటింపబడిన వార్త నివేదిక నకలు

# రాష్ట్రోద్యమం: సంగ్రహ చరిత్ర

లాల్, బాల్, పాల్ జాతీయ భారతదేశాన్ని ఎదురులేకుండా ఏలుతున్న రోజులవి ‘వందేమాతరం’ ‘స్వంత రాజ్యం’ అన్న నినాదాలతో అనేక కోలాహలం మార్మోగి పోతున్నది.

పరప్రభుత్వంతో ప్రత్యక్ష పోరాటానికి అంకురార్పణ జరిగింది జాతీయభావాలు ప్రజాహృదయాన్ని ఉత్తేజపరుస్తున్నవి దేశాభిమానం అధికమౌతున్నది ఈ సమయంలో వంగరాష్ట్ర విభజనను లార్డ్ కర్జన్ సంకల్పించాడు వంగదేశీయులను బ్రిటిష్ ప్రభుత్వ ఈ సంకల్పం ఏకం చేసింది వారిలో గాఢమైన రాష్ట్రాభిమానాన్ని కల్గించింది అదొక జాతీయ ఉద్యమంగా పరిణమించింది

ఈ ఉద్యమ ప్రచారం ఆంధ్రదేశం మీద హెచ్చుగా కన్పించింది 1907 లో కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు బొంబాయిలో ‘ఆంధ్ర’ వారపత్రికను ప్రారంభించారు వారు బొంబాయిలో గాక మరి ఏ పట్నంలో నైనా వుంటే ఏం చేసి వుండేవారో అన్న ప్రశ్నకు సమాధానం చెప్పడం కష్టం

వారంవారం ‘ఆంధ్ర’ పత్రిక ఆంధ్రులందరికీ “మీరు ఆంధ్రులు” అని జ్ఞాపకం చేస్తూ వచ్చింది ‘ఆంధ్ర’ అనే ప్రత్యేక భాషాప్రాంతం వున్నదని అన్యరాష్ట్రాల వారికి హెచ్చరిక చేస్తూ వచ్చింది 1912 వ సంవత్సరంలో నే ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో నాగేశ్వరరావు పంతులుగారు “ఆంధ్ర రాష్ట్రం” అని ఒక ప్రత్యేక వ్యాసం వ్రాసినారు

అదే సంవత్సరం మేమాసంలో నిడదవోలులో కృష్ణాజిల్లా మహాసభ జరిగింది ఈ సభ జరగడానికి ముఖ్య కారకులైన శ్రీ వేమూరు చంద్రారెడ్డిగార్ని స్మరించడం ప్రతిఆంధ్రుని

మరుసటి సంవత్సరం 1913 మే 26 వ తారీఖున బాపట్లలో శ్రీ బయ్యా నృసింహేశ్వర శర్మగారి అధ్యక్షతను ప్రథమాంధ్ర మహాసభ జరిగింది కొండ వెంకటప్పయ్య పంతులుగారు ఆహ్వాన సంఘాధ్యక్షులు ఈ సమావేశంలో ప్రత్యేకాంధ్రరాష్ట్రం కావాలని తీర్మానం జరగలేదు కాని ఈ విషయంలో ప్రజాభిప్రాయాన్ని తెలుసుకోవాలని ఆ సభ తీర్మానించింది

1914 వ సంవత్సరం న్యాయపతి సుబ్బారావు పంతులుగారు అధ్యక్షుడుగా బెజవాడలో సమావేశమైనద్వితీయాంధ్ర మహాసభ ఆంధ్రులకు ప్రత్యేక రాష్ట్రం కావాలని తీర్మానించింది అప్పట్నుంచి ఏటా ఈ తీర్మానాన్ని ఆంధ్ర మహాసభ పునరుద్ఘాటిస్తూ వచ్చింది 1917 లో భారత రాజ్యాంగ సంస్కరణలను గురించి విచారణ జరిపే నిమిత్తం మాంటెగూ, చెమ్స్‌ఫర్డ్ కమిషను రాగా న్యాయపతి సుబ్బారావు పంతులు, కాశీనాధుని నాగేశ్వరరావు, కొండ వెంకటప్పయ్య, నెమలి పట్టాభి రామారావు, డా॥ పట్టాభి సీతారామయ్య, మోచర్ల రామచంద్రరావు ప్రభృతులు రాయబారం వెళ్ళి చెన్నరాష్ట్రంలోని ఆంధ్ర జిల్లాలను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటుచేయాలని కోరారు

అప్పటికి ఈ ఉద్యమానికి కొంత రాజకీయ ప్రాధాన్యం యేర్పడింది డాక్టరు పట్టాభిసీతారామయ్య, సుబ్బారావు, గోపాలకృష్ణయ్య ప్రభృతులు జాతీయ ఉద్యమంలో కూడా ప్రముఖపాత్రవహించారు డాక్టర్ పట్టాభి ప్రభృతుల కృషి ఫలితంగా భారత జాతీయ కాంగ్రెసు భాషాధారంగా కాంగ్రెసు రాష్ట్రసంఘాల పునర్నిర్మాణానికి సమ్మతించింది

1920 లో ఆంధ్రకు ప్రత్యేక కాంగ్రెసు ఏర్పడింది. ఆ మరుసటి సంవత్సరం విజయవాడలో అఖిలభారత కాంగ్రెసు సంఘసమావేశం జరిగింది 1923 లో కాకినాడ కాంగ్రెసు జరిగింది తద్వారా జాతీయ రాజకీయాల్లో ఆంధ్రులకు ప్రత్యేకస్థానం ఏర్పడింది

ఇదంతా జరగడానికి పూర్వమే 1918-లో సామ్రాజ్య చట్టసభ సర్ బి. యన్ శర్మగారి ప్రోత్సాహంపై ప్రత్యేకంగా చెన్నరాష్ట్రంలోని ఆంధ్ర మండలాలను, రాష్ట్రంగా ఏర్పాటుచేయాలనే తీర్మానాన్ని ఆమోదించింది అప్పట్నుంచీ మద్రాసు శాసనసభ, కేంద్ర శాసనసభ పలుమార్లు రాష్ట్ర తీర్మానాలను ఆమోదించినవి

1927 వ సంవత్సరం ఫిబ్రవరి 16 వ తేదీన స్టేట్స్ కౌన్సిల్ లో రామదాసు పంతులుగారొక తీర్మానాన్ని ప్రతిపాదించారు 1946 ఫిబ్రవరి 6 న మొంటి కంటి తిరుమలరావు గారు ఆ తీర్మానాన్నే ప్రతిపాదించారు ఆ తీర్మానం ఆమోదింపబడింది

మద్రాసు శాసనసభలో నాలుగు దఫాలు ఆంధ్రరాష్ట్ర తీర్మానం ఆమోదింపబడింది 1927 మార్చి 14 వ తేదీన అప్పటి రాష్ట్ర కౌన్సిల్ లో టిలమ్రి అంజనేయులు గారొక తీర్మానాన్ని ప్రవేశపెట్టారు ఆ తీర్మానం అంగీకరింపబడింది

అయినా రాష్ట్ర నిర్మాణానికి ప్రభుత్వం ఎట్టి చర్య తీసుకోలేదు

కాని ఈ ఆందోళన ఫలితంగా ఆంధ్ర మహాసభ ఆశయాల్లో ఒకటైన ఆంధ్ర విశ్వ కళాపరిషత్తు 1926 లో పానగల్ రాజా గారి కృషి పట్టుదల ఫలితంగా ఏర్పడింది. పానగల్ రాజా గారు చేసిన మరొక ఘనకార్యం దేశీయవైద్య పాఠశాలల స్థాపనము

విశ్వ కళాపరిషత్తు ఏర్పడినదన్న మాటే గాని 1938 వరకూ రాష్ట్ర నిర్మాణానికి అధికార వర్గాలవారు ఎట్టి చర్య తీసుకోలేదు 1927-28 సంవత్సరంలో భారత రాజ్యాంగ సంస్కరణలను గురించి విచారించడానికి సైమను కమిషను వచ్చింది. ఆంధ్రులు ఆ కమిషన్‌ను బహిష్కరించారు. ఒరిస్సావారు, పర్లాకిమిడి రాజా గారి నాయకత్వాన కమిషన్‌తో పూర్తిగా సహకరించి, తమ రాష్ట్రాన్ని సాధించుకున్నారు

సైమను కమిషన్ విచారణానంతరం జరిగిన రౌండ్ టేబిల్ సమావేశంలో పర్లాకిమిడి రాజాగారు మద్రాసు రాజధానిలోని ఆంధ్రజిల్లాలను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చేయాలని ఒక విజ్ఞాపన పత్రాన్ని సమర్పించారు

రెండవ రౌండ్ టేబిల్ సభలో పాల్గొనే నిమిత్తం గాంధి మహాత్ముడు లండన్ వెళ్ళినపుడు ఈ రాష్ట్ర సమస్యను ప్రసావింపజేసిందిగా ఆంధ్ర నాయకులు కోరారు ఇందునిమిత్తం శ్రీ కాశీనాథుని వెంకట భోగయ్యగారు 1931 అక్టోబరు 8 వ తేదీ ఇంగండ్ వెళ్లారు కూడా, బొబ్బిలి రాజాగారు మోచర్ల రామచంద్రరావుగారు, శారి సరు పి. వి. సుబ్బారావుగారు, శారి స్టైరు కే నాగభూషణంగారు, భారత సహాయ కార్యదర్శి లార్డ్ లోథియన్ కు ఒక విజ్ఞప్తిని సమర్పించారు. కాని ఏమీ జరగలేదు

నూతన రాజ్యాంగం తయారైంది సింధు, ఒరిస్సారాష్ట్రాలు మాత్రం ఏర్పడ్డవి ఆంధ్రరాష్ట్రం అడుగున పడింది 1937 లో నూతన రాజ్యాంగాన్ని అనుసరించి ఎన్నికలు జరిగాయి రాష్ట్రాల్లో కాంగ్రెస్ మంత్రివర్గాలు ఏర్పడ్డాయి కాంగ్రెస్ అంతవరకూ భాషారాష్ట్రాలకు అత్యంత సుముఖంగా వున్నందువల్ల ప్రత్యేకరాష్ట్రం త్వరలో ఏర్పడగలదనే ఆశ ఆంధ్రుల్లో కల్గింది 1938 లో కొండ వెంకటప్పయ్య పంతులు గారు మద్రాసు శాసనసభలో భాషారాష్ట్ర తీర్మానాన్ని ప్రతిపాదించారు అప్పటి ప్రధానమంత్రి శ్రీ రాజగోపాలాచారి గారు ప్రభుత్వ పక్షాన తీర్మానాన్ని బలపరిచారు అంతకుముందు సంవత్సరమే బెజవాడలో ఆంధ్రమహాసభ రజతోత్సవం జరిపింది ఆ సభల్లో రాయలసీమ నాయకులు సర్కారుల్లవారి సంకల్పశుద్ధి శంకించారు తమకు ప్రత్యేక రక్షణలు ఇస్తేగాని రాష్ట్రోద్యమంలో చేరలేమన్నారు తత్ఫలితంగా 1937 నవంబరు 16న తేదీన శ్రీబాగు ఒడంబడిక జరిగింది అటు తరువాతనే వెంకటప్పయ్య పంతులు గారు మద్రాసు అసెంబ్లీలో రాష్ట్ర తీర్మానాన్ని ప్రవేశపెట్టారు.

ఈ తీర్మానం మీద మద్రాసు ప్రభుత్వ వైఖరి స్పష్టం కాగానే మద్రాసులోనే డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి అధ్యక్షతను ఆంధ్ర మహాసభ ప్రత్యేకంగా జరిగింది ఆంధ్ర అగ్రనాయకులందరూ ఈ సమావేశంలో పాల్గొన్నారు అప్పుడే ఉద్బ్యంటి రాఘవేంద్రరావుగారు భారత కార్యదర్శి వద్దకు రాయబారిగా నియమింపబడ్డారు వారూ తమ శాయశక్తులా కృషిచేశారు కాని రాష్ట్రం రాలేదు

1940 విశాఖపట్నంలో ఆంధ్రమహాసభ సర్ విజయా అధ్యక్షతను సమావేశమైంది అప్పటికి యుద్ధం ప్రారంభం కావడం కాంగ్రెసు మంత్రివర్గాలు రాజీనామా ఇవ్వడం జరిగింది సర్ విజయా గారు అధ్యక్షులుగా వుండగా రాష్ట్రాన్ని రెండు పరిపాలనా ప్రాంతాలుగా విభాగించడానికి మద్రాసు ప్రభుత్వాన్ని ఒప్పించడానికి ప్రయత్నాలు జరిగాయి ఆంధ్ర మహాసభా అధ్వర్యాన మద్రాసు గవర్నరువద్దకు రాయబారం వెళ్లడం వారు ఆలోచిస్తామనడంతో అదని ఆగిపోయింది

ఆంధ్రకాంగ్రెస్ నాయకులు కాంగ్రెస్ అధిష్ఠానవర్గంచేత ఒప్పించడానికి ప్రయత్నాలు చేశారు 1940 లో పట్టాభి దేశభక్త తిరుమలరావు, పల్లంరాజు, కల్లూరి సుబ్బారావు ప్రభృతులు వర్ధాలో కార్యవర్గం సమావేశం అవుతూవుండగా రాయబారం వెళ్లారు. స్వరాజ్యం రాగానే జాతీయ ప్రభుత్వం భాషా రాష్ట్రాల నిర్మాణానికి పూనుకోగలదని హామీ ఇచ్చారు

1942 లో క్రిప్సు రాయబారవర్గం, 1945 లో అమాత్యత్రయ రాయబారవర్గం వచ్చినప్పుడు ఆంధ్రనాయకులు రాష్ట్రం విషయమై విజ్ఞప్తులు సమర్పించారు

తరువాత రాజ్యాంగ పరిషత్తు ఏర్పడింది నూతన రాజ్యాంగాన్ని తయారుచేసే సందర్భంలో ఆంధ్రను రాష్ట్రాల జాబితాల్లో చేర్చి నూతన రాజ్యాంగం అమలుకువచ్చే ముందుగానే రాష్ట్రనిర్మాణానికి, పట్టాభి, ప్రకాశం ప్రభృతులు ప్రయత్నించారు దాదాపు షెడ్యూలులో చేరిందనే అంతా ఆశించారు. కాని 1938 లో లాగానే తిరిగి రాష్ట్రం వెనుకబడింది. అయితే ఆంధ్రలో ఆందోళన అధికమైంది.

తత్ఫలితంగా రాజ్యాంగపరిషత్తు ధార్ కమిషన్‌ను నియమించింది. వీరు భాషారాష్ట్రాలు పనికిరావన్నారు. అయినా మదరాసు రాష్ట్రాన్ని పరిపాలనదృష్ట్యా విభాగించాలన్నారు. ఈ కమిషన్ నివేదికను దేశం అంతటా తీవ్రప్రతికూల్యం ఏర్పడింది. అసంతృప్తి ప్రబలింది జయపూరు కాంగ్రెసులో నాయకత్రయ సంఘం ఈ సమస్య పునర్విచారణకే ఏర్పడింది. 1949 ఏప్రిల్ లో వారి నివేదిక వెలువడింది. ఆంధ్ర, తమిళ కాంగ్రెసు సంఘాలూ, మదరాసు ప్రభుత్వం ఈ నివేదికాంశాలను ఆమోదించడానికే 1949 నవంబరు ఆఖరులో విభజనసంఘం ఏర్పడింది. 1950 జనవరి 26 లోగా రాష్ట్రావతరణ జరుగుతుందని అంతా ఆశించారు. జరుగలేదు.

1951 లో స్వామీ సీతారాం ప్రాయోపవేశం ప్రారంభించారు. అందువల్ల కేంద్రప్రభుత్వ వైఖరిలో కొంత మార్పు వచ్చింది. కాని రాష్ట్రస్థాపనకు నిర్మాణాత్మకంగా ఏమీ జరుగలేదు. 1952 లో సత్యాగ్రహాన్ని కూడా భిమవరం నుంచి సాగించారు. ప్రయోజనం లేకపోయింది. 1952 అక్టోబరు 19 న పొట్టి శ్రీరాములు గారు ప్రాయోపవేశం ప్రారంభించారు. కేంద్రప్రభుత్వ వైఖరిలో క్రమంగా మార్పువస్తూవుంది. కాని ఈ మార్పు శ్రీరాములుగార్కి తృప్తికరంగా లేదు. వారు ప్రాయోపవేశాన్ని విరమించలేదు. డిసెంబరు 15 న వారు దివంగతులైనారు. 19 న ప్రధానమంత్రి రాష్ట్రనిర్మాణం విషయమై నిస్పష్ట ప్రకటనచేశారు. 1953 జనవరి 26 న న్యాయమూర్తి వాంచూను విచారణాధికారిగా నియమించారు. వారు నివేదికను మార్చిలో సమర్పించారు. తరువాత జూన్‌లో మద్రాసు అసెంబ్లీలోని ఆంధ్రసభ్యులు సమావేశమై 6 వ తేదీన కర్నూలును తాత్కాలిక రాజధానిగా ఎన్నుకున్నారు. తర్వాత బిలు తయారైంది. ప్రజాసభ రాజ్యసభ, రాష్ట్రీయ శాసనసభలు చర్చించి ఆమోదించినవి. అధ్యక్షుని ఆమోదంపొందింది. అక్టోబరు 1 న రాష్ట్రం ఏర్పడింది.

అనంతాచార్యులు

పొంబమూర్తి

తిరుమలరావు

పల్లంరాజు

అల్లూరి సత్యం

దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారు

ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి భారత ప్రభుత్వాన్ని ఒప్పించాలనే సంకల్పంతో 1951 ఆగస్టు 15 తేదీ నుంచి 36 రోజులపాటు గుంటూరులో ఉపవాసం చేసిన స్వామీ సీతారాం వారితోపాటు ఉపవాసంలో పాల్గొన్న శ్రీ యుతులు కొరిచలపతి, తుమ్మల బసవయ్య దంపతులు, జంపుద్దుశెట్టి ప్రభృతులు.

# మనభూమి సమస్యలు



మన దేశములో నివసించు ప్రజలలో నూటికి 90 మంది గ్రామీణులు; నూటికి 75 గురు వ్యవసాయముపై తమ వృత్తికి ఆధారపడువారు. పట్టణములలో పనిచేయు కార్మికులు, ఉద్యోగులుకూడ తమ యవసానకాలమున తమరు పుట్టిన గ్రామములకే పోవుటకు సమకట్టుదురు. అంతేకాక ప్రతివారు ఏదో కొంతభూమి తమదేయని అనిపించుకొనుటకు ఎంతో ఆకాంక్ష, ఆశ ప్రకటింతురు. సంపాదించుకొన్న తమ సైకమునకు భూమికన్న స్థిరమైన పెట్టుబడి పెట్టుటకు యుక్తమైనఆస్తి వేరే లేదని, చాలమందికి వ్యక్తిగతమైన అభిప్రాయమేగాక, సంఘము యొక్క సమిష్టిఅభిప్రాయముకూడనైయున్నది. ఇంకను మన దేశములో "వారికి లక్ష రూపాయలున్నవి" అనుటకంటె "వారికి పాతికఎకరాల భూమియున్నది" అంటే ఎక్కువ గౌరవస్థితిగానున్నది

## జనాభా: పంటభూమి

భూమి ఎంత విస్తీర్ణమో భూమి యొక్క సమస్యలు అంత విస్తృతములైనవి. కంటికి మొదట కనుపించే సమస్య జనాభాకి, పంటభూమికివున్న సంబంధము. ఎకరాలెక్కను, ప్రతి ఎకరమునకు చాలా హెచ్చు పంట పండించే అమెరికా సంయుక్తరాష్ట్రములో కూడ తల సోవనాకై 3 1/8 ఎకరాలభూమి ప్రతివారికి కావలెనని అంచనాయున్నది. మనదేశ పరిస్థితి ఎటులున్నదో గమనింతము (సంస్థానములు మినహా)

| సంll రం | జనాభా లక్షలు | మనిషికి పంటభూమి |
|---|---|---|
| 1921 | 2886 | 88 సెంట్లు |
| 1931 | 2568 | 82 సెంట్లు |
| 1941 | 2958 | 72 సెంట్లు |
| 1951 | 3567 | 72 సెంట్లు |

(సంస్థానములు కలపి)

1950-51 సంవత్సరములో యీదేశములో 31 కోట్ల 24 లక్షల యకరాల భూమిపై పంటపండించబడినది మదరాసు రాష్ట్రములో 2 కోట్ల 76 లక్షల యకరాల రైత్వారీ భూమి, జమీందారీ భూమి 1 కోటి 38 లక్షలు ఇంకను యీనాం వగైరా భూమి యున్నది జమీందారీ యీనాం భూములు యింకా సర్వేకాలేదు సర్వే జరుగుచున్నది ఇందులో సగంభూమి ఆంధ్రరాష్ట్రములో నున్నదని అంచనా వేయవచ్చు ఎందుచేతనగా, ఆంధ్ర రాష్ట్రము యొక్క విస్తీర్ణము మొత్తపు మదరాసు రాష్ట్రపు విస్తీర్ణములో దరిదాపు సగమున్నది

మదరాసు రాష్ట్రములో రైత్వారీ భూమి 2 కోట్ల 76 లక్షల యకరాలు, 72 లక్షలు రిజిస్టర్డు పట్టాదార్లకు చెందియున్నది రైత్వారీ కాని యితర భూమికి సరియయిన లెక్కలు యింకను లేవు. వీరిలో నూటికి 60 మంది తామే భూస్వాములు మరియు తమ భూములను తామే వ్యవసాయము చేసుకొనువారు నూటికి 15 మంది తమతమ భూములున్న గ్రామములలో లేని భూస్వాములు మిగిలిన నూటికి 25 మంది గ్రామములో నివాసమున్నను, తమ భూములను యితరులకు కౌలుకిచ్చినవారు ఇంకను విమర్శించినచో యీ దిగువ విషయములు తేలగలవు

72 లక్షల పట్టాదారులలో 70 లక్షలమంది, సాలనకు రు 50 లకుతక్కువ పన్ను చెల్లించువారు వీరి క్రింద 81 లక్షల ఎకరాలు, గవర్నమెంటు యిరిగేషను క్రిందనున్న భూములు 185 లక్షల ఎకరాల మెట్ట సస్యములు పండే భూములున్నవి 70 లక్షల పట్టాదార్లలో 56 లక్షల పట్టాదార్లు సాలనకి 10 రూపాయలలోపు పన్ను చెల్లించువారయి యుండి, తమ వాక్కులో 11 లక్షల ఎకరాల ఇరిగేషను భూమిని 102 లక్షల ఎకరాల మెట్టభూమిని కలిగియున్నారు సాలనకు రు 50 లపైబడి పన్ను చెల్లించే 2 లక్షల పట్టాదార్ల క్రింద 22 లక్షల యకరాల యిరిగేషను భూమి 36 లక్షల ఎకరాల మెట్ట భూమి మాత్రమున్నది

## లెక్కల సేకరణకు ప్రభుత్వచర్య

ఈ విమర్శన ప్రకారము తేల సారాంశమేమనగా నూటికి 96 సంఖ్యగల చిన్న భూస్వాముల స్వాధీనములో నూటికి 59 వంతున యిరిగేషను సౌకర్యముగల భూమి యున్నది నూటికి 4 సంఖ్యగల పెద్ద భూస్వాములవద్ద నూటికి 41 వంతున యిరిగేషను సౌకర్యముగల భూమి యున్నది. మెట్ట భూములు నూటికి 83 వంతున చిన్న భూస్వాముల వద్దను, నూటకి 17 వంతున పెద్ద భూస్వాముల వద్దనున్నది జిల్లాభూములున్న జిల్లాలలో నున్న పరిస్థితి చూచినచో, యింత కన్నను విపులముగా తేలగలదు కాని యిటువంటి లెక్కలనుటకు వీలులేదు ఒకే వ్యక్తికి ఒక గ్రామములో గాక పలు గ్రామములలో భూము లుండవచ్చును అంతేకాక ఒకవ్యక్తి, ఒక రూపాయ పన్ను చెల్లించు పట్టాదారుగను, 10 రూపాయలు పన్ను చెల్లించు పట్టాదారుగను కూడ, లేక వేయి రూపాయలు పన్ను చెల్లించు పట్టదారుగను కూడ వుండవచ్చును ఒక వ్యక్తికి మొత్తముపై ఎంత భూమి యున్నదో ఎంతపన్ను మొత్తము చెల్లించునో ప్రస్తుతము అములులో నున్న గ్రామకరణము గారి లెక్కల వల్ల తేలదు పైగా జమీందారీవగైరా లెక్కలు పై అంకెలలో చేరలేదు ఈ పరిస్థితులలో యీ అంకెలపై మాత్రము ఆధారపడి తుది నిర్ణయములకు వచ్చుట కష్టతరము కావున ప్రభుత్వము ప్రత్యేక శాసనము చేసి, భూమిగల ప్రతి వ్యక్తి, తనకు ఎచ్చట నున్నను మొత్తపుభూమి యొక్క వివరములను, దానిపై చెల్లించే పన్ను వివరములను నిర్ణీతకాలములో దాఖలు చేయవలెనను నిర్బంధము ప్రకటించవలెను అప్పుడు సరియగు పద్ధతులపై భూమి సమస్యలను పరిష్కరింపవచ్చును 1951 సంll రం జనాభా లెక్కల ప్రకారము భారతదేశము మొత్తములో 4 కోట్ల 50 లక్షల వ్యవసాయకూలీలున్నారు వీరికి పొలములలో పని యున్నప్పుడే కూలిదొరకను కొలది మంది పాలేరుల క్రింద స్థిరవేతనము గలిగియుండురు వీరికి లభించు కూలి స్వల్పమైనా జీవనభృతికి సరిపోదు వీరికి హెచ్చుకూలి నిచ్చినచో బహుళ సంఖ్యాకులగు చిన్న భూస్వాములకు ఆదాయమృగ్యమగును ఈ పరిస్థితి యేర్పడుటకు ముఖ్యకారణము, జనాభాలో చాలా హెచ్చుమంది పరిమితమైన పంటభూమిపై తమ జీవితమున కాధారపడుటయే అయియున్నది

ఈ పరిస్థితులలో యీ దిగువ వివరించిన భూమి సమస్యలు ఆంధ్రదేశములోను యితరదేశములలో వుత్పన్నమగు చున్నవి

వ్యవసాయమున కనువగు ప్రస్తుత పంటభూమిని విస్తృతము చేయగలమా

వ్యవసాయముపై ఆధారపడువారి సంఖ్య భూమిభరించ గలదానికి మించియున్నదా? అటులైనచో భూమిపై వత్తిభారమును తగ్గింప గలమా?

ప్రస్తుత వ్యవసాయక పద్ధతులలో మార్పులు చేయుటవలన మాత్రమే ఉత్పత్తి వృద్ధి చెంది రైతు సౌఖ్యమునకు దారితీయగలదా?

పలయు మార్పుల దెచ్చుటకును, దేశ ఆర్థికస్థితివభివృద్ధి పరచుటకును, పైమార్పులు చాలవా? లేక భూమిపై స్వామ్యము కౌలుదారీ పద్ధతి, వ్యవసాయపుకూలి వగైరా పద్ధతులలో కావలసిన రూపకమగు మార్పులు అవసరమా?

వ్యంతిస్వామ్యమునగల మధ్యతరగతి వ్యవసాయదారులుండవలెనా? సమిష్టి వ్యవసాయము లాభదాయకమా? లేక సహకారపద్ధతి ఉత్తమమా?

ఇంకను పెక్కు సమస్యలున్నవి. పైన వివరించినవాటిలో ముఖ్యమైన వాటిని మాత్రము పరిశీలింతము

భారతదేశములో 26 కోట్ల 70లక్షల యకరముల మొత్తపు పంటభూమిలో, 8 లేక 4 కోట యకరాలలో సాధారణముగా ప్రతియేట పంట పండింపబడదు ఈ భూమిని పండించుటకు పలుయత్నములు చేయబడుచున్నవి ఇంకా 15 లేక 16 కోట యకరాలు పంట కనువగు భూమి యని రికార్డులలో గలదు. భారతదేశములో చిరకాలమునుండి వ్యవసాయము (వేల సంవత్సరములనుండి) విస్తృతముగా చేయబడుచుండుటచే సాగు లాయకు భూమియంతయు దున్నబడుచునే యున్నది ఇంక మిగిలినదని యెంచబడుచున్న సాగు లాయకుభూమిని, దున్నుటకును పండించుటకును, చాలా పెట్టుబడి పెట్టవలసియున్నది అంత పెట్టుబడి పెటగలశక్తి, తనకు భూమి కావలెనని కోరేవారిదగ్గర లేదు పైగా అటి భూమి హెచ్చు జనాభాగల ప్రాంతములలో లేదు మెరక ప్రాంతములలో గాని, సముద్రతీరముల దరిని గాని యున్నది అటి ప్రదేశములకు నీటి వసతులను చాలా ఖర్చుతో ప్రభుత్వము చేయవలసియున్నది అచ్చటకి నూతులను త్రవ్వవలెను రహదారుల నేర్పరుపవలెను మలేరియా బాధను తొలగింపవలెను

ఏయే దేశములలో వ్యవసాయమే ప్రధాన వృత్తిగా నున్నదో, అచ్చట ప్రతి యకరాకు పంట తక్కువగా నున్నది మనిషివారీలెక్కను యింకను తక్కువగాయున్నది ఉదాహరణకు ఉత్తర అమెరికాలో పంట 2 57 మెట్రిక్టన్నులైయుండగా, ఆసియాలో 0 22 టన్ను మాత్రమైయున్నది ఈ తక్కువ పరిమాణములకు కొన్ని కారణములను పేర్కొనవచ్చును బలహీనమైన భూములు, అననుకూలమైన కాలపరిస్థితులు, పురాతన వ్యవసాయక పద్ధతులు, అతి హెచ్చుగానున్న గ్రామీణజనాభా, పంటకు లభించు చున్న తక్కువధరలు, పైన వ్రాసినటుల భోజనపదార్థముల వుత్పత్తిని వృద్ధిచేయుటకు నిరంతరకృషి జరుగుచున్నను, లభించిన యొక్క వుత్పత్తికిమించి, జనాభాయభివృద్ధి చెందుచున్న, దేశములో నిదుస్థితి తొలగుట లేదనియే చెప్పవలసియున్నది కావున వ్యవసాయముపై ఆధారపడువారి సంఖ్యను తగ్గించుటత్యంతావశ్యకమైయున్నది వృత్తులలో మార్పు తెచ్చుట కష్టతరమైనపని వ్యవసాయేతరవృత్తులను కల్పించుట కెంతయో ధనము పెట్టుబడిగా కావలెను

కొత్త పరిశ్రమలను స్థాపించి, నిరుద్యోగులకు పని కల్పించుటకు తగినంత పెట్టుబడి లేనందువలననే పంచవర్ష ప్రణాళికలో కుటీర పరిశ్రమలకు ప్రత్యేక స్థానము కల్పింపబడినది

భోజన పదార్థములకు గాని పంటను పండించే భూమి మొత్తము విస్తీర్ణములో నూటకి 18 వంతుని మాత్రమున్నది యీ పంటలలో, గోగునార, పత్తి, తేయాకు, పొగాకు, నూనె దినుసులు ముఖ్యమైనవి మన విదేశపు యెగుమతులలో నూటికి 50% ఆదాయము వీటి వలన లభించును గోగునార పరిశ్రమ మన దేశములోనే కలదు మిగిలిన పదార్థములలో పత్తికూడ దేశములోనే చాల వరకు ఖట్టగా తయారగును, ఈ పదార్థములను విదేశములకు పంపుటలో, ప్రపంచ వర్తకస్థానములలో పోటీచేసి, తక్కువ ధరవరలకు దేశములో తయారు చేయవలసియుండును. మన ఆంధ్రదేశములో పండు భోజనేతర పంటలలో పత్తి, పొగాకు, నూనె దినుసులు (వేరుశనగ) ముఖ్యమైనవి ధాన్యపుపంటమాట వేరుగా చెప్పనక్కరలేదు పైపరిస్థితుల ప్రకారము, ధాన్యము పండించుటతో పాటు, యితర పంటలనుగూడ పండించుచో, మన దేశ పరిశ్రమలు, ముడి పదార్థములు లేక కుంటుపడుటయేగాక, విదేశ వర్తకముకూడ కుంటుపడును

వ్యవసాయాభివృద్ధికి సాధారణముగా యీ దిగువ కష్టము లున్నవి.

1 సరిపోవని నీటి పారుదల సౌకర్యములు
2 మంచి నాగళ్లు వగైరా లేక పోవుట
3 మంచి విత్తనములు, ఎరువులు, దున్నే పశువులు లేకుండుట
4 వ్యవసాయ పరిశోధన రైతుల కందుబాటులో లేకుండుట
5 పంటభూమి, చిన్న చిన్న చీలికలుగల పొలములుగా నుండుట

పైన పేర్కొన్న లోటులను భర్తీ చేయుటకు నేడు మనదేశములో నిరంతర కృషి జరుగుచున్నది ఈ లోపముల నివారణచే, తప్పక పంటలు అభివృద్ధికి రాగలవు కాని వ్యవసాయమునకంతకు మూలాధారమైన మానవుడు ఎక్కువ కృషిచేయుటకు యీ విషయములు తోడ్పడు సాయని సందేహింపక తప్పదు అన్ని సమస్యలకంటె యిదే ముఖ్య సమస్య



## వ్యవసాయానికి సంబంధించిన జనాభా

దేశము యొక్క మొత్తపుటభివృద్ధికిగాని వ్యవసాయము యొక్క యెక్కువ వుత్పత్తికిగాని, పైన వివరింపబడినవి మాత్రమే, సాధనములు కావలవు పంటకు, భూమి ప్రధాన సాధనము. కాని భూమి తనంతటతానే పంట పండించజాలదు. ఎవరో ఒకరు దానిని దున్ని, ఊడ్చి, పంట పండించి కోసి, పండిన పదార్థములను వినియోగింపవలెను ఈపనులన్నియు మానవుడు చేయుచున్నాడు అందువలన యెవరికి ఆదాయము వచ్చుచున్నది ఎక్కువ వుత్సాహముతో పనిచేయ వలెనన్న ఆదాయము యొక్క పంపిణీ పద్ధతి మారవలెనా యనునది ప్రధాన సమస్య అగుచున్నది వ్యవసాయములో పాల్గొనువారు మూడు తరగతులుగా నున్నారు భూస్వాములు 2) కౌలుదారులు 3) వ్యవసాయ కూలీలు

ఇంతవరకును మన దేశములో రైత్వారీ, జమీందారీ (ఇందులో యీనాందారీ, మాలుజారీ, మహాల్వారీ చేరియున్నవి) పద్ధతులున్నవి చాలవరకు రెండవ పద్ధతి రద్దు చేయబడుటచే దేశములో ప్రధానముగా నున్నది రైత్వారీ ద్ధతియేయని చెప్పవచ్చును

## రైత్వారీ పద్ధతిపై విమర్శలు

అములులోనున్న రైత్వారీ పద్ధతి ప్రకారము ప్రభుత్వమునకు నేరుగా తానే పన్ను చెల్లించి పట్టాదారుయుండును పన్ను చెల్లించుటకు లోబడి, ఆయనకు భూమిపై సర్వహక్కులు గలవు అందరు పట్టాదారులు, తామే స్వయముగా వ్యవసాయము చేయక యితరులకు భూమి కౌలుకిచ్చి, శిస్తు తీసుకొనెదరు ఈ పద్ధతివలన వ్యవసాయాభివృద్ధికి నిరోధము కలుగుచున్నదని చాలమంది అభిప్రాయము ఒకటి భూమిపంపకము చాల హెచ్చుతగ్గులతో కూడియున్నదని, కుటుంబములో నున్న మగవారందరు కుటుంబపు ఆస్తిని పంచుకొనుటవలన, పొలములు చిన్నవైనవని చాలామంది యితర వృత్తులు లేక 'కౌలు' కోరుటవలన శిస్తుల హెచ్చినవని, అందువలన కౌలుదారు నలిగిపోవుచున్నాడని అప్పులలో మునుగుచున్నాడని, వ్యవసాయ కూలీలకు, యిచ్చే కూలి వారి శ్రమకు తగినంత లేదని విమర్శించుచున్నారు ఈ పరిస్థితులలో ప్రతియకరాకు పండించవలసినంత పంట పండించుట జరుగుటలేదని, భూస్వామి శిస్తు వసూలు చేసుకొనుటయే దక్క, భూమిపై పెట్టుబడి పెట్టుట మానినాడని, కొత్తవిత్తనములకు, ఎరువులకు, యితర పనులకు కావలసిన పెట్టుబడి కౌలుదారు పెట్టుకొనలేక పోవుటచే అభివృద్ధి నిరోధింపబడి దేశములో పంట మొత్తమే కొరతపడుచున్నదని విమర్శకులు చెప్పుచున్నారు కౌలునకు కాలపరిమితి గాని, కౌలుషరతులకు గాని, శిస్తుమొత్తమునకు గాని స్థాపన నిర్ణయములు లేకుండుట కౌలుదారులకు నష్టదాయకమని కూడ వివరించుచున్నారు.

## చిన్నపట్టాదార్లకు రక్షణ: భూవసతికి గరిష్ఠపరిమితి

డాక్టరు వి వి రామనాథంగారు, మదరాసురాష్ట్రములో చిన్న పట్టాదారులు తమ భూములను పెద్ద పట్టాదారుల కమ్ముచున్నారనియు. గ్రామములలో కాపురములేనివారే హెచ్చుగా భూములను కొనుచున్నారనియు, విపులముగా తాము సేకరించిన లెక్కల ప్రకారము నిరూపించుచున్నారు ఈ పరిస్థితి నెదుర్కొనుటకు రెండురకముల శాసనము అవసరమగును ఏ ఒక్కరును, నిర్ణీత గరిష్ఠప్రమాణమునుమించి, భూమిని కలిగియుండరాదు భూమిని విక్రయించునపుడు వ్యవసాయము వృత్తిగా కలవారికే దక్క, యితరులకు అమ్మరాదు మొదటరకపు శాసనము, బొంబాయి రాష్ట్రములోను రెండవరకపు శాసనము, పంజాబులోను అములులోనున్నవి ఇట్టి శాసనములవల్ల భూముల అమ్మకపు ధరవరలు తగునవియు, అందువలన రైతుల పరపతి తగ్గునవియు కొందరు అభిప్రాయపడుచున్నారు మదరాసుప్రభుత్వము నియమించిన సుబ్రహ్మణ్యం కమిటీవారు యికముందు ఏ రైతుకును రు 250 లకన్న హెచ్చు శిస్తుచే భూమికి మించి యుండరాదని సిఫార్సు చేసిరి పంచవర్ష ప్రణాళికలో కూడ ఈ యేర్పాటుగలదు కావున భారతదేశమందంతటను వచ్చే రెండు సంవత్సరములలో ఈ భూమిసంస్కరణ శాసనములు అములులోనికి రావచ్చును అయితే గరిష్ఠప్రమాణము తక్షణమే అములులోనికివచ్చి, నిర్ణయింపబడిన ప్రమాణమునకు మించిన భూమి, ఆ భూస్వామివద్ద నుండిన ప్రభుత్వంగను తీసుకొనవలెనా? లేక గరిష్ఠప్రమాణము ఇకముందునుండి అములులోనికి తీసుకొనివలెనా యను విషయము నిర్ణయము కాలేదు అటుల తీసుకొనినభూమికి నష్టపరిహారమివ్వ వలసి యుండును నష్టపరిహారమివ్వకుండ భూమిని స్వాధీనము తీసుకొనుటకు రాజ్యాంగచట్టము ఒప్పుకొనదు, గరిష్ఠ ప్రమాణము నిర్ణయించుటకూడ కష్టసాధ్యమైనపని మెరక, పల్లములనుబట్టి లేదా, నీటివసతుల సౌఖ్యములోనున్న తేడా పరిశీలించవలసియున్నది ఏది ఎటులున్నను వ్యంతిభూమికి గరిష్ఠ ప్రమాణమును నిర్ణయించే శాసనములను అతిత్వరితముగా అములులోనికి తెచ్చుట ఆవశ్యకము

## కౌలు పద్ధతి

భూములను కౌలుకిచ్చుట మానవలెననియు, లేక మాన్పించవలెననియు, కౌలుకిచ్చుటవలన భూస్వాములు భూములకుదూరమై భూములపై పెట్టుబడి పెట్టుట వ్యవసాయాభివృద్ధినిరుంటు పరచుచున్నారని పెక్కుమంది అభిప్రాయము భూములను కౌలుకిచ్చు పద్ధతి చాలా దేశములలో నున్నది బర్మా, చైనా, జపాను, భారతదేశములలో మొన్న మొన్నటివరకు నూటికి 50 వంతులభూమి యీ తీరున వ్యవసాయము చేయబడుచుండెడిది మధ్యప్రాచ్య దేశములయందును, దక్షిణ అమెరికాలోను ఈ పద్ధతి అములులో యున్నది కౌలుకిచ్చుటతగనిపనికాదు. శిస్తుపరిమితమై, కౌలు కాలపరిమితి సుదీర్ఘముగనున్నచో, ఈ పద్ధతిలో కూడ మంచిలేకపోలేదు శిస్తు ధనరూపకముగను, ధాన్యరూపకముగను నుండును కొన్ని విషయములలో, భూస్వామి పెట్టుబడిలో కొంతభాగమును పంచుకొనును చాల విషయములలో (ముఖ్యముగా వరిపంట విషయములో) భూస్వామి ఎకరాకు 10-12 బస్తాలు శిస్తుతీసుకొనును గడ్డిలో భాగముకోరును పైరు పంటలున్న ఒకభాగమియ్యవలెను రెండవపంటలో (జిల్లాలలో) కూడ భూస్వామి భాగముకోరుట అరుదుగాదు. పండించే పంటనుబట్టి కూడ శిస్తురూపమున అరిగిన యొక విచారణ ఫలితముగా తేలినవిషయమేమనగా, గుంటూరు, పశ్చిమగోదావరి జిల్లాలలో పొగాకుపండేభూమికి శిస్తు రూ 800 నుంచి 850 లు గను, చెరకుభూమికి రు 400 లు నుంచి 500 గను యుండినటుల తేలినది కౌలు యొక్క కాలపరిమితి సాధారణముగా మూఖాముఖీగా నుండును అట్టి కౌలుకు ఒక సంవత్సరమే కాలపరిమితి కొన్నికాగు షరతులతో రిజిష్టరు చేయబడును అట్టి కౌలు సాధారణ

(66 వ పేజీ చూడుడు)


శ్రీ చందూలాల్ త్రివేది


శ్రీ టంగుటూరు ప్రకాశం

# 'సుగుణ సంపదగల ఆంధ్రులు సమైక్యంగ ముందంజ వేయాలి'

## — గవర్నర్ త్రివేది సందేశం

"అక్టోబరు 1 వ తేదీ భారత దేశచరిత్రలో ఒక చరిత్రాత్మక ఘట్టం అందులో ఆంధ్రులకు వారి చరిత్రలో అపూర్వ సంఘటన ఇలకై ఏళ్ల తరబడి కలలు గంటున్న రాష్ట్రావతరణమునుకళ్లారా చూచి ఆనందించే మహద్భాగ్యం కలిగింది ఈ చారిత్రాత్మక, మహోత్సవ సమయంలో ప్రత్యేకసంచికను వెలువరించడానికి "ఆంధ్రపత్రిక" పూనుకోవడం అన్నివిధాలా సముచితంగా ఉన్నది

ఈ పత్రికా ముఖాన నా హృదయపూర్వక శుభాకాంక్షలు ఆంధ్ర రాష్ట్రానికి, ఆంధ్రప్రజానీకానికి అందజేయటం మహదవకాశంగా భావిస్తున్నాను ఆంధ్రరాష్ట్రాన్ని ఆశీర్వదించవలసినదని పరమేశ్వరుని ప్రార్థిస్తున్నాను ఈ మహోత్సవ సమయంలో ఒక్కవిషయం మట్టుకు చెప్పదలిచాను సుగుణాలు కలిగిన ఆంధ్ర ప్రజానీకం సమైక్యంగా అన్నిరంగాలలో స్వాతంత్ర్యాన్ని వృద్ధిచేసుకుంటూ తద్వారా భారత ప్రభుత్వానికి వన్నెతేగల విధంగా వ్యవహరించ గలరనే విశ్వాసాన్ని వెల్లడిస్తున్నాను



డా॥ అనంతశయనం


బెజవాడ రామచంద్రారెడ్డి


కొత్త రఘురామయ్య


బి. రాజగోపాలరావు


నూరిక్కి రామశేషయ్య


డాక్టరు లంక సుందరం


ఎస్ రాఘవాచారి


గూళెపేరి బసవపున్నయ్య


కడియాల గోపాలరావు


శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య


ఎస్. వి. ఎల్. నరసింహం


ఈశ్వరరెడ్డి


మంగళగిరి నానాదాసు


చదలవాడ బుచ్చికోటయ్య


ప్రధాన న్యాయమూర్తి శ్రీ పి. వి. రాజమన్నార్


మధ్యప్రదేశ్ గవర్నర్ డా॥ పట్టాభి సీతారామయ్యగారు


ఆంధ్రమహాసభ కార్యదర్శి శ్రీ వెన్న య్యశాస్త్రి


ఆంధ్ర వాణిజ్యమండలి అధ్యక్షుడు వి. సూర్యనారాయణ

## పార్లమెంటు ఆంధ్రసభ్యులు


మద్రాసు ముఖ్యమంత్రి శ్రీ రాజగోపాలాచారి


మరపురాని మన రచయితలు శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు


ఉ ఉ


శ్రీ తల్లాప్రగడ రాజేశ్వరమ్మగారు

ఇదే సంచికలో 81వ పుట యందు ప్యారీ సీతారాం, వర్ బి యస్ రావుగార్ల బొమ్మలు పొరపాటుగా పడినవి పాఠకులు వానిని సవరించుకొనగోరెదము.

—సంపాదకుడు


ఉపాధ్యక్షుడు డా సర్వేపల్లి రాధాకృష్ణన్


శ్రీ బూదరాజు వత్రాత్రేయులు ఆంధ్ర ప్లానింగ్ భూమితో భాగ్యాంకు కార్యదర్శి


శీఘ్రనిర్ణయ వ్యవసాయ బోర్డు దాదాసు డా శాస్త్


కీ॥ శే॥ పండిట్ డి గోపాలాచార్యులు

In the year 1843 the Madras Government received copies of this book from the India House accompanied (see page 1182) by a request that all public authorities should be called on to give some aid in correcting them, and supplying such information as was deficient. About thirty copies were in course of time received back from as many offices. were sent by Government to the Madras College Board, who ~~referred them to me~~ ~~were examined by me~~ Only about fifteen copies ~~were~~ has been carefully filled up and of these about eight furnished valuable information. (see page 1183-1184) I completed the task on 27 March 1843.

I had previously compiled my Glossary (see ce pi ter) of Hindustani and other foreign words used in Telugu. That Glossary alone exceeded all the contributions of others.

From all these sources I selected such words as suited the purpose declared in the Letter of Instructions and thus formed a Glossary which was transmitted to England in my Kar's writing. Of that one the present is a copy.

C. P. Brown Dec 1845

To this copy I have since added many words & meanings collected in reading. Jan 1850

అన్ని శతాబ్దములు, ఉపయోగకరమైన విద్యా ధర్మంలో ఎంతో కృషిచేసి విజయం సాధించిన, తెలుగువాడు కాకపోయినా తెలుగు పదకోశాల రచనలో ఆంగ్ల-ఆంధ్ర నిఘంటువులు, ఇంకా ఇతర గ్రంథాలు రచించి ఆంధ్రభాషకు అమూల్యంగా సేవ చేసిన సి పి బ్రౌను గారి ఆంగ్ల-ఆంధ్ర పారిభాషిక పదకోశంలోని, చేతివ్రాత ప్రతి.

# ఆంధ్రదేశము గర్వించదగిన ఆధునిక ఔషధోత్పత్తి సంస్థ

సౌత్ ఇండియా రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ లిమిటెడ్, విజయవాడ, ఒక ప్రధానమైన ఔషధోత్పత్తి సంస్థ. ఇది 1950లో స్థాపించబడినది. అప్పుడు ముఖ్యమంత్రిగా వుండిన శ్రీ పి యస్ కుమారస్వామి రాజాగారు ఈ సంస్థకు ప్రారంభోత్సవం జరిపారు


శ్రీ పి ఎస్ కుమారస్వామిరాజాగారు ప్రారంభోత్సవం జరిపినప్పటి చిత్రం

ఈ ఇన్‌స్టిట్యూట్ లివర్ ఎక్స్‌ట్రాక్టు ఔషధాలను, విటమిన్ ప్రాడక్టులను, ఇంకా నిత్యకృత్యంలో వైద్యానికి అవసరమైన మందులను అనేకమైనవాటిని తయారుచేస్తున్నది. ఇవి ఆంధ్రదేశంలోను, ఇతరచోట్లనుకూడ చాల పేరుపొందినవి.

ఈ కంపెనీ మానేజింగ్ డైరెక్టరు డాక్టరు కె సుబ్బరాజుగారు, యం యస్ (కాలిఫోర్నియా) వీరే టెక్నికల్ డైరెక్టరుకూడ అయియుండి ఉత్పత్తిని స్వయంగా పరిశీలిస్తున్నారు వీరు శాన్‌ఫ్రాన్సిస్కోలోని కాలిఫోర్నియా విశ్వవిద్యాలయమందు ఔషధోత్పత్తి శాఖలో పోస్టు గ్రాడ్యుయేటు యూనివర్శిటీ, అమెరికాలోను విస్తారంగా పర్యటించి ఔషధాల తయారుచేసే పద్ధతులలో విశేషజ్ఞానం, అనుభవం గడించినవారై, విజయవాడలో ఈ పరిశ్రమను స్థాపించి సమర్థతతో నడుపుచున్నారు ఈసంస్థ ప్రఖ్యాతిమానమై డాక్టర్ల ప్రశంసను పొందినదై, దినదినాభివృద్ధి చెందుతున్నది నేడు వీరు తయారు చేస్తున్న ఔషధాలు దక్షిణ ఇండియా అంతటను, దక్కనులోను, బొంబాయి, ఒరిస్సా రాష్ట్రాలలోను విస్తారంగా అమ్ముడుపోతున్నవి

ఈ ఇన్‌స్టిట్యూటు డైరెక్టరును, అనుభవజ్ఞులైన వ్యాపారస్తులును అగు శ్రీ పి కె షారాఫ్, బి, యస్‌సి గారు కంపెనీ మానేజిమెంటు విషయాలలో వీరికి సహకరిస్తున్నారు.

ఈ లాబొరేటరీ ఆధునిక యంత్రసామగ్రి కలిగి యున్నది విటమిన్లను పరీక్షించటానికిగాను "ల్యూమెట్రాన్ ఎలెక్ట్రానిక్ ఫోటోమీటర్"ను కలిగియున్న సంస్థ ఈ ప్రాంతాలలో ఇది ఒక్కటే ఒకటి


ల్యూమెట్రాన ఎలెక్ట్రానిక్ ఫోటో మీటర్

ఔషధములు తయారుచేయుటలో ఈ సంస్థ నిరంతరము తీసికొను విశేష శ్రద్ధయే దీని విజయానికి కారణం ఈసంస్థకు అధికమైన ఉత్పత్తి శక్తి ఉంటటంవల్ల, దీని ఔషధాలకు నానాటికి గిరాకీ హెచ్చుతున్నా ఇది నిర్వహించగలుగుతున్నది

సమర్థంగా పనిచేస్తున్న ఈ సంస్థను, పెద్ద అనేకులు సందర్శిస్తున్నారు ఇటీవల మద్రాసు రాష్ట్ర గవర్నరు శ్రీ ప్రకాశగారు సందర్శించిన భాగ్యం ఈ సంస్థకు అబ్బింది


మూడవ వార్షికోత్సవము


## గవర్నరు శ్రీప్రకాశ ఈ సంస్థను దర్శించి, ఆశీర్వదించిరి

బహుశీఘ్రంగా అభివృద్ధి చెందుతున్న ఈ సంస్థ విస్తరణ కార్యక్రమాన్ని చురుకుగా సాగిస్తున్నది కేంద్ర ప్రదేశంలో ఒక నాగా కొనబడి మిక్కిలి ఆధునికమైన ఎయిర్ కండిషను చేయబడిన భవనము నిర్మించటానికి ప్లాను వేయబడింది. నిర్మాణం త్వరలో ఆరంభింపబడనున్నది. ఇప్పుడున్న బిల్డింగులు ఆధునిక పద్ధతులను మార్పులు చేయబడి ఎయిర్ కండిషను చేయబడినవి ఇది ఒక నవ యంత్రసామగ్రి కలిగిన ఒక ఆదర్శప్రాయమైన లాబొరేటరీ ఆంధ్రదేశానికి నిశ్చయంగా గర్వకారణమైనది


మద్రాసు నివాసులు స్థాపకులు ఎర్ ముత్యా వెంకటసుబ్బారావు దంపతులు

# విద్యార్థి సమస్యలు

రచన: నరాల చెన్నారెడ్డి

నలభైయేండ్ల పోరాటము ఫలితంగా, స్వర్గీయ శ్రీ పొట్టి శ్రీరాములుగారి ఆత్మబలిదానముతో మన ఆంధ్ర రాష్ట్రము ఈనాడు సిద్ధించింది. ముక్కోటి ఆంధ్రులకు నూతనయుగం ప్రారంభమైంది. రాష్ట్రం సంపాదించుటలో అందరితో పాటు ప్రాతినిధ్యం వహించిన ఆంధ్ర విద్యార్థులలో చైతన్యం ప్రబలింది.

ఆంధ్రరాష్ట్ర పురోభివృద్ధికి విద్యార్థులంతా భేదాభిప్రాయాలు లేకుండ సుహృద్భావముతో ఎంతో కృషి సల్పవలసిన సమయము ఆసన్నమయినది. భవిష్యత్తులో రాష్ట్రము ఎదుర్కొనుచున్న అనివార్యమైన, మహత్తరమైన చిక్కులను తొలగించే భారము విద్యార్థులమీద వున్నది.

సర్కారు జిల్లాలలో నేడు 26 సైన్సు కళాశాలలు 10 ఓరియంటలు కళాశాలలు 9 వృత్తికళాశాలలు, 875 ఉన్నత పాఠశాలలు వున్నాయి. రాయలసీమలో 1916 వరకు కళాశాలలే లేవు. రాయలసీమ నాలుగు జిల్లాల 8 తాలూకాలలో, 5 సైన్సు కళాశాలలు, అనంతపురములో ఒక వృత్తి కళాశాల, ఒక ఆయిలు టెక్నాలజీ కళాశాల, 155 ఉన్నత పాఠశాలలు మాత్రమే వున్నాయి. ఈ సంవత్సరము తిరుపతిలో ఒక మహిళా కళాశాల, కర్నూలులో ఒక టీచర్ల ట్రెయినింగు కళాశాల స్థాపించబడినవి. బళ్లారిలో ఒక పాలిటెక్నిక్ కళాశాల రాయలసీమ విద్యార్థులకని నెలకొల్పబడినది. ఈ కళాశాలలన్నీ నేటివరకు మద్రాసు విశ్వవిద్యాలయమునకు అనుబంధముగా వున్నాయి.

రాయలసీమ విద్యార్థులలో చైతన్యము ప్రబలింది. అది నాయకుల దాకా ప్రాకినది. రాయలసీమ విద్యార్థి సంఘము ఒకటి ఏర్పడి తమ హక్కుల కొరకు పోరాడుతున్నది. విద్యార్థులందరు శ్రీ సి. ఆర్. రెడ్డిగారి సూచన ప్రకారము అనంతపురములో పోస్టు గ్రాడ్యుయేట్ కోర్సులు యేర్పాటుచేసి ప్రస్తుతం మద్రాసు విశ్వవిద్యాలయ నిర్వహణలో వున్న రాయలసీమ కళాశాలలన్నిటిని ఆంధ్ర విశ్వవిద్యాలయమునకు అనుబంధంగా చేర్చాలని, రాయలసీమకు ప్రత్యేక విశ్వవిద్యాలయము ఒకటి తిరుపతిలో స్థాపించాలని, ముక్తకంఠముతో చాటినారు.

1926 లో మద్రాసు విశ్వవిద్యాలయంనుంచి ఉద్భవించిన ఆంధ్ర విశ్వవిద్యాలయం డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి, డాక్టరు సర్వేపల్లి రాధాకృష్ణన్, డాక్టరు వి. ఎస్. కృష్ణాగారల కృషి ఫలితముగా, గత 28 సంవత్సరాలలో ఉత్తరోత్తర కళంకరించింది. రాయలసీమ విశ్వవిద్యాలయం ఒకటి స్థాపించి దానికూడ అలాగే అభివృద్ధిచెయ్యాలి. దీనికి తగినస్థానము "తిరుపతి" యని సూచించారు.

ప్రస్తుత రాయలసీమ కళాశాలలన్నింటిని ఆంధ్ర విశ్వవిద్యాలయములో చేర్చి తిరుపతిలో ప్రత్యేక విశ్వవిద్యాలయము నెలకొల్పాలి.

నూతనాంధ్ర రాష్ట్రంలో విద్యార్థుల ఆశయాలు సఫలీకృతం కావాలంటే క్రమశిక్షణ అవసరం ప్రతి విద్యార్థి తనలో సోదరత్వ ముందని దృఢంగా నమ్మి రాష్ట్ర క్షేమము కొరకు పాటుపడాలి. విద్యార్థులందరు నిర్బంధ సైనిక "శిక్షణ" అలవరచుకోవాలి.

ఉత్తరప్రదేశ్‌లో ప్రతి కళాశాలలోను ఈ నిర్బంధ సైనిక శిక్షణ అమలులోకి వచ్చింది. ఆంధ్ర విశ్వవిద్యాలయంకూడ ఈ విషయమై శ్రద్ధ తీసికొని ఆంధ్ర విద్యార్థులందరు "నిర్బంధ సైనిక శిక్షణ" అలవరచుకొనునట్లుగా చూడాలి. అప్పుడే రాష్ట్ర విద్యార్థులందరు వారి వారి బాధ్యతలు కర్తవ్యం గుర్తించగలరు.

కేంద్రప్రభుత్వం ప్రవేశపెట్టిన పంచవర్ష ప్రణాళికలో "కమ్యూనిటీ ప్రాజెక్టు"లు ఒక భాగం. కమ్యూనిటీ ప్రాజెక్టుల ద్వారా దేశాన్ని సౌభాగ్యవంతంగా చేయుటకు విద్యార్థులంతా కృషి చెయ్యాలి. తరుగురాష్ట్రంగా పరిగణించ బడుతున్న ఆంధ్రరాష్ట్రంలో కమ్యూనిటీ ప్రాజెక్టులద్వారా సాధించవలసింది ఎంతైనా వుంది. ఇంతవరకు ఆంధ్ర విద్యార్థులు కమ్యూనిటీ ప్రాజెక్టులద్వారా కొన్ని ఆశయాలను నెరవేర్చుకొనగలిగారు. నూతనాంధ్ర రాష్ట్రంలో ప్రవేశపెటనున్న ప్రణాళికలన్నింటికి విద్యార్థుల సహకారం ఎంతైనా కావాలి.

రాయలసీమ కరువు రోజుల్లో, గోదావరి వరదల బీభత్సంవలన ఏర్పడిన అనివార్యక్లిష్ట పరిస్థితుల్లో ఆంధ్ర విద్యార్థులు చేసిన సేవ అమోఘం. ఆంధ్ర విద్యార్థిలోకం దేశంలో అందరి మెప్పు బడిసిందనుటలో సందేహము లేదు.

ఆంధ్ర విద్యార్థులు ఇంతవరకు చేసిన సేవకు, రాష్ట్రావతరణ తరువాత చేయవలసిన అమోఘ కృషికి పురోగమనం ఎంతైనా కన్పించాలి. విరామ సమయాలలో, సెలవు రోజులలో విద్యార్థులు గ్రామాభివృద్ధికి తోడ్పడుట వుత్తమము. 100 కి 15 మందైనా చదువుకున్నవారు లేని మన దేశంలో, వయోజన విద్యకు తోడ్పడాలి. ప్రజలకు ప్రభుత్వానికి ఆదర్శ ప్రాయులుగా వుండి ఆంధ్రులోకాన్ని ఇంద్రలోకంగా మార్చగలరని అందరము ఆశిద్దాం.

# ఆంధ్ర దేశంలో వ్యాయామోద్యమం

[70 వ పేజీ తరువాయి]

డాక్టరు మూంజె, శంకర్కర్ గారు "ఆంధ్రదేశములో వ్యాయామ విద్య యింత సజీవముగాయుండుట ప్రశంసార్హమని" అన్నమాటలు యిప్పటికిని నా చెవులలో ప్రతిధ్వనించుచున్నవి మనరాష్ట్రములో మూడు సంప్రదాయములు గలవు. (1) బొబ్బిలి, (2) పల్నాడు, (3) వెంకటగిరి. దురదృష్టవశమున మన సంప్రదాయానుకూలముగా వ్యాయామ విద్య అబ్బలేదు. నేను బరోడాలో శ్రీ రాజరత్న, యశ్వంత, గజానన్ మాణిక్యరావుగారివద్ద వ్యాయామ విద్య నేర్చుకొని గుంటూరు, బెజవాడలలో హనుమత్ వ్యాయామ కళాశాలలను స్థాపించి నేర్పితిని. చాలామంది యువతీయువకులు నేర్చుకొనిరి. కాలేజి విద్యార్థులతోపాటు గరికపాటి వీరరాఘవయ్యగారు (గుంటూరు)కూడా శ్రద్ధాభక్తులతో నావద్ద విద్య నభ్యసించిరి నా చిన్నతనమున మా బాపట్లలో శ్రీ అదూరి రాధాకృష్ణమూర్తిగారివద్ద వ్యాయామవిద్య నేర్చితిని. తరువాత కోడి రామమూర్తి నాయుడుగారికి అంతరంగిక కార్యదర్శిగా యుండి నకాలములో, లోకమునకు చేర్పిన వ్యాయామ విద్యకు వన్నె దిద్దించుకొంటిని. బాపట్లలో శ్రీ దాసరి నారాయణమూర్తిగారు మల్లవిద్యలో మేటి. శ్రీ మలిసెట్టి కృష్ణారావుగారు వ్యాయామము యందు అభిమానము కలిగి మొదట నెంకటూరు ప్రస్తుతము కోయంబత్తూరులోను వ్యాయామవిద్య వ్యాపకము నకు తోడ్పడుచున్నారు. విజయవాడలో ప్రకృతి శర్మగారు యోగాసనములు సూర్యనమస్కారములు శాస్త్రసమ్మతముగా నేర్పుట సంస్తవనీయము.

## వ్యాయామ పద్ధతులు

శరీర వ్యాయామ పద్ధతులలో ముఖ్యమైన యీ క్రిందివాటిని వివరించుచున్నాను. (1) అంగవిన్యాస శిక్షణము (2) ఎముక అభివృద్ధిచేయు అభ్యాసములు (3) కండరములను బలిష్టము చేయు పద్ధతులు (4) చురుకుతనమును అభివృద్ధిచేయు అభ్యాసము (5) కలిసికట్టుగా నడుగుటతోకూడి క్రమముగా చేయు అభ్యాసములు. ఇవన్నియు వివిధవయస్సులు కల విద్యార్థులకు అనుకూలించేటట్లు సరికరణము చేయబడినవి. ఇవి దాతి, పాట్లు, చేతులు, కాళ్లకు సంబంధించినవిగా చెప్పవచ్చును. సరియైన పద్ధతులలో వ్యాయామము అభ్యసించినయెడల క్రమశిక్షణము, సభ్యత, ఆత్మవిశ్వాసము మొదలైన గుణసంపదయేర్పడును. శ్వాసకోశం బలపడి, రక్తము శుద్ధిపడి, హృదయము దృఢతరమగును. ఆకలి, జీర్ణశక్తి అభివృద్ధినొందును. బుద్ధి వికసించును.

## క్రియా విధానము : తూష్ణీ విధానము

మన జాతీయ విధానమును రెండు భాగములుగా విభజింపవచ్చును. (1) క్రియా విధానము (2) తూష్ణీ విధానము. రెండవరకములో నాలుభాగములు కలవు. (1) తైలముతో శరీరమును మర్దింపచేసుకొనుట (2) తైలము, లేకయే శరీరమును మర్దింప చేసుకొనుట (3) వతనముచే ఏకమై గట్టిబడిన కండరములను శాస్త్రసమ్మతముగా వణికింపు సహాయమున యథాస్థానమునకు చేర్చుట (4) విపరీత గమనముచే బిగుసుకపోయిన కండరములను సడలించుట.

క్రియా విధానములో ఉపకరణములచే వ్యాయామము చేయుట (2) ఉపకరణములు లేకుండా వ్యాయామము యభ్యసించుట (3) జట్టుగా అభ్యసించుట (4) ఒంటరిగా అభ్యసించుట మొదలైన పద్ధతులున్నవి. ఒంటికర్రసాము, రెండుకర్రలసాము, లాఠీవరసలు, వజ్రముష్టి, విలువిద్య మొదలైనవి ఉపకరణములతో చేసెవి. సూర్యనమస్కారములు, యోగాసనములు, మల్లయుద్ధము, బస్కీలు మొదలైనవి ఉపకరణములు లేకుండా చేయునవి. అన్నియు క్రమముగా ఏర్పడియున్నవి. గనుక జట్టుగా చేయుటకు వీలుగాయున్నవి. కావలెనంటే ఒంటరిగా చేయవచ్చును అన్ని విధానములగా పిల్లలకును, వడివయస్సువారలకును, వయోజనులకును అభ్యసించుటకు వీలైనట్లు క్రమముగా ఏర్పాటు చేయబడినవని గమనింపవలెను.

## వివిధ అంగాలకూ శక్తి

యోగాసనములు, బస్కీలు, సూర్యనమస్కారములు ముఖ్యముగా దాతి, దండలు, కడుపు, కాళ్లను బలిష్టము చేయును. మన ప్రాణాయామ పద్ధతి శాస్త్రసమ్మతమైన ఆరోగ్యాభివృద్ధిని చేయును. మన అభ్యాసములో ప్రధానమైన ఫలితమే మన శరీరముయొక్క బరువును ఏ ఒక అవయవముపై మోపుటకు శక్తి కలుగును ఒకే తోట కూర్చొని పనిచేయువారలకు తాతి, లాఠీ త్రిప్పుట, మొదలైనవి రక్తనాళములలో రక్తమును ధారాళముగా ప్రవహింపచేసి శరీరానికి చురుకుదనమును చేకూర్చును. లేజీము అను పద్ధతిలో, వంగడము, ఎగురుట, తన్నుట, పరుగెత్తుట మొదలైన అంగవిన్యాసములు కలవు. అందువలన ఇది అభ్యసించువారలకు శరీరములోని పలుభాగములు బలముగా యుండును. మల్లయుద్ధము మన విధానములో ఒక ముఖ్య అంగము.

"శరీర మాద్యంఖలు ధర్మసాధనం"

# William Jacks & Co. Ltd.

NATIONAL BANK OF INDIA BUILDINGS, FIRST LINE BEACH, MADRAS-I

PHONE: 3226—55129. GRAM· LIMPET.

## AGRICULTURAL MACHINERY


OLIVER CRAWLER TRACTOR

Tractors, Tillage Implements and General Farm Machinery, including ploughs, harrows, cultivators, threshers, seed drills etc. Also "Jacks" Trailers for every purpose.


OLIVER R C WHEEL TRACTOR WITH MOUNTED BUSTER LISTER


RANSOMES COUNTESS DISC HARROW






'JACKS' TRAILERS

## SOLE AGENTS IN INDIA FOR

### BRITISH AGENCIES

| | |
|---|---|
| WILLIAM ASQUITH LTD. | Radial Drilling and Horizontal Boring Machines |
| BRAYSHAW FURNACES & TOOLS LTD | Furnace Specialities |
| BRITISH TIMKEN LTD | Tapered Roller Bearings |
| FISCHER BEARINGS CO LTD | Ball and Cylindrical Roller Bearings |
| B S A TOOLS LTD | Single and Multi spindle Automatics |
| COVENTRY GAUGE & TOOL CO LTD | Precision Measuring Equipment |
| CRAVEN BROS (MANCHESTER) LTD | Machine Tools for Railway Workshops and other Heavy Industries |
| DEAN SMITH & GRACE LTD | Precision Centre Lathes |
| DAVY & UNITED ENGINEERING CO LTD | Rolling Mills & Forging Machinery |
| F J EDWARDS LTD | Sheet Metal Working Machines |
| HILGER & WATTS LTD | Precision Instruments for Inspection |
| A A JONES & SHIPMAN LTD | Grinding Machines—Internal External and Universal |
| SWIFT SUMMERSKILL LTD | Heavy Duty All Electric Planers |
| TAYLOR TAYLOR & HOBSON LTD | Engraving and Die sinking Machines |
| WADKIN LTD | Wood working Machinery |
| GRAHAM & NORMANTON D MITCHELL & CO | Centre Lathes |
| ALLEN WEST & CO LTD | Electric Starters and Switchgear |
| AGA HEAT LTD | Aga Cookers |
| BRITISH STEEL PILING CO LTD | Larssen Steel Piling and Pile Driving Equipment |
| CARBORUNDUM CO LTD | Grinding Wheels Crucibles Abrasives |
| COVENTRY CLIMAX ENGINES LTD | Fork Lift Trucks |
| A F CRAIG & CO LTD | Sugar Mill Machinery |
| CRITTALL MANUFACTURING CO LTD | Crittall Steel Windows Doors and Sashes |
| FIRTH BROWN TOOLS LTD | Wood working and Metal working Tools |
| FIRTH VICKERS STAINLESS STEELS LTD | Staybrite Stainless Steel Sheets and Bars |
| LAURENCE SCOTT & ELECTRO. MOTORS LTD | Electric Motors and Generators |
| PELAPONE ENGINES LTD | Vertical Diesel Engines |
| PYRENE CO LTD | Fire Extinguishers and Fire Fighting Equipment |
| RANSOMES SIMS & JEFFERIES LTD | Agricultural Implements |
| ROBEY & CO LTD | Horizontal Diesel Engines Steam Boilers |
| THOMAS FIRTH & JOHN BROWN LTD | Tool Alloy and Speedicut' High Speed Steels |
| E R & F TURNER LTD | Flour Mill Machinery |
| WESTLAND AIRCRAFT LTD | Helicopters |
| WINGET LTD. | Concrete Mixers Stone Crushers, Batching Plants, etc. |

### AMERICAN AGENCIES

| | |
|---|---|
| AUSTIN WESTERN CO | Motor Graders |
| BARBER GREENE CO | Road Construction Machinery |
| LeTOURNEAU WESTINGHOUSE CO | Earth moving Machinery |
| MURPHY DIESEL CO | Diesel Engines and Diesel Generating Sets |
| NORTH WEST ENGINEERING CO | Diesel-operated Shovels Drag Lines etc. |
| THE OLIVER CORPORATION | Tractors and Agricultural Implements |

## CONSTRUCTION EQUIPMENT

LeTourneau High Speed Rubber-tyred earth moving machinery Northwest Excavators, Barber-Greene material handling and Bitumenous mixing and spreading machines, Pegson Crushing and Screening Plants Winget Concrete Mixers & Batching Plants, Pile Driving Plants etc.


WINGET CONCRETE MIXER

Le TOURNEAU EARTH MOVERS


TOURNAPULL WITH CARRYALL SCRAPERS

INTERCHANGABLE WITH


18 TON TOURNAHOPPER &


18 TON TOURNAROCKER


BARBER GREENE MIXALL

## MACHINERY & EQUIPMENT


COVENTRY CLIMAX FORK LIFT TRUCK

Oil Sugar and Flour Mill Plant, Laundry Plant, Diesel Engines Pumps and Sprayers, Bulk Loaders, Fork Lift Trucks and other mechanical handling plant, etc.


ROBEY HORIZONTAL DIESEL ENGINE


PELAPONE RICARDO DIESEL ENGINE


PUMPING SETS


TIMKEN TAPERED ROLLER BEARING

## ELECTRICAL EQUIPMENT


L. S. E MOTOR


L S E WELDING GENERATOR

Motors, Generators, Transformers, Welding Sets, Cables, etc.

## ENGINEERING & HARDWARE STORES


CRITTALL WINDOWS


AGA COOKER

H S and Alloy Steels, Stainless Steel, Metal Doors and Windows, Abrasives, Crucibles, Waterproof Paper, Waterproofing Compound, Wire Fencing, Aga Cookers, Fire Fighting Equipment, Timken Tapered Roller Bearings, Fischer Ball and Cylindrical Roller Bearings, etc.

## MACHINE TOOLS & WOOD-WORKING MACHINERY

All types of Machine Tools, Small Tools, Measuring Instruments, Precision Instruments, Foundry and Furnace Equipment, Wood Working machines, etc.


WADKIN MORTISING MACHINE


RUSHWORTH GUILLOTINE SHEARING MACHINE


B S A AUTOMATIC SCREW MACHINE



GRANOR LATHE

# Ask Jacks about it

Branches: BANGALORE • BOMBAY • CALCUTTA • DELHI.

